


# విషయసూచిక.

# తొలిపలుకు



కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రిగారు ప్రసిద్ధ విద్వాంసులు. 'కళాప్రపూర్ణాది' బిరుదములఁ బొందినవారు. నెల్లూరు మండలమునకు మండనమై అఖండఖ్యాతి నలవరించినవారు. వారికి వారి శిష్యులు నెల్లూరునగరమున నాలుగు సంవత్సరములుగా, వర్ధంత్యుత్సవమును జరుపుచున్నారు. అది చాలఁగొనియాడఁదగినవిషయము. కవిసార్వభౌములు (ఇప్పుడు) కళాప్రపూర్ణులు, మహామహోపాధ్యాయులు, ఆంధ్రవ్యాసులు, బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిట్లు ప్రశంసించియున్నారు:—

"సీ. వేంకటరాయ పృథ్వీదేవశిష్యులై
పేరుపొందిరి నేలటూరివంశ
రత్నాకరోజ్జుఁడు రామదాసయ్యయు
గునుపాటి యేనాది ఘనయశుండు
ఘనుఁడోరుగంటి వేంకటకృష్ణయయు గుజ్జ
ముకులుండు సుబ్బరాముఁడును, ధరణి
కోట వేంకటసుబ్బ కోవిదుండును, లోని
వారందఱును భక్తి భరితులగుచు
వర్షవర్షము పండిత వరులఁ గూర్చి
గురుని వర్ధంతి మహము బరమ వైభ
వమ్మునఁగఁ జేసి గురుశిష్యభావమిట్టి
దనుచు నెఱిఁగించుచుంటకే నభినుతింతు."

శాస్త్రిశిష్యులు తమగురుని యెడలఁగల భక్తిని ప్రకటించుకొనుటా మంచిదేకాని, వారు వర్ధంతి సమయమున తమగురువును తద్దయుఁబెద్ద చేయుటకు పరపండితులను పరిహసించి పలుచని మాట లనఁ బ్రారంభించినారు. అట్లు పరిహసించుట ప్రౌఢిమ యని వారనుకొనిరి కాని, అది చాల పొరపాటు. ఆపొరపాటును తొలుతఁజేసినవారు నేలటూరు రామదాసయ్యగారు. పండితులను పరిహసించుట సింహములను కనలించుట వంటిదని పాపము! రామదాసయ్యగారు ఎఱుఁగరు, నాఁడు పరియాచకపుఁ బలుకులతో నలుగురిని నవ్వించి తాము నవ్వుకొనుటతో సరిపోవునని వారనుకొనిరి గాని, కాలక్రమమున ఏను మేకై యెదురుతగులునని వారెఱుఁగఁ జాలకపోయిరి. వారి పొరపాటు క్రమక్రమముగా వారికిని వారి యనుయాయులకును తొలఁగించుకొనరాని అలవాటుగ పరిణమించినది. ఆయలవాటు బలిసి తుదకొక నియత వ్రతముగా వారిలో నాటుకొన్నది. ఇప్పటికి జరిగిన నాలుగు వర్ధంతులలోను శాస్త్రిశిష్యులు పండితదూషణ వ్రతమును యథావిధి జరిపినారు.

శాస్త్రి శిష్యులలో నగ్రగణ్యులు రామదాసయ్యగారే. పండితులను తూలనాడుటలోను వారే యగ్రగణ్యులు. మొత్తముమీఁద దాసయ్యగారి దూషణ కగ్గమయిన పండితులలో లెక్కకువచ్చినవారు:—

(1) గుప్తార్థ ప్రకాశికా కర్తలు.

(2) 'కడప పండితులొకరు. (వారు) శాస్త్రులవారి మేఘసంజీవనీ చేటికను నేలమాళిగలో దాచుకొని తాము సేవించి, శిష్యులకప దానియంతు చెప్పక తమస్వాతంత్ర్యమును డమాయించిరఁట.

(3) కావ్యమునకు ఆత్మ ఏది? అనువిచారము సాగించి-"నొంగిలించిన" వారు.

(4) 'ఉత్తరాన ఒకఁడు శాస్త్రులవారి విజయ విలాసవిలాసమును

సెక్కేఁగో నాఁడుకొని గాఢముగా తిలకించుకొని తాను స్వతంత్రుఁడుబోలె విలసిల్లెనఁట!

సుబోధని (2—2—35)

పై పంక్తులు వరుసగా, మహామహోపాధ్యాయ బిరుదాంకితులు కల్లూరి వేంకటరామశాస్త్రిగారు, కావ్యస్మృతితీర్థ, అభినవాంధ్రవాల్మీకి (ఇప్పుడు) కళాప్రపూర్ణ శ్రీజనమంచి శేషాద్రిశర్మగారు, ఉభయభాషాప్రవీణ, అలంకారశాస్త్ర పారీణ బులుసు వేంకటరమణయ్యగారు, ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావు నాయఁడుగారు, అని యూహింపఁబడుచున్నారు. ఆయూహ తప్పో ఒప్పో యేనాఁటికైనను చెప్పవలసినవారు రామదాసయ్యగారే.

ఆ రామదాసయ్యగారి యుపన్యాసమున నొక విశేష మున్నది. ఏమనఁగా:- పౌరప్రముఖులే తమచేత ఆకీతిగా పండితదూషణమును చేయించినట్లు, వారు జగమెఱుఁగఁబలికినారు. నాఁటి వారివాక్యములివ్వి:—

"ఇట్లు పౌరమహాజనులు వర్ధమానులునుతము పెంపుడుచిలుకనగు నాచేత ఈకూఁతలు కూయించి సంతోషించి నందులకు... వారికి వందనసహస్రములు అర్పించుచున్నాను.

సుబోధని (2—2—35)

చిలుకకూసిన కూఁతలు నిక్కములేయగుచో సింహనగరపౌరులు పరదేశపండితులను దిట్టింపఁ గంకణముగట్టుకొనియున్నారన్న సిద్ధాంత మనివార్యమగును. అట్టిది వారు సేయుదురని గాని, చేయింతురని గాని, యెవఁడైన ననఁగలఁడా?

నాలుగవ వర్ధంతిలో కవిపండితదూషణ వ్రతము నాచరింప దీక్షగొని వ్రతమును సాంగోపాంగముగా జరిపి * విజయధ్వజము నెత్తి, యూరను

* శాస్త్రి విజయధ్వజము, తొమ్మిది గణుపులది. (కా. త.)

వెలువలను‡ ప్రతిభావంతులగు పండితులచేత చదివింపుచున్నవారు ధరణికోట వేంకటసుబ్బయ్యగారు.

సుబ్బయ్యగారు నేటికవులను పండితులను అనువాదకులను విమర్శకులను (ప్రత్యేకించి) మేఘానువాదకులను మూకయుమ్మడిని బిట్టు పెట్టిదముగాఁ దిట్టినారు. “మీదూషణమున నుద్దిష్టులయిన కవి పండితానువాదక విమర్శక మేఘానువాదకులెవ్వ” రని గట్టిగా నిలువవేసియడుగఁగా, తేలిచి చెప్పుటకు వీలులేక నీళ్లునములుచున్నారు,

సుబ్బయ్యగారి తర్వాత పండితదూషణకు పాలుపడినవారు- ములుమూడి, నారాయణరెడ్డి అనువారు. వారు తమపేరఁ బ్రకటించుకొన్న “కాలగతి తలపోతల”లో ‘అభినవతిక్కనే’తి విఖ్యాతులగు బ్రహ్మశ్రీ. దుర్భా

---

‡“విజయధ్వజమును అలంకరించిన రత్నాలు దోషభూయిష్ఠములు. వర్ధంత్యుత్సవానికిగాని విజయధ్వజానికిగాని అవి సముచితముగా నున్నవని ఎవ్వరూ అంగీకరించరు. అందులోని పద్యములు ప్రతిపక్షులను నిందించడమే ప్రధానోద్దేశముగా పెట్టుకొని వ్రాసినట్లున్నవి కాని, శాస్త్రిగారి పాండిత్యము మెచ్చుకోడానికి వ్రాసినట్లులేవు. ఇవి తిట్లతో నిండి తగవుకుంగారణమైనవి. కవి రసజ్ఞుఁడు ఔచిత్యము నెఱిగినవాడూ అయివుండవలెను గదా!

శాస్త్రిగారుజీవించి ఉన్నకాలములో వారి పాండిత్యానికి జడిసి ఎవ్వరూ నోరెత్తక ఏమూలనో ఉన్నారనీ వారుగతించినతర్వాత ధీరులై ప్రేలుతున్నారనీ ‘ధరణికోటవారు’ విజయధ్వజములో వ్రాసినవ్రాతలూ వారితోబాటు నేడు కన్ను తెఱచిన పండిత ప్రముఖులుచేసిన ప్రసంగాలు అజ్ఞానవిలసితములు.”

ప్రతిభ- వసంతసంచిక

సుబ్రహ్మణ్యశర్మగారిని అసభ్యభాషతో అనరాని మాటలన్నారు. అంతతో తనియక మహోపాధ్యాయ రావుసాహెబు బ్ర. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారిని దూషించినారు. అదియుంజాలక విశ్వవిఖ్యాత విద్వత్కవులును శతావధానులునయిన బ్ర. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రుల వారిని నిష్కారణముగా నీచముగా నిందించినారు. 'కొలగతి తలపోతల'ను గుంటూరుమండల పత్త్రిక 'అభినవ సరస్వతి' గాఢముగా నిరసించినది. *

---

* కొలగతి తలపోతల విమర్శ

"కొలగతి తలపోతలు—12 పుటలే యైనను నిదియునొక గ్రంథము గ్రంథకర్త ములుమూడి నారాయణరెడ్డిగారు. కవితావిమర్శనము జేయుటకు వ్రాసిన గ్రంథమైనను గ్రామ్యభాషలోనున్నది. అర్థమగుట యతి కష్టము. "చెళ్లపిళ్ల వెంకటయ్య జితకాశిని చూస్తే పండితులూ, కవులూ వుండనీ, విద్యార్థి కుఱ్ఱడుకూడా దేవాదేవేషు పట్టించడా" యని జగత్ప్రసిద్ధులైన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిమీఁదికే ధ్వజమెత్తి నారాయణరెడ్డిగారు కొఱులు ప్రారంభించిరి. నెల్లూరు పురనిలయులగు దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిని దూషింపదొడఁగొనిరి, ఒక శర్మగారిని నొక వేంకటశాస్త్రిలు గారినే కాదు. ఎంతెంతవారుగూడ నీగ్రంథమునం దెక్కిరింపఁబడియున్నారు. వేదము వెంకట్రాయశాస్త్రిగారి శిష్యులఁట యీతద్గ్రంథకర్తృప్రభృతులు. వీరందఱును నెల్లూరులో శాస్త్రిలుగారి వర్థంతి జరుపుచున్నారు. విశ్వమునకెల్ల వెంకటరాయశాస్త్రిలుగారే పండితులుగాని మఱియొకరు లేరనుచున్నారు.

వేంకటరాయశాస్త్రిలు గారు విద్వచ్ఛిరోమణులగుదురుగాక. అన్యవిద్వద్దూషణమే యనుచితము. అట్టి దూషణతోఁగూడిన యీ గ్రంథము గ్రాహ్యము"

(అభినవసరస్వతి, జానపాడు.)

ఇట్లు శాస్త్రిశిష్యులు నిజగురువునకు సకలోన్నత పదవిని సంతరించుటకు పండితదూషణమును పరమసాధనముగా వినియోగించుచున్నారు. తిట్టుపడిన విద్వత్కవులలో నొక్కరైనను, ఆశాస్త్రిశిష్యులవ్రాతలను లెక్కచేసి బదులుపలికినవారు కారు. కాని శ్రీతిరుపతి వేంకటేశ్వర కవుల శిష్యులలో నొకరు వెలమకన్ని సీతారామశాస్త్రి అనువారు మాత్రము ఆ 'కోలగతి తలపోతల' కర్తను మొదటమాటిగనే మందలించినారు. అంతటితో రెడ్డి తన తప్పును తాను తెలిసికొని గంభీరముగా మిన్నకుండక వాదమును పెంచి పెద్దచేసి 'కళాప్రపూర్ణుల' కీర్తికి కళంకమును గలిగించినాఁడు. సత్యజిజ్ఞాసూపయోగార్థము సీతారామశాస్త్రి వ్యాసముల నిందు పొందుపఱిచినాను:—

ఆకవిపండితదూషణ పిశాచము నేఁటికి 'కోలగతి తలపోతల' గంగజాతరలో 'తోడుదొంగతనాలు' అను నసభ్యపు పాడు పేరుతో, దుడుకు మాఁటలతో, దుర్భాషలతో, ఆఱవులతో, పెడబొబ్బలతో శ్రీ చెళ్లపిళ్లకవిచంద్రునిమీఁదుగా నామీఁది కురవడించినది. ఆపిశాచమునకు ప్రయోక్త, సరస్వతిరాష్ట్ర నాగరకాచార్యుఁడు (ఎవఁడో?). ప్రఖ్యాపకుఁడు, ము.నా. రెడ్డి. అనుమోదకులు కవిపండితదూషణసంఘమువారు.

ఆపిశాచపు రాకచూచి, దాని ధాకచూచి నేనుతొలుత భయపడిన మాట నిజము. అంతేకాదు, ఘోరమైనదాని తీరును నూయివంటి దాని నోరును చూచి అదినన్ను కఱచునో, 'ఆమాంతముగా' మ్రింగునో యని కూడ వెఱచితిని. కాని గట్టిగాఁబట్టి పరిశీలించి చూతునుగదా, అది కోఱలూడిన బోసిదయ్యము. అఱచీకు ముసలిడొక్కు. పైడంబమేగాని పసలేనిది. దాని వేషభాషలబడాయిని పరికించుకొలఁదిని నాకు పట్టరాని నవ్వువచ్చినది.

---

* గంగజాతర, తిట్లతిరునాళ్లు. ఆ తిరునాళ్ళలో అల్లరి మూఁక, యెంత గొప్పవారినైనను, నోటికివచ్చినట్లు ఎంత నీచముగానైనను తిట్టును.

పులితోలు కప్పుకొని పొలము కాపరులను బెదరించిన గాలిగాని కథ జ్ఞప్తికి వచ్చినది.

ఏమయినను పిశాచమే కదా, ఊరక విడువనేల? యని గట్టిగా పట్టు పట్టి, భయ మనుకొనక బహుప్రయోగములతో వాకట్టు కట్టితిని. ఇఁక నది నోటిని మాటిమాటికిని తెఱచి బెదరించునే గాని, కఱవఁజాలదు. దాని నంతతో పోనిచ్చితినా! సిటీడ్రైనేజీ గొట్టపు మొగము వంటి దాని పెద్ద బోసినోటికి గండశిలవంటి దండిపండితుని కీ. శే. వేంకటరాయశాస్త్రిగారి నే అడ్డము వేసితిని. నోట గుండు పడుటచేత నింకమీఁద ఆపిశాచమునకు ఊపిరియైన నాడదు. సర్కస్ కేజి (పంజరము) లోని యిబ్బందిగండువలె మిడుకుచు మనవంక మిడిగ్రుడ్లతో చూచునేగాని అది నోటినైన కదలింపఁజాలదు. ఈపిశాచ మింకమీఁద ఈరూపమున లోకమున తలచూపదని దృఢముగాఁ జెప్పవచ్చును. కాని యింక నెన్ని రూపములఁ దాల్చునో!

వాదదౌర్బల్యమునను వాక్పారుష్యమునను, నాగరకాచార్యుని 'తోడుదొంగతనాలకు' తోడుపోయినది (ధ. వెం. సుబ్బయగారి) 'దీమస' మొకటి కలదు. దాని నుత్తరింపవలసిన పనియు నాకున్నది. 'ధరణికోటవారి ధార్ష్ట్యము, అనువ్యాపనము' నేనడిగినప్రశ్నములకు ప్రత్యుత్తరములు చెప్పఁజాలక - ధ. వెం. గారు 'దీమసమును' అప్రసక్తములు. అనవసరములు - అనుచితములు నగు ప్రసంగములతో నింపినారు. శాఖాచంక్రమణ దోషదూషితమైన యీ వ్రాఁతకు బదులు చెప్పనక్కఱలేదు గాని, అట్లని నేనూరకున్నచో నాయందు చాలమి పెట్టి. ధ. వెం. సుబ్బయ్యగారు కావించు విజయభుజాస్ఫాలనములకును, తదనుయాయుల వీరాలాపములకును తాళరాదు. కావున, 'ఊరక్క - పెండ్లిలో పేరక్క - సోబన' మన్నట్లు, ఈదయ్యపు జాతరలోనే ఆసుబ్బయ్యగారి 'పంబ' సంబరమునుగూడ, లఘువుగా వెళ్లఁబుచ్చినాను.

ఖ. నా. రెడ్డి తలపోతలు దూషణబహుళములు గావున వానికి

బదులిచ్చుటయే యనవసరమని మదీయహితైషులు కొందఱు నాకు చెప్పిరి. కాని, యందఱితోఁ బోరెడు వ్యాసము (వస్తుస్థితి; కాట్ రెడ్ హ్యాండెడ్) అంటువలెఁ గేవలము కల్లలు కడుపుమంటమాటలే కాక, మూఁడవదానఁ గొంత విద్యావిషయమును ఉన్నందునఁ దద్రచయిత్ర ప్రఖ్యాపకుల సాహిత్యసారమును విశ్వలోకము గుర్తించుఁగాక యని యీ జవాబు వ్రాసితిని. వారి వ్రాఁతలు చదువుటవలనఁ బట్టువడిన తిట్టుపాతమును వారికే అప్పగింతుఁగాకయని, వారివాక్కులను, వానివంటి వానిని మఱి కొన్నింటిని నేనును వాడితిని. ఈపాటి ప్రతికృతికిఁ బ్రాజ్ఞులు నన్ను తప్పు పట్టకుందురుగావుతమని కోరుచున్నాను.

మ. కవితా వాసనలేని 'నాగరకు' కూఁకల్ మీ యుపేక్ష్యంబు లం
చు విశేషజ్ఞులు చెప్పి రట్లయినఁ బ్రాజ్ఞుల్ వాని పాండిత్య పా
టవముం గూడ గ్రహింత్రు గాకయని వేవ్రాల్ వ్రాసితిన్ దీని, స
త్కవులా 'నాగరకా'ఖ్య పెంపఖిలమున్ గన్గొంద్రు గాకింపులన్

శా. వ్రాయన్ నేరఁడు వాక్యమేనిసరిగా, భావంబు సువ్యక్తమున్
జేయన్ నేరఁడు, మాఱు మూలపదముల్ చే బల్మిమైఁ దెచ్చి గు
ట్లో యర్థంబు 'నగమ్య గోచరము' సేయున్ బిన్నకున్ బెద్ద కో
హో! 'యాచార్యుని' వ్రాఁత యన్న, నది హాస్య క్రీడగా వీటికిన్!

ఉ. పేడయు బెల్లమున్ బిసికి పిండమొనర్చిన లీలఁ దెల్గుతోఁ
గూడని సంస్కృతంపు నుడుగుల్ ముడిపెట్టి, దురన్వయంబునన్
బేఁడిన రజ్జులన్ దెలుఁగు బిత్తరి గొంతు కురిం దగుల్చుఁ బో
యీ డుబుడక్కదాసరి సుదృక్కుగఁ దన్నుఁ గుదృక్కు లెన్నఁగన్

ఓ నాగరకుఁడా!

గీ. కలముసాగని మలబద్ధకంపు పాడు
ఫక్కితో, ముక్కి ముక్కి, యిబ్బంది పడిచి

నడిచి, తుద కెట్టులో యొక్క–కుంటవ్రాఁత
తిట్ల 'తలపోత' ప్రకటించితివి ఘనంబె?

ఆ. పెద్దకవుల పేళ్లు పెనుఁబొత్తముల పేళ్లు
వల్లెవేసినంతఁ బండితుఁడవె?
పరిచయంబువలనె బహుకావ్యములతోడ!
సొంతబుద్ధి వలదె కొంతయైన?

నెల్లూరు.
25—5—1937 }

దీపాల పిచ్చయ్యశాస్త్రి.



ములుమూడి నారాయణరెడ్డి

# కాలగతి తలపోతల గతి



## 1. టిట్ ఫార్ ట్యాట్.

### (A)



అయిదారు రోజులక్రితం "కాలగతి తలపోతలు" అనేచిన్న పుస్తకం వకటి మా యింటికి యెట్లాగు వచ్చిందో వచ్చింది. అది నెల్లూర్లో అచ్చయింది. నెల్లూరు మండలంలో పెద్దపేరు పొందిన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిని, వేంకటరాయశాస్త్రిగారి తరఫున వక రెడ్డి తిట్టిన తిట్లే అలా పన్నెండు పేజీల పుస్తకం అయింది. ఆరెడ్డికూడా నెల్లూరువాడే కాబోలు! భాషణ చాలా మోటుగా ఉంది. భాషావిషయం ప్రధానంగానూ చమత్కారంతో కూడిన యెత్తిపొడుపులు అలంకారాలుగానూ వుండాలిగాని పండితుల వ్రాతలు బండబూతులుగా వుండగూడదు. ఎవరైనా సరే, లోకం తనలోని తప్పులను బైట పెట్టినప్పుడు చేతనయితే సమర్థించుకోవాలి, కాకపోతే వచ్చినట్లు పడివుండాలి. అంతేగాని తిట్లకు దిగితే లాభమేమిటి, తనచేతగానితనం బైటపెట్టుకోవడంతప్ప? నెల్లూరివారి గొడవ మన కెందుకనుకొన్నానుగాని, వారు వారిమట్టుకే సరిపెట్టుకోకుండా కల్లూరి పండితునికి వ్యాకరణం రాదనీ, కడపపండితుడు టక్కరనీ. వృత్తరాది బుధుడు అయోగ్యుడనీ, నాలుగుదేశాల పండితులనూ కదలగూశారు. ఇంతకూ వారి ప్రధానోద్దేశమేమి? ప్రపంచకములోకల్లా తమ గురువుగారొక్కరే పండితుడని.

ము. నా. రెడ్డి తన కొలకతని తలపోసికొని నిట్టూర్పులు విడిచి విడిచి యెంతో విలపించారు. ఆ విలాపంలో చాలా ప్రలాపాలు కూడా బయలుదేరాయి. "చెల్లపిళ్ళ వెంకటయ్య 'జితకాశి'ని చూస్తే పండితులు కష్టాలు ఉండవనీ విద్యార్థిపరాడుకూడా 'దేవాదేవేషు' పట్టించడా"? అనేది ఆ ప్రలాపాల్లో వకటి. పాపం ఆ రెడ్డికి యిట్టి ప్రలాపాలు యెందుకు పుట్టినవా అని భోగట్టా చేశాను. తమకు గురువుల్లో గురువు గురువులో అయిన వేంకటరాయశాస్త్రిగారి పాండిత్యపు బండారాన్ని (వారి శిష్యుల అధిక ప్రసంగాలే కారణంగా) దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారో వారి శిష్యులో బైటపెట్టగా అందుకు తగిన సమాధానాలు చెప్పేవోప లేక "పాతట్లోబడ్డనక్క" చందంగా, శర్మగారినేకాక పదిమంది పండితుల్ని పడదిట్టాడు. నెల్లూరుసీమ రెడ్లు నాగరీకులని లోకంలో ప్రతీతి. అదేమి కర్మమోగాని యీ రెడ్డిగారి వ్రాతలో మొద్దుతనమూ మడ్డితనమూ తప్ప నాగరకత రవ్వంతకూడా కన్పడలేదు. వ్రాత అంతా బూతుల బుంగ. అతడు రెడ్డికాబట్టి ఆ వ్రాతలో బుడ్డగిబ్బలు, ముండ్ల కంపలు, ముదినక్కలు, ఉల్లిపాయలు తావుగొనుట ధర్మమేగాని "దేవాదేవేషు" అనే వైదిక వాక్యము వుపయోగించాడే అది అతని కెక్కడ పట్టుపడ్డది! ఆలోచించి చూస్తే ఆవ్రాత ఏదో రీతిగా బాపనిపొత్తు గలిసిన వ్రాతగాని అచ్చరెడ్డి వ్రాతగాదని అనిపిస్తున్నది.

నారాయణరెడ్డీ! "జితకాశి" అనే సంస్కృత శబ్దానికి పొరపాటున తప్పుగా అర్థంచేసిన "చెళ్లపిళ్ల వెంకటయ్య" గారికి "దేవాదేవేషు" చెప్పే ఆ విద్యార్థి పరాడు (1) "పురి" అను తెనుగుమాటకు "వల" అని అర్థం వ్రాసిన మీ వేదం వెంకటయ్యను అదేపని చేస్తాడంటే వొప్పుకుంటావా, వొప్పుకోవా? నీ గురువును తలుచుకొని చెప్పు! అసలా "జితకాశి"ని నీకు పట్టియిచ్చిన ధరణికోట వెంకటసుబ్బయ్యగారిని అడిగి మరీ చెప్పు!

(2) "పొరవడి సేగువోటు వోక యుగ్మలి యొల్లె చెలంగు మేదినీ
శ్వరుని భుజావిభూషణము వ్రజములం దవులంగఁ బాజినన్
విరిసెను నీవిబంధ మది విస్మయమందఁగ, తోడిభామినుల్
పరిహాసనంబొనర్పఁ, బతి పాపభయంబునఁ గంపమొందఁగన్"

నైషధము అ. 3. ప. 94.

అనే పద్యానికి

అది=ఆ స్త్రీ, విస్మయము బొందగన్=ఆశ్చర్యపడుటకుఁగాను, తోడి భామినుల్-పరిహాసనం బొనర్పగన్=ఎగతాళి చేయుటకుగాను, పతి పాప భయంబునన్-కంపమందగఁన్=వణకుటకు గాను.

అని సర్వంకష వ్యాఖ్య వ్రాసిన మీ వెంకటయ్యకు ఆ విద్యార్థి కుర్రాడు "దేవాదేవేషు" పట్టించవలసిందే నా? కాదా? లేదా?

(3) శాకుంతలంలో "నదురవాపేయముఖులు ప్రార్థనా" అనే సంస్కృతానికి "ఈకోరిక సులభముగా నెఱవేరఁగలది కాదు" అని తెనిగించిన మీ వెంకటయ్య రచనకు చేయదగిన ప్రాయశ్చిత్తమేమో ఆ కుర్రాణ్ణడిగి తెలుకోవయ్యా రెడ్డీ!

మరిన్నీ—"ఈకోరిక నెఱవేరఁగలదికాదు" అని పైనవ్రాసి దానిక్రిందనే

"డెందమ కోరుము కోర్కుల
సందియ మిపుడెడలె దేని శంకించితివో
సందీప్తానలమని తాఁ
కందగు రవణమది రత్నకందళిక సుమా."

అని పూర్వోత్తరవిప్రతిపన్నంగా వ్రాసిన ఆ వెంకటయ్యకు "దేవాదేవేషు" పట్టించితే చాల్తుందా! ఆలోచించూ!

(4) శకుంతలను అత్తగారి యింటికి పంపేటప్పుడు సఖుల వాక్యంగా "సుఖసుజ్జనం తే భవతు" అని నాగరలిపిలోవున్న పాఠాన్ని చదువుకునే తెలివిలేక తెలుగు పాఠంమీద ఆధారపడి "సఖీ! నీవు సుఖముగా స్నానమయినదా?" అని తెనిగించిన మీ వెంకటయ్య తెలివికి నీవూ, నీవంటి వాండ్లూ మూర్ఛపోయి మా వెంకటయ్య "శాస్త్రిబ్రహ్మ" అంటే ఆ విద్యార్థి కుర్రాడు వూరకుంటాడా? నీవేచెప్పు!

నాగరలిపి చదువనేర్చి పూర్వోత్తర సందర్భాలను పరిశీలించి పాఠమును నిర్ణయించుకొని "నీవు సుఖాభిషేకమగుఁగాక" అని తెలిగించిన శ్రీమతి విద్వత్కవితిలక విద్వాన్ కంచనపల్లి కనకమ్మగారి పాండిత్యము ముందు మీ వెంకటయ్యగారి పాండిత్యం దిగదుడుపు అంటే తప్పా?

ఈ భాగ్యానికి మీ వెంకటయ్యను "శాస్త్రిబ్రహ్మ" అనీ "చదువుల సముద్రి" మనీ "సింహ" మనీ "పులి" యనీ "తోడే" లనీ "ఎద్ద" నీ ఏమేమో అనీ లావుచేసి గడ మీదికెత్తి లోకానికి చూపబోవడ మెందు కయ్యా? రెడ్డీ! అలాంటి పనిచేస్తే ఆవిద్యార్థి కుర్రాడు మీకుమాత్రం "దేవానేవేషు" పట్టించక విడుస్తాడా?

మాటవచ్చింది గనక అడుగుతున్నాను.

బాలవ్యాకరణ పాండిత్యమంతా వేపం వెంకటయ్యతోనే అంతరించిందన్నావే ఆయన నిజంగా అంతటి పండితుడటయ్యా? అయితే

(1) ఆ "శుద్ధముత్తెములు" (చూ. శృం. నై. 214 పుట) వారి 'బాల' పాండిత్య సముద్రంలో వుద్భవించినవేనా? ఏమి సమాసజ్ఞానమయ్యా!

(2) మాధవివలెన్ అనుటకు మీ వెంకటయ్యగారు శాకుంతలంలో ..................కదర్థితమాధవీక్రియన్" అన్నారే మీ రెఱుగుదురా

పండితుల నడిగి చూడండి. ఆ 'క్రియ'కు ఆ అర్థం వస్తుందేమో. పండితులా దాకాయెందుకు? అవిద్యార్థి కుర్రాణ్ణి అడగండి. 'క్రియ' * తెలుగైతేనే గాని 'వలె' అనే అర్థం రాదనీ, అది తెలుగైతే మీ వెంకటయ్యగారి "మాంసవి'కి దీర్ఘంనిలవదనీ, దీర్ఘం నిలిస్తేనేగాని పద్యంనిలవదనీ స్పష్టంగా చెప్తాడు. వే. వెంకటయ్యగారి సంస్కృత జ్ఞానానికీ ఆంధ్రజ్ఞానానికీ "శబ్ద శాసన' ఆచార్యకానికీ యీ ప్రయోగం ఒక్కటి చాలు సాక్ష్యం. శాస్త్ర జ్ఞానంమాట అలా వుండనియ్యండి. అసలు మీ వెంకటయ్యకు శాకుంతలం కథైనా చక్కగా తెలుసునా? తెలిసేవుంటే—

(3) "తేన హి గృహీత పాథేయోభవ" అను సంస్కృతాన్ని "అట్లయిన నింకనేమి? రాజధానికి బత్తెము గట్టుకో"అని తెలిగిస్తాడా? రాజు రాజధానికి పోతే కథ కంచికి పోవాల్సిందేకదా? ఈ 'రాజధాని' అధిక ప్రసంగమంటావా? లేదా? "అట్లయిన బత్తెముకట్టుకొని సిద్ధముగనుండుము" అని తెనిగించిన శ్రీమతి కనకమ్మగారు మీ వెంకటయ్యగారికంటే వేయి రెట్లు మేలుగదా! అధికప్రసంగంచేసి అసలు కథనుచెఱిచే వెంకటయ్యకు పట్టించదగింది 'దేవాదేవేషే'నా! ఇంతయెందుకు? ఆ వెంకటయ్యకు తెలుగు వాక్యమైనా చక్కగా వ్రాసే తెలివి లేదనడానికి వక్క వుదాహరణ మిస్తా చూడు.

(4) శాకుంతల పీఠికలో "బ్రహ్మశ్రీ వెంకయ్యగారు............ నన్ను-మదీయ శాకుంతలము ముద్రితమై చిరకాలమైనను పుస్తకములు ఎచ టను అలవడకయున్నను ఏల పునర్ముద్రణము చేయింపలేదు?-అని ప్రశ్నిం చిరి:" అనే వక వాక్యముంది. ఈ వాక్యంలోని 'మదీయ' ఎవరి కన్వయి స్తుంది. వెంకయ్యగారికే గాని గీ పెట్టినా మీ వెంకటయ్య కన్వయించదు గదా! శాకుంతలం వ్రాసినవాడు వెంకయ్యగారు అనీ, పునర్ముద్రణము

* దీనిసమర్థింప 'ధేనుక్రియ'చాలదు. చూ శ. ర, జఘన్యప్రయోగ ములు శాస్త్రులవారు ఒప్పరు.

చేయించవలసినవాడు వెంకటయ్య అనీ గదా ఆవాక్యాని కర్థం. వాక్యం యీలాగేనా వుండవలసింది? ఇలాంటి తప్పు మూడవ తరగతి పిల్లాడు చేయ దగిందా! లేక చదువుల సముద్రాలూ శాస్త్రి ప్రజాపతులూ, చేయ దగిందా? ఇలాంటి తప్పుకు ఆవిద్యార్థి కుర్రాడు మీ వెంకటయ్యాను ఎందుకు మన్నిస్తాడు? ఇలా చూప దల్చుకుంటే మీ వెంకటయ్య గ్రంథాల్లో వేలకు వేలు తప్పులు 'దేవాదేవేషు'కు తగినవి బయట పడతాయి.

ఇలాంటి వెంకటయ్యాగారేనా 'ఒక్కడైనా తన శిష్యుడైనవాడు బాలం మొదలయినదానిని రహస్యాలతో గూడా.........అంతు తెలిసే ట్లుగా తమ మతమంతా తెలుసుకొన్నట్లుగా తమ తర్వాత దాని శత్రువు లను ఆకపెట్టే దళవాయి కాదగినట్లుగా తనవద్ద నేర్చుకోలేదుగదా" అని అంగలార్చిన మహా వ్యాకరణవేత్త? సిగ్గు! సిగ్గు!! ఈపండితునివద్దనా సుప్ర సిద్ధులై పేరుపడ్డ పెద్ద పెద్ద కవులు కూర్చొని పాఠం నేర్చుకోవాల్సింది. "లజ్జామేకాం పరిత్యజ్య త్రిలోకీ విజయీభవేత్."

ఇంకొక్క మాటః—రెడ్డీ! వేంకటశాస్త్రిని వెంకటయ్య అనీ, శర్మను శరమ అనీ. అన్నావే అలా అనడం నీకు మామూలు అనుకుంటాను. తప్పడకుసుమా! ఏమంటే రామదాసును దాసయ్య అనీ, వేంకటాద్రియుణ్ణి పట్టి–రాయుడు అనీ, కర్మమును కరమము అనీ, ధర్మమును దరమము అనీ, శబ్దాలకు వికారం కల్పించి వుచ్చరించటం నీబోంట్లకు మామూలు. నేను గూడా నీ మామూలునే అనుసరించి నీకు తృప్తిగా వేంకటరాయశాస్త్రి గారిని వెంకటయ్య అని వ్యవహరించానుగాని యిలా వ్రాయడం పండిత పద్ధతి కాదు. శాంతం పాపం! ఇంకనైనా యీలాంటి వ్రాతలు మానడం మంచిది. తిట్లకు తగినవాడవని శాస్త్రిగారి శిష్యులు నిన్నిరాంపిలో దింపారేమోగాని యిది నీకు తగినపని కాదు. పొగడడంగాని తెగడడంగాని నీకు తెలియదు. శర్మగారిని "బుడ్డగిబ్బ" అని చంకలు తట్టి సంతోషిం చావుగాని అలా అనడంవల్ల శాస్త్రిగారు "పెద్దయెద్దు" అన్న అర్థం

స్ఫురిస్తుందని నీకు తెలియదుగదా! నీకు సారస్వత చర్చలపై అభిలాషవుంటే క్రమమైన పద్ధతిలో వ్యవహరించడం నేర్చుకో. ఒక చెయ్యి చూతాంరా. నిజమిది:- వేదం వేంకటరాయశాస్త్రిగారేలాంటి పండితుడో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారునూ అలాంటి పండితుడే. నెరసులు వెదికితే ఎవరికైనా వుంటాయి. అంతమాత్రానికి వారిని తూలనాడడం మనకు ధర్మంకాదు. మన అవివేకపు వ్రాతల మూలాన వారిబ్రతుకులు బజీతు పట్టడమే గాని బాగుపడజాలవు. ఓం స్వస్తి.



(B)

కం. "కాకేమి తన్నుఁబట్టెనె?
కోకిల తన్నేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగయగు పరుసని
వాకునఁ జుట్టమగు మధుర వాక్యము కలిమిన్."

అయితే రడ్డీ! 'అయ్యా శాస్త్రికంటే తక్కువ పూజా వాచకం కాదులే" అని సరిపెట్టుకొని వెంకట్రాయశాస్త్రిగారిని పాపం 'రాయయ్యా' అనడాని కొప్పుకున్నావ్! బలే బాగున్నది. ఒప్పుకో కేమి చేస్తావు? యిరుకున బడ్డప్పుడు. ఇప్పుడా 'రాయయ్యా' అనేకాదు. 'రప్పయ్యా' అని కూడా అనవచ్చునంటావు. అదేమంటే రాయికంటె రప్ప ఏమి విధమునా కూడా తక్కువ కాదులే అని సరిపెట్టుకుంటావు. వెనుకటికి నీవంటి సాహెబొకడు వక సెట్టిని తొందరపడి "గధా",

అనెనట. అంతట శెట్టి సాయిబుగారూ! ఆ మాట కర్థమేమిటండీ అని అడిగెనట. సాహేబుగారు "గధా" అంటే పెద్దమనిషి అని అర్థములే అని చమత్కరించి తన తెలివికి తానే పొంగిపోయినాడట. అంతట శెట్టి, అయితే గధాగారూ తమరెందుకొచ్చారండీ! గధాగారూ మీ నాయనగారు మీ కంటె గొప్పగధాగారండీ, నేనెరుగుదును. మీ నాయనగారి కంటె మీ అమ్మగారు మరీమంచి గధాగారని మా నాయనగారు చెప్పేవారండి. సరేగాని గధాగారూ......అని అంటుకొన్నాడట అప్పుడా సాహెబుగారి చావు ఏమి చెప్పాలి. కుక్కిన పేనై తలవంచుకొని దాటి పోయినాడట. రెడ్డీ! నీ అయ్యాగతి తుదకలాగే అయినదిగదా. ఇంతకూ యిది యెందుకువచ్చినగోల? దిగంతవిశ్రాంతకీర్తియు జగత్ప్రసిద్ధ విద్వత్కవియునైన వేంకటశాస్త్రిగారిని ముందు దుడుకుపడి "వెంకటయ్యా" అనవ మెందుకూ? మీకెల్లరకు పూజ్యుడైన వెంకటరాయశాస్త్రిగారిని "రాయయ్యా" "రప్పయ్యా" అనుకోవమెందుకు? శాస్త్రిగారికి మంచి శిష్యుడవు దాపరించావయ్యా. పనిలేనిపాటగా పరదేశపండితులతో పగ పెచ్చుకొని వారి నొకటి అని వేం...గారిని పది అనిపించే నీ వాత్రతనూ నిన్నూ మందలించే పెద్దలు నెల్లూరిలో ఒక్కరైనా లేకపోవడంమాత్రం పండిత లోకానికి ఎంతో వింతగా వున్నది.

సరేగాని 'ఉరి'కి, అర్థం 'వల' అని ఎలుకలు గూడా చెబుతారంటావే ఎవరా ఎలుకలు? ఇది ఉరి, యిది వల అనే యెలుకలేని ఎలుకలు మీ శాస్త్రిగారొకరూ, వారి శిష్యులో మిత్రులో మీరొకరూ. ఇంతేనా ఇంకా వున్నారా? అయితే మీ యెలుకల మతంలో "ఉరిశిక్ష" అనడానికి 'వల శిక్ష' అనవచ్చునన్నమాట. వాణ్ణి 'ఉరితీశారు' అనడానికి బదులు 'వలతీశారు' అనవచ్చునన్నమాట. నీ వేనాటి రెడ్డివయ్యా? ఉరికి వలకు భేదం తెలియని రెడ్డివి. అరవవు కావుగదా. నీవే రెడ్డివైతే నాకెందుకు? నాకు కావలసింది విద్యావిషయం. రెడ్డి పండితుడా! తెలిసికో ఉరి వేరు వల వేరు. పెద్దలచేత

చెప్పింతునా! చదువవయ్యా *బమ్మెరపోతరాజా నీపద్యాన్ని.

క०. వల లురులు జిగురుఁగండెలు
చలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచున్
బులుఁగులఁ బట్టెడు వేడుక
నలుకుడు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్.

పోతయ్య మాసీమ కవికాడు. మా దేశములో మాకు 'ఉరి' 'వల' సమానమేనంటావేమో నీ వంతమాత్రపు ఘనుడవు? వినూ మా 'తిక్కయ్య' చేతనే చెప్పిస్తా. కానియ్యండిబాబూ, సోమయాజిగారూ,

ఆ. వె. యోగబలములేని యొకభంగి యోగి బల్
స్రోత్రములేనిమీను నేపులేని
మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱుకంగ
లేనియట్లు భవములోన నడఁగు.

చాలునా రెడ్డీ! మరి నోరెత్తకు.

'రాజా భయముచేత వణకుటకుగాను నీవివదలెను' అని అర్థము చెప్పుట తెలుగు మర్యాదకాదని నేనంటే అందుకు సంస్కృత వ్యాకరణ సూత్రాలు వల్లెవేస్తావెందుకు? పదవాక్య ప్రమాణజ్ఞుడై తేమాత్రం మల్లినాథపండితుడు తెలుగునకు ప్రమాణమవుతాడా! "నమస్స్వస్తీత్యాదినా చతుర్థీ" అనే సూత్రాన్నిబట్టి "అయ్యా తమ కొలకు దండమండీ" అని ఏమే తెలుగువాడైనా అంటాడా? అలాగే దుత్రమున కచ్చు పరంబగునపుడు సంధియగును అని యున్నదిగదా యని తస్మిన్ + అత్రా తస్మినత్రా అని

* రెడ్డెయ్యా! పోతరాజకవి గూడా నీబారిన బడితే, పోతయ్య అయిపోతాడు కాబోలుకర్మం, అంతటితో పోనీ నీపుణ్యాం దున్నపోతయ్య అనకుండా. అదేమంటే పోతు దున్నపోతుకు పర్యాయపదమేలే అని సరిపెట్టబోతావు.

యే పండితుడైనా వ్రాస్తాడా! ఏ భాష మర్యాద ఆ భాషకే. దానిని తెలిసికోవడమే పాండిత్యము. అదే మీ శాస్త్రులవారికి లేనిది. సంస్కృతాన్ని బట్టి నేర్చుకొన్నది కాబట్టే మీ శాస్త్రిగారి తెలుగు- ఇటు తెలుగుగాక అటు సంస్కృతమూగాక గుఱ్ఱం (గుఱ్ఱం + అశ్వం) లాగా ఉభయభ్రష్టమైనది. (వారి తెనుగును గూర్చి ఒక ప్రత్యేక వ్యాసమును త్వరలో నే ప్రకటిస్తాను) ఇంతకూ తేలిన సారమేమి! తెలుగుమర్యాద యెఱుగడు కనుక నే శాస్త్రులవారు అలాంటి అర్థమును వ్రాశారు. దానికై మీరు పెనగులాడుట నిష్ఫలము.

"శుద్ధము త్తెములు" "మాధవీక్రియన్" "మదీయ శాకుంతలము"-వీనిగతి యేమి? అని నే నడిగితే బాల మంటావు ప్రౌఢ మంటావు సముద్ర మంటావు మందరమంటావు- యేమిటయ్యా నీ గొడవ? తెలిస్తే నిలబడి ఒక మాట చెప్పు, లేదా పలకకుండా ఊరుకో. "విభూషణం మౌన మపండితానామ్" అంతేగాని అకున అందనీ పోకనపొంద నీమాటలు చెప్పి తిన్నగా తప్పించుకొని దాటిపోబోతావేం? నిలూ! ఎక్కడికి బోతావు. అటకాయించి అడిగితే యిలా తెత్తెత్తె పెప్పెప్పె అనేవాడవు అస లీరంగంలోకి ఎందుకు వచ్చావు? వ్యవసాయమో, వ్యాపారమో చేసుకొంటూ కాలంగడుపుకోక. మీ బోంట్లకు మా తిరుపతి వేంకటేశ్వరకవులు ఎట్టి హెచ్చరిక చేసియున్నారో చూడు.

ఉ. కొంచెమొగొప్పొ సంతసముగొల్పినఁ జూడుఁడు చించివేయుఁ డే
మంచియులేనిచో నివియె మా నమనమ్ము లనుగ్రహించి మ
న్నించుడు కాశినాథబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహింపకుఁడు పెప్పెపెయందురు మే మెదుర్కొనన్.

పై విషయములు ఒప్పులుగా సమర్థించడానికి గతిలేక తప్పులనిఒప్పుకోవడానికి ధృతిలేక నీవు కంపలోబడ్డ కాకిమాదిరి కంగారు గావడం

నీ వ్రాతలోనే తెలుస్తూవుంటేయింకా యెందుకీ బూటకపు నాటకా లాడటం.

## సందేహ నివృత్తి.

నెల్లూరి సంగతులు గుంటూరివారికింత విశదంగా యేలా తెలిసినవో అన్న సందేహం వకటి నీకు హృదయశల్యమై బాధిస్తూవున్నట్లు తెలుపుకొన్నావు. నీ సందేహము తీర్చవద్దూమరి—నీవన్నట్లు నిజంగా మీ వే. శాస్త్రి గారి సంగతి మాదేశంలో అనుకొనేవాడేలేడు. ఇక శిష్యుల సంగతి చెప్పాలే? మేమయినా అదిగో ఆ "జితకాశి" వెంకటసుబ్బయ్యగారి దురుసువ్రాత చదివిన పిమ్మటనే శాస్త్రిగారినిగురించి వారిశిష్యులనుగురించి భోగట్టాచెయ్య మొదలెట్టాం. ఆ 'జితకాశయ్య' పాండిత్యము మీ పూరిపత్రికల్లో నేబయటబడ్డదిగదా! అలాగే క్రమక్రమంగా పత్రికలవల్లా విమర్శ గ్రంథాలవల్లా, వకటికిరెండేండ్లు అక్కడి సంస్కృతపాఠశాల్లోనూ ట్రెయినింగుస్కూళ్లోనూ చదివివచ్చిన మా మిత్రులవల్లా అందటి అంతూ తెలుసుకొన్నాం. శాస్త్రిగార గ్రంథాలనుగాలించి తప్పులను కుప్పలుబోసివుంచాం వారికీ యితర పండితులకూ జరిగిన వాదప్రతివాదాలన్ని సంతరించి వుంచాం. ఇంతెందుకూ వారినీ వారిశిష్యులనూ గూర్చిన కథలూ కార్యాణలూ రహస్యాలతో గూడా తెలుసుకొనివున్నాం. మా గురువులను నిందించినప్పుడు మేముమాత్రం వూరకుంటామాయేమి? రాలరువ్విన వారిని పూలరువ్వవా రుందురా! అవసరం వస్తే అందటి కథలూ "విబుధజనుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపఱు" స్తాం. సరేనా? నీవు వూరికే వారిమీదా వీరిమీదాబడి కొట్టుకోకేం!

అసలు సంగతికి వస్తాం.

ఆయితే "దేవాదేవేషు" అచ్చుతప్పంటావు? బలే! బలె!! ఈ మాట

నీ సేద్యగాండ్లక దగ్గర చెప్పితే చలామణీ అవుతుందేమోగాని పండితుల దగ్గర చెల్లుతుందా! ఓడియమైనా లేక యెంతటి అబద్ధానికి వొడిగట్టావయ్యా యేమి నీకీగ్రహచారం. అబద్ధమాడినా అతకవద్దూ. కంపోజింగులో అక్షరాలు తారుమారవుతవిగాని కొత్తకొత్త శబ్దా లావిర్భవిస్తాయా? మీ వూరి కంపోజిటర్లు వేదపండితులు కాబోల్లే. కాకపోతే 'యద్దేవదేవ' (ఇందు "రెండవదేవ" అనవసరము) కు బదులు "దేవాదేవేషు" యేలా వేయగలిగి వుంటారు? పోనీ, ఆ కంపోజిటర్లు సోమయాజులే అనుకుందాం. అయినా శబ్దాలను మార్చడానికి వారికి స్వాతంత్ర్యమెక్కడిదో! ఓహో! అది స్వతంత్ర ముద్రాక్షరశాలకదూ! తెలిసింది తెలిసింది.

ఈ రకపు జవాబులకు పుట్టినిల్లు మీ గురువుగారే. వారియనుగ్రహం వల్లనే శిష్యులకు గూడా యీలా సంక్రమించింది. ఒక మాటు వారు పసులకు యతివేసి- యిదేమియతి స్వామీ! అని ఒక పండితుడు అడిగితే వెల వెలపోయి 'అయ్యా అది అచ్చువానితప్పని' చెప్పినారట ఆ కథ చెప్పుకొని ఆ దినాల్లో కవులూ పండితులూ నవ్వుకొన్నారు. కాబట్టి దీనికి నిన్నంతగా అనవలసిందిలేదులే.

పూర్వము నీవంటి పండితుడొకడు రాజదర్శనానికి పోయి "పటు ప్రతాపకంపిత దిగంతా" అనబోయి 'చింపితీరగంతా' అనెనట. ఆ తప్పుని సవరించుకొని వెంటనే "దింపితీరగంపా" అనెనట. అతని స్థితిజూచి ఆ రాజూ అక్కడి పండితులూ పొట్టలుబ్బనవ్విరట. ఆ చందంగా 'యద్దేవ' అనబోయి "దేవా దేవేషు" అనేపాటి పండితుడవు నీ వీ పండిత వివాదాగ్నిలో యెందుకు పడ్డావు రెడ్డీ?

ఓహో మాటలసందడట మరచేపోయినాను. శాస్త్రిలవారి శాసనత లానువాద దోషములసంగతి యేమి తేల్చావు? యేమో సమర్థించేవాడిలాగ బారుబారునవచ్చి గుక్కతిప్పుకోకుండా విప్రవినోదిలాగా పదివూళ్ళ పేర్లు

పదిపుస్తకాలపేళ్లు రేయేకరువుపెట్టి చల్లగా జారుకుంటే యెల్లాగమరి. నీవు జారుకుంటే మాత్రము నేను వూరుకొంటానా? "ఉడుమునడికిన నడుమునే బడియ పెట్టు!" (శ్రీనాథుడు)

ఒక్కమాట అడుగుతా చెప్పు—శాకుంతలాన్ని రంగానికెక్కించి మీశాస్త్రిగారి వ్రాతప్రకారం రాజును బఫ్లూనుగట్టి (రెండో అంకం లోనే) రాజధానికి పంపుతామనుకో ఆటుతర్వాత జరగవలసిన పనియేమి పదిదేశములనుండీ ప్రతులు తెప్పించి మీరు పదిమందీ బాగాపరకాయించి మరీ చెప్పండీ. శాస్త్రులవారి కీర్తికాంతకు కలిగిన కళంకమును కడిగి వెయ్యండీ.

రెడ్డయ్యా! మొన్న నేను జూపిన తప్పులమీద నీయాక్షేపమేమనీ? అవి శర్మగారిచేత గుర్తింపబడినవనా? ఒక శర్మగారిచేత నేయేమి విమర్శదృష్టితో చదివిన పండితులందరి చేతనూ గుర్తింపబడేయుంటవి. ఎవరు చెప్పినానూ ఆ దోషముల నేగదా చెప్పునురు? కనిపెట్టినవా రెవరైననూ తప్పులుం శాస్త్రిగారివేకదా? మరి నా వాదమునకేమి లోపమయ్యా! మఱి సమర్థించు చేతనైతే.

ఇవిగో మఱికొన్ని తప్పులు చెప్పుతూన్నా. వీనిమీదనీయాయాక్షేపము చెల్లునేమో తెలిసికోని చెప్పు.

(1) మీశాస్త్రిగారికి యథామూలముగా తెలిగించుటకు చేతగాదు. చూడు.

శ్లో. అనుకారిణి పూర్వేషాం యుక్తరూప మిదం త్వయి
ఆపన్నాభయ సత్త్రేషు దీక్షితాః ఖలు పౌరవాః

(శాకుంతలము)

ఆ. వె. పూర్వనృపులమార్గమునఁబోవు నీయందు
నింతదొడ్డగొన మిదేమివింత?

పౌరవులకు సార్త పరిపాలనం బనం
దిరుగులేని సత్త్రదీక్ష గాదె?

(వే, వేం. శా. తెలుగు)

యుక్త...త్వాయి అనగా యిది నీకు తగినది, యని యర్థము గానిఇంత దొడ్డ......వింత? అని అర్థముకాదు. ఆపన్నా......పౌరవాః అనగా ఆపన్నుల కభయమిచ్చుట యను సత్రమునందు పౌరవులు దీక్షితులుగదా అని యర్థముగాని పౌరవులకు......దీక్షగాదె అనికాదు. మూలమునకు సరిగా, కం. వీరేశలింగంపంతులుగారు యెంత ముచ్చటగా తెలిగించినారో చూడుము.

గీ. వినుము పూర్వులమార్గంబు ననుకరించు
నీకు నియ్యదియుక్తంబు నిక్కవముగ
నవని నాపన్నరక్షణ యాగమందు
దీక్షితులుగారె పౌరవుల్ ధీవిశాల.

(2) సంస్కృతము చక్కగా అర్థముకాదు, సందర్భమునుకనిపెట్టు . . . ప్రజ్ఞాలేదు.

(a) వలకంతచే వేగుతూవున్న శకుంతలకు సఖులు విసుగు చూ "సఖీ శకుంతలా! ఈ తామరపాకుగాలి నీకు సుఖముగానున్నదా? అని అడి గారు. అప్పుడు శకుంతల-కింమాంవీజయతః సఖ్యౌ? (సఖులారా! నాకు వీచుచున్నారాయేమి?) అన్నది. అనగా ఆ సమయమున శకుంతల, సఖులు తనకు వీచుచున్న సంగతిని గూడా తెలిసికోలేని దశలో నున్నదన్నమాట. ఇచట కాళిదాసుని రచన యెంతో సరసంగావున్నది. ఏం లాభం! కాళి దాసు కష్టమంతా గంగలోకలిసేట్లు మీ శాస్త్రిగారు, సఖులారా! ఏల నాకు వీచెదరు? అని తెలిగించారు. సంస్కృత మర్థమయ్యేన్నా సందర్భం తెలిసివున్నా యిలా తెలిగిస్తారా "సఖులారా! విసరుచున్నారా యేమి! అని

యనువదించిన శ్రీమతి కం. కనకమ్మగారికిని ఋా. శాస్త్రిగారికిని సంస్కృత భాషాజ్ఞానంలో భేదమెంతో వూహించ్చా[illegible]

సంస్కృతభాషానభిజ్ఞతకు యింకొక ఉదాహరణం

(b) స్వాగతమనేక ప్రకారాణాంజ్ఞేయాన్యనాం అనధ్యాయకారణానాం తపోధనానామ్ (ఉత్తరరామచరిత్రమ్) నేడు నరపమీస గడ్డాల గాళ్లకి సవిశేషమైన యనధ్యాయకారణం వచ్చిందని (వేం. శా. తెలుగు) మూలములో అనధ్యాయకారణానాం, అనేది మీ శాస్త్రిలవారి కర్థంకా లేదు. కాబట్టే నరపమీసగడ్డాల గాళ్లకి అనధ్యాయం కల్పించారు. అనధ్యాయము విద్యార్థులకేగాని ముసలి తపస్వులకుగాదు. చూడు మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారి సరియైన తెలిగింపు. "అనధ్యయన కారణులగు నీ ముసలిగడ్డములవారు". మఱొకటిగూడా చూపింతునా! యిదిగో.

(c) ఆ వుత్తర రామచరిత్రలోనే "మునిజన శిశురేకః" అనే శ్లోకంలో 'నవఇవ రఘువంశస్యప్రసిద్ధః ప్రరోహః' అనే పాఠం అర్థంగాక మీ శాస్త్రిలవారు "అనర్ఘగల రఘువంశనవాంకురము" అని తెలిగించారు. సంస్కృతభాషా పండితులైన మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు "నవ రఘువంశపరిభవాంకురంబు" అని చక్క[illegible] శాస్త్రిల వారికి సంస్కృతజ్ఞానము లేదనుటకీ యుదాహరణ[illegible] కావ లెనన్న యింకనుగలవు.



(3) యతిప్రాసం గూడా తెలి[illegible]

(a) * "అరికంఠాద్రిగుహానినిస్సర[illegible]..." [illegible] పాపం శాస్త్రిగారు యిది ప్రాసయతి అని భ్రమపడ్డారు.

(b) "సంతసమొలర్పంగ బలిమి మరలిచి తెచ్చెన్" (మాళవిక)

దీనిలో సమ లకు యతి తప్పు. దీనినే మీ శాస్త్రిలవారు అచ్చువాని

---

* ప్రాస్కులను విడిచిన స్వరయతిని యెక్కడనైన చూచారా?

తప్పని చెప్పినది.

శాస్త్రిగారికి యతిమైత్రి బొత్తిగా తెలియదనడానికీ వారి సర్వజ్ఞమ్మన్యతకీని యింకొక్క వుదాహరణం:—

(4) శృంగార నైషధం మూడవఆశ్వాసంలో 'నముచిదమనుండు పుత్తెంచి నాఁడు నీకు' అనే గీత పాదంలో నకారములకు రెంటికీ యతి చెల్లదని పెద్ద శాఖాంతం చేశారు. అంతే గాకుండా శ్రీనాథమహాకవికన్నా తానేమో గొప్పవాడైనట్లు నాఁడు-ను తొలిగించి నాఁశి-ని చేర్చారు.| నాఁడులో 'ఆ' కారమున్నదనీ అందువల్ల నది నకారముతో మైత్రినెనయదనీ వారికొక భ్రాంతి. వారు భారతమైనా నాచక్కగా చదివినవారుకారు. చదివివుంటే యీ భ్రాంతి వుద్భవించదు. ఇవిగో భారత ప్రయోగాలు:—

"నాకు దక్షిణగా నిచ్చినాఁడ వింక" (శాంతి ఆ. 2. 87).

"జనపతుల్ దమరాజసంబున దండించి

నారుగాకొల్లక నరులతప్ప" (అను శా. ఆ, 5.113)

"నాఁసుగుఱుతు సెప్పి నారెవ్వరనినను" (అశ్వమే ఆ. 1.45).

(5) తెలుగువాక్యాన్నయినా నిర్దుష్టంగా వ్రాయలేరని మునుపే చెప్పాను. అందున కింనులో యింకో వుదాహరణం:—

ఇప్పుడు ఆ దీనురాలిని రాణిగారు మునుపటికంటే జాగ్రత్తగా నాగు పాము కాపాడుతూవుండే మణిలాగ కాపాడుతూవున్నారు. అందువల్ల ఎంతమాత్రము దగ్గరికి వెళ్లడానికి వల్లపడకుండా వున్నది. (మాళవిక).

మణిలాగ కాపాడడం యేమిటో? మణికి కాపాడేగుణంవున్నదా? కాపాడేది పాముగాని మణిగాదు. నాగుపాము మణిని కాపాడుతూ వున్నట్లు రాణీగారు ఆ దీనురాలిని కాపాడుతూవున్నారు, అనాలి. తెలుగువాడైతే తప్పక అలాగే అనివుంటాడు.

ఏపదం ఎక్కడవాడాలో అసలే తెలియదు:—

**(6)** “ఆవివాహ సమయాద్గృహేవనే” (ఉత్తరరామ) అనే శ్లోకపాదాన్ని మీ శాస్త్రిలుగారు “పెండ్లి సమయంబునుండియు పేటఁగాట” అని తెలిగించారు. “కాడు” అనే శబ్దానికి అడవిఅనే అర్థంవున్నా కవి అయినవాడెవ్వడూ యిక్కడ వాడడు. కాడును వల్లకాడనేదే లోకంలో ప్రసిద్ధారం. రాముడడవికిపోయినా డనడానికి బదులు. కాటికిపోయినాడనడం ఎంత నుచితంగానుంటుందో నీవే చెప్పు.

ఇలాంటి దోషాలు మీ శాస్త్రిగారి వ్రాతలో కొన్ని వందలున్నాయి. వాటి నన్నిటినీ యిక్కడచూపి పాఠకులకు విసుగు పుట్టించడమెందుకూ. రెడ్డీ! మా శాస్త్రిగారి వ్రాతలో తప్పుండదన్న గర్వము, లేక భ్రాంతిని యికనైనా తొలగించుకో. తప్పులేనివాడు ప్రపంచంలో నేలేడు. తిరుపతి వేంకటేశ్వరులే మన్నారో విను—

గీ. ఎవటనేనియు తప్పుండు చేరకైన
గర్వమే భ్రాంతి పురుషుల ధర్మమగుట
పులుకు డెబ్బదిపదకొండు పోటుకులుండు
వాగుపీగును నొకతీగవారు గారు.

ఇకమీదట యెవరి గ్రంథాల్లోనూ తప్పులెన్నకు, ఏ పండితులను దూషించకు.

కం. ములుమూడిఘనుఁడ! బలు శా
ములు మూఁడుఁగదయ్య సుకవిపుంగవులను బూ
జ్యులఁ జెపనాడెడువారకిఁ,
తెలిసి తెలిసి యిట్టులేల తెగితివో కానీ.

ఉ. వ్రాయని కీర్తింగనిరి పండితులం దనియించి, రెడ్లు వి
ద్యాయుతులయ్యు భూమిపతులయ్యును సత్కవులయ్యు మున్ను, నీ

వాయమలాస్వవాయమున యంయజనించియు నిట్టిరేల నా
రాయణరెడ్డి! మర్త్యశమునందెను పెద్దలఁ దిట్టిచెట్టనె?

ఉ. గురువుల గొప్పచేసి బుధగోష్ఠి నుతించుట యొప్పెగాని య
ప్పురుసున సుంతయేని పరపండిత దూషణసేయరాదు నే
ర్పరియగు ఛాత్రుఁ *డాత్మగురురాయుల దోషము కప్పి పుచ్చుఁగా
కొరులఁగెరల్చి దేశికుల నూరక అబిడిపాలు సేయునే?

ఆ. వె. ఒరులఁజెనకి తనదు గురులఁ దిట్టించుట
పాపహేతు, నట్టి పాడుపనికి
నేల పూనుకొంటి వింతటితోనైన
మేలుకొనుము రెడ్డి! మేలుకనుము.



* ఛాత్రః-గురోః ఛిద్రం ఛాదయతీతి ఛాత్రః-ఛాత్రుఁడనఁగా—
గురువు యొక్క-లోపమును కప్పి పుచ్చువాడు అని యర్థము.

ముదుమూడి నారాయణరెడ్డి

# కాలగతి తలపోతల గతి

## 2 ఆచార్యుని అగచాట్లు



కవిత్వ నింద్యైకగతో జనో యో
నా ఽ సౌ ప్రయత్నః కురుతే తదర్థం
అధోముఖో నైవ కదాపి కుంభో
ధాతాప్యలం స్థాపయితుం జలంస్యాత్.

—రథాంగదూతమ్

బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములు పోలె కొంచెమెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు.

—భీమేశ్వరపురాణము.

మధురరసపూర్ణ సుకృతిసుమంబు రసిక
బంభరము దన్పఁగాని దుర్వార దుర్వి
దగ్ధవాదిశ్మశాన గృధ్రంబు దనుప
నేర్చునే యోర్చునే దాని నిష్ఠురతకు?

—ప్రణయ కుసుమము.

‘సరస్వతీరాష్ట్ర నాగరకాచార్యుఁడు’ తన ‘తోడుదొంగతనాల’ లో నా ప్రియాణయకుసుమకావ్యమునఁ జూపిన మోపయిన తప్పులు మూఁడే:

1. సంజకెంజాయను సూర్యవిరహార్తయైన దినలక్ష్మి మొగము చాయగాఁ జెప్పుట.
2. మల్లికను వసంతములోఁ జెప్పుట.
3. నాయికా నాయకుల కెగతాళి ప్రసంగములు కల్పించుట.

మూఁడుతప్పులు – ముప్పదిపుటల విమర్శ!

——మఱి చిల్లరతప్పులు రెండు:——

1. ‘నాథ’ అను సంబోధనమును – శృంగారమున వాడుట.
2. కుకవినింద చేయుట.

విమర్శకుఁడు నాతప్పులను చెప్పుటతోఁ దృప్తి పొందక, నాగ్రంథమునకుఁ బీఠిక వ్రాసినబ్ర.దు.శ్రీ– సుబ్రహ్మణ్యశర్మగారు – మల్లెకు – పర్యాయముగా కుందమును జెప్పిరనియు – అట్లుచెప్పుట గొప్పతప్పనియు– శర్మగారిని గూర్చిన ఆక్షేపమొకటి, నామీదియాక్షేపములతో జోడించినాఁడు.

ముందుగా కుందము -చందము పరికించి తరువాత నాతప్పుల తత్త్వముంగూర్చి తర్కించుకొందము.



# i

## మల్లీ కుందం భాం భాం.



ఓయి విమర్శకుండా

శర్మగారు మల్లికకు కుందమును పర్యాయపదముగా వాడిరని శ్రమపడి కనిపెట్టి దానితో శర్మగారి పాండిత్యపు టాయువుపట్టు పట్టుపడినట్లు లుబ్బితబ్బిబ్బులై – వారిని హేళనచేయుచు,

“మల్లీ కుందాల పార్థక్యం శర్మయ్యకు తెలియనే తెలియదు.” “మల్లీ కుందంభేద అజ్ఞానాన్ని ‘భాం భాం’ అని భేరీవాయించాడు. ‘తోడు’పోయి అసలు ‘కేడీ’ గానే దొరకక్కోవడం. ఆ చూకీతో సహా”:—

అని పదరితివిగదా! మల్లికాకుందములకు అభేదార్థమును చెప్పుమర్యాద పండితలోకమున నున్నట్లు, ఋజువుపఱిచితే నీ వేమయిపోయెదవు? *హరిశ్చంద్ర కథాఘట్టమున విశ్వామిత్రునితో వశిష్ఠుఁడు చఱచిన పన్నిదమువంటి పన్నిదమేమేని చఱచెదవా?

---

* సీ. ... ... ...

బోడిపై జన్నిదంబులు త్రెంచిపోవైచి
యపవిత్రమగు బూదినలఁది మేన
వారుణీపూర్ణమనుజ కపాలపాణి
నగుచు ఖరవాహనుండనై యామ్యదిశకు
నభిముఖంబుగ గమనింతు నఖిలజనులు
గోసి తొలఁగంగ బీభత్సరూపమునను.

(శంకరకవి)

**(1)** మాఘకావ్యమునకుఁ బ్రతిపదార్థము వ్రాసిన పండిత ప్రవరులు

శ్లో. ద్యోతితాన్తస్సభైః కున్దకుట్మలాగ్ర దతఃస్మితైః
స్నపితే వాభవత్తస్య శుద్ధవర్ణా సరస్వతీ.

అను శ్లోకమునకు "కున్దకుట్మలాగ్రదతః – కుందకుట్మల – మల్లెమొగ్గలయొక్క, అగ్ర– కొనలవంటి, దతః – పండ్లుగల" అని కుందమునకు మల్లెను పర్యాయముగానే చెప్పినారు. 'మల్లెమొగ్గలవంటి పలువరుసగల శ్రీ కృష్ణమూర్తి' అని తాత్పర్యమును గూడ వ్రాసియున్నారు.

**(2)** కాళిదాసు ఋతుసంహారమునకుఁ టీక వ్రాసిన పండితవరులును,

శ్లో. కుందైస్సవిభ్రమ వధూ హసితావదాతై
రుద్ద్యోతితా న్యుపవనాని మనోహరాణి
చిత్తం మునేరపిహరన్తి నివృత్త రాగం
ప్రాగేవరాగమలినాని మనాంసి యూనాం.

అనుచోటి 'కుందమును' 'మల్లె' యనియే యున్నారు.

**(3)** శ్రీకృష్ణ కర్ణామృతమునకుఁ టీకాతాత్పర్యములు వ్రాసిన పండితవరేణ్యులు తంజనగరం తేవప్పెరుమాళ్లయ్యగారు,

శ్లో. వంద్యందేవైర్ముకుందం వికసిత కురువిందాభ మిందీ వరాక్షం
గోగోపీబృందవీతం జితరిపునివహం కుందమందార హాసం,

అనుశ్లోకమున, – కుంద మల్లెలవంటియు........... చిఱునవ్వు కలవాఁడు అని కుందమును మల్లెగానే చెప్పిరి.

**(4)** రాజశేఖరకవి 'కావ్యమీమాంసకు' వివరణము వ్రాసినపండిత

పంచాననులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలవారు కావ్యమీమాంసలో

శ్లో. మరువక దమనక పున్నా
గపుష్పలింగాను వృత్తిభిః సురభిః
రచనీయ శ్చైత్రశ్రీః
కించి త్కుందానువృత్త్యా చ.

అను శ్లోకమును వివరించు పట్టున- 'కించి త్కుందానువృత్త్యా చ' అనువాక్యమునకు "మల్లెమొగ్గలున్నట్టులు అనువృత్తి చేయుటచేతను" అని కుందమును మల్లెగానే చెప్పినారు.

(5) మఱియును వారే శిశిరర్తుధర్మమును జెప్పుచోట,

శ్లో. పుష్పక్రియా మరువకే జలకేళినిందా
కుందాన్యశేష కుసుమేషు ధురిస్థితాని
సౌభాగ్యమేణతిలకా ద్భజతేఽర్కబింబం
కాలే తుషారిణి దహంతి చ చందనాని.

అనుశ్లోకమున కర్థముచెప్పుచు "కుందాన్యశేష...తాని" "మల్లెలు (కుందము) పూవులన్నింటిలోను తొలుత నెన్నదగినవైయున్నవి" అన్నారు.

(6) బహుగ్రంథపరిశోధకులు, పండితప్రకాండులు ఉత్పల వేంకట నరసింహాచార్యులవారు 'గీతగోవిందము' లోని

శ్లో. బంధూకద్యుతిబాంధవోఽయ మధరః స్నిగ్ధో మధూకచ్ఛవిః
గండశ్చండి! చకాస్తి నీలనలిన శ్రీమోచనం లోచనం
నాసాఽభ్యేతి తిలప్రసూనపదవీం కుందాభదంతి! ప్రియే!
ప్రాయస్త్వన్ముఖసేవయా విజయతే విశ్వం స పుష్పాయుధః.

అనుశ్లోకములోని 'హేమకుందాభదంష్ట్రః' అను పదమునకు ఓ మల్లె మొగ్గలవంటి పలువరుసగలదానా, అనియే తెలుగు వ్రాసినారు.

మఱియు,

(7) శ్రీ విజయనగరము మహారాజావారి కళాశాలాపండితులు సుప్రసిద్ధులు బ్ర. భాగవతుల రామమూర్తిశాస్త్రిలవారు విష్ణుసహస్రనామస్తోత్రమునకుఁగల శ్రీ శంకరభాష్యమునకు తెలుఁగు వ్రాసినవారు,

శ్లో. *కుముదః కుందరః కుందః
పర్జన్యః పావనోఽనిలః

అను శ్లోకములోని కుంద పదమునకు "మల్లెపూవులవలె అందగాఁడు." అనివ్రాసినారు.

(8) గుప్తార్థప్రకాశికాకర్తలు జగత్ప్రసిద్ధవిద్వాంసులు మహామహోపాధ్యాయబిరుదాంకితులు నగు కల్లూరి. వేంకటరామ శాస్త్రిలవారు తమ మేఘసందేశానువాదమున,

"హస్తే లీలాకమల మలకే బాలకుందానువిద్ధం" అను శ్లోకమును
"కరమునఁ గేళికాబ్జ మలకంబులఁ గ్రుచ్చిన లేత మల్లిపూలు" అని తెనిఁగించి, కుందమునకు మల్లి పర్యాయ మని తెలిపినారు.

(9) వైయాకరణశిరోమణి మహాశ్రీ. పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు తమ ద్విపద మేఘదూతమున

"కుందక్షేపానుగ మధుకర శ్రీముషామాత్మబింబం"
అను సంస్కృతమునకు తెలుఁగువ్రాయుచు
"మఱి పైకిఁజిమ్మిన మల్లెలవెంట!"

* 'కుందోపమ సుందరాంగత్వాత్ స్వచ్ఛస్ఫటికవ న్నిర్మలః' అని భాష్యపంక్తి.

అని మల్లెను యతిస్థానమున నునిచి అచ్చుత ప్పనువాదమునోట మట్టి కొట్టినారు.

(10) వ. సు. రాయ 'కవిశేఖరులు'–పూ శ్లోక పాదమునే యిట్లు తెలిఁగించినారు. ఇదేపద్యము

చ. అల నవిబాఁటి మేఘ! చనుమా కనుబొమ్మలనీటుగుల్క నె
ప్పలు పయికెత్తఁగాఁ జదలఁ బర్విన తెల్పునునల్పు మల్లెపు
వ్వులు వెదచల్ల వెంబడినపోయెడు తమ్మెదదిమ్ము మాడ్కి నిం
పలరఁగ నీ హొయల్ దశపురాయతనేత్రలు కోరి చూడఁగాఁ.

ఇట్లే యెందఱెందఱో సుప్రసిద్ధులు కవులు, విద్వాంసులు, విమర్శకులు, వ్యాఖ్యాతలు, 'మల్లి'కి కుందమును పర్యాయముగా గ్రహించి యున్నారు.

(11) వారివీరిమాటలేల? కళాప్రపూర్ణులు మహోపాధ్యాయులు 'ఆంధ్రమల్లినాథులు' మన వేదం వేంకటరాయశాస్త్రిగారే, బిల్హణీయ కావ్యములోని,

శ్లో. అద్యాపి తన్ముకుళకున్ద సమానదన్తం
తిర్యగ్వివర్తిత విలోలవిలోచనాన్తం
తస్యా ముఖం త్వతితరాం నహి విస్మరామి
చిత్తే కృతజ్ఞ ఇవ సాధుకృతోపకారమ్.

అను శ్లోకమునకు ప్రతిపదార్థమును వ్రాయుచు, ముకుళకున్దసమానదన్తం= మొగ్గలయిన మల్లెలతో సమానములయిన దంతములుకలది, అని సెలవిచ్చియున్నారు.

(12) మరల శ్రీవారే విక్రమార్క చరిత్రలోని,

శ్లో. కర్పూరాదపి కైరవాదపి దళత్కున్దాదపి స్వర్ణదీ
కల్లోలాదపి కేతకాదపి గలత్కాన్తాద్భృగన్తాదపి
దూరోన్ముక్తకళఙ్కశఙ్కర శిరశ్శీతాంశుఖణ్డాదపి
శ్వేతాభి స్తవకీర్తిభి ర్ధవళితా సప్తార్ణవీ మేదినీ.

అను పద్యమున కర్థమును వివరించుచు, దళత్కున్దాదపి=వికసించుచున్న మల్లెమొగ్గలకంటెను అని యానతిచ్చియున్నారు.

**(13)** మరల ఆశ్రీవారే భోజచరిత్రలోని

శ్లో. "హిమకుంద శశి ద్యుతి శంఖ నిభం
పరిపక్వకపిత్థ సుగంధిరసం
యువతీకర నిర్మథితం మథితం
పిబ హేనృప సర్వరుజాపహరమ్.

అనుపద్యములోని హిమకుందశశి అనుపదములకు మంచు, మల్లెపువ్వు, చంద్రుఁడు, అనెడివాని కాంతివంటి కాంతిగలది యని యర్థముననుగ్రహించియున్నారు.

**(14)** మరల, నవ్వారే అమరుకములోని

"శ్లో. దీర్ఘా తోరణమాలికా విరచితా దృష్ట్యైవ నేందీవరైః
పుష్పాణాంప్రకర స్స్మితేన రచితో నో కుంద జాత్యాదిభిః
దత్తస్స్వేదముచా పయోధరభరే ణార్ఘ్యో న కుంభాంభసా
స్వైరేవావయవైః ప్రియస్య విశత స్తన్వ్యాకృతం మంగళం.

అనుశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచు, కుందపదమునకు మల్లె అనియె అర్థమును చెప్పియున్నారు. పెదకోమటి వేమారెడ్డి 'కుందజా

త్యాదిభిః. మాఘ్యమాలత్యాదిభిః అని యొకవంక స్పష్టముగాఁ జెప్పుచున్నను దానిని త్రోసిపుచ్చి శాస్త్రిగారు జంకుకళంకులేక కుందమనఁగా మల్లె అనియే సిద్ధాంతము చేసినారు.

(15) ఓయీ, మన వేంకట రాయశాస్త్రిగారే మేఘసందేశవ్యాఖ్యానమునఁగూడ కుందమునకు మల్లె అనియే అర్థమని నిర్ధారణచేసినారు.

శ్లో. ఆశ్వా స్యైవం ప్రథమవిరహా దగ్రశోకాం సఖీం తే
శైలా దాశు త్రినయన వృషోత్ఖాత కూటా న్నివృత్తః
సాభిజ్ఞానం ప్రహితకుశలై స్తద్వచోభి ర్మమాపి
ప్రాతః కున్దప్రసవ శిథిలం జీవితం ధారయేథాః.

ప్రాతః...శిథిలమ్. ప్రాతః = ప్రాతః కాలమునందలి, కుంద ప్రసవ = మల్లెపువ్వువలె. శిథిలమ్. = దుర్బలమైన:— సరే నా?

(16) అయనగారే మళ్ళీ ఆమేఘదూతలోనే

"కుందక్షేపానుగ మధుకర శ్రీముషామాత్మబింబం"

అను శ్లోకమునకు వివరము నిట్లువ్రాసినారు:—

కున్ద = మల్లెలయొక్క— అనియర్థమునను

(17) ఇటు నటు మల్లెలను మీటఁగా వానివెంటఁ దుమ్మెదలు పోయిన నెట్లుండునో అట్లున్నవియు. అనిభావమునను వ్రాయుటేకాక

(18) (అనుగ) = తుమ్మెదలు మల్లెలవెంటఁబోవుట పరిమళము కొఱకును తేనెకొఱకును అని పదప్రయోజనముననుగూడ కుందమును మల్లెగనే వ్రాసినారు.

(19) మఱియును దాత్పర్యమునను మల్లె లనియే సెలవిచ్చియున్నారు.

## చాలునా ఉదాహరణములు?

పై పండితులందఱును ‘మల్లీకుందం భేదఅజ్ఞానా’న్ని ‘భాం’‘భాం’ ఈ భేరివాయించినవారేనా? ‘అసలు కేడీ’లేనా? ‘అచూకీతోఁసహా’ చిక్కిన వారేనా? అగుచో నొక్కమాట:—

నేనిచ్చిన 19 ఉదాహరణములలోను పది పరదేశ పండిత కవులవి, తొమ్మిది మన వేంకటరాయశాస్త్రిగారివి. కావున వారందఱిలోను పెద్దభాగస్థులు, వస్తుతః పెద్దబిరుదులు గలవారు, పెద్దపెద్దగ్రంథాలకు వ్యాఖ్యలు వ్రాసినవారు, పెద్దపేరు గలవారు, పెద్దలు, వే. వేం. శాస్త్రిగారే- పెద్ద ‘కేడీ’ అవుచున్నారే ఎట్లు మిడికెదవు? ఏమిచెప్పెదవు!

చెప్పుటకేమున్నది? కానీ ఆశర్మగారి మెడలో నీవు వేయఁదలఁచిన ఆ ‘భాం’ ‘భాం’ భేరిని తీసి నీచేతిమీఁదుగనే శ్రీ శాస్త్రిగారి కీర్తిమూర్తి మెడలో తగిలించు, పిమ్మట నీ మెడలో తగిలించుకో- ‘భాం’‘భాం’- అనిబాదుకొనుచు నీ రాష్ట్రమున నూరేగుము. నీనాగరకతను నీపాండిత్యమును, పదుగురికిని తెలుపుకొమ్ము-పొమ్ము.

**(20)** ఇదిగో పోకు పోకు మొక్కమాట; భాషాత్రయకోవిదుఁడు ‘మేఘానువాదకులలో ‘ఉచితజ్ఞుఁడు’ ‘గుణముకులుఁడు- సుబ్బరామయ్య’ గారు తమ మేఘసందేశములో కుందమును మొల్లగా నొకచోటను, మల్లెగా నొకచోటను చెప్పియున్నారు. వారిమెడలోఁగూడ కొంచెముసేపు, ఆ భేరినివేసి వారికీర్తిని- కాదు కాదు- ‘మల్లీకుందం భేద అజ్ఞానాన్ని’ ‘భాం’ ‘భాం’- అని మ్రోఁగించవలెఁ జుమా.

చెప్పమఱచితిని. వారిమాట యెట్లైనను, తదనువాదమును దిద్ది ప్రతి

పదమునకును, (మల్లెకును) పెఱుఁగుపెట్టినవారు శ్రీమాన్ వేలటూరురామదాసయ్యంగారుగారు యం. యే. యల్. టి. అఁట వారిమెడలో నీభేరి తప్పక తగిలించి 'భాం భాం' అని జగమెల్ల నెఱుఁగ మ్రోఁగించవలెనోయీ—మఱచెదవేమో మాటవచ్చును. జాగ్రత్త ఇఁక పొమ్ము.

విమర్శకమ్మన్యుఁడా,

ఇట్లు విగ్రహీత్రి—వులెల్లరును కుందమును మల్లెగాఁజెప్పుట, కుందము మొల్ల యని యెఱుఁగక కాదు. మల్లెలును మొల్లలును వేర్వే ఱని తెలియక కాదు. మఱియేమనఁగా భేద ముపేక్షణీయమగుటఁబట్టియే కవులు వానిం బర్యాయములుగా వాడుట. అవి ఒకేజాతికిఁ జేరినపువ్వులు. ఒకేవన్నెకలవి ఒకేరూపముకలవి. ఒక తెఱఁగు సౌరభము కలవియు. కవుల యుపమలకు ఒకే విధముగా నుపయోగపడునవి. తొమ్మిదిమాఱులు కుందము = మల్లె యని వ్రాసిన వే. వేం. శాస్త్రులవారే నైషధాముక్తమాల్యదావ్యాఖ్యలలో కుందమును మొల్లయని వ్రాసినారు. అట్లే మల్లె (మల్లిక)ను కుందమన్న శ్రీ శర్మగారును ఆ లక్ష్మీశృంగారకుసుమ మంజరిలోనే యొండెడ మాఘ్యముల (కుందముల) మొల్లలుగానే చెప్పియున్నారు. ఈపాటి కవిలోక పరిపాటి నెఱుఁగక వెంకటరామశాస్త్రి ప్రభృతి విద్వజ్జనులనెల్ల పెక్కిరించితివి. నీ యజ్ఞానాన్ని – 'భాం'– 'భాం'–అని చాటుకొంటివి. పండితులను పరిహసించినపాపము పరిహార మగునట్లు– నీచేసిన అపరాధమునకు ప్రాయశ్చిత్తముగా– 'రాం'– 'రాం' అని రామస్మరణచేసికొని, యింకమీఁదనైన నిట్టి తాఁకు తప్పు తెలియని వ్రాఁతలు మానుకొమ్ము అది శ్రేయస్కరము. విషయమెఱుఁగక విజ్ఞులను పెనకుట విపత్కరము.



## ii

# మల్లెపూలు - మధుమాసము.

మల్లిక గ్రైష్మమనియు, దానిని వసంతములో పొత్తుకలుపుట 'దేశకాలాది ప్రకృతివ్యత్యయం అనే దోషం' అనియు మఱొక యాక్షేపము.

విమర్శకుఁడు—'లక్ష్యం జగత్తు' మల్లిక గ్రైష్మమనియే చెప్పుచున్నది. (వాసంతముగాఁ జెప్పలేదు) ఇది పట్టి కవిసమయంమాత్రమే కాదు. ప్రకృతిసిద్ధమున్నూ, అని యొకమాటను, "గ్రీష్మం వసంతానికి అత్యనంతరం గనుకఁబట్టి అక్కడిదికొంత యిక్కడ ఇక్కడిదికొంత అక్కడ పుంజుకుంటే అంత ప్రకృతి విరోధం కాదు. అనుగుణము కూడా నేమో" అని మఱియొక మాటను వ్రాసి తన అవక తవక పచ్చు ఆక్షేపణస్వరూపమును తానే నిరూపించియున్నాఁడు. అవాంతరయొక్క పిండితార్థ మేమనఁగా:—

(1) మల్లిక గ్రైష్మముగాన వసంతములో ప్రధానముగా చెప్ప రాదని.

(2) మల్లికావసంతులను నాయికానాయకులనుగాఁ జెప్పుట పొసఁగ దని.

ఈ యాక్షేపణలును నాగరకాచార్యుని అల్పజ్ఞానపరిణామములే. కవిసమయములను నిర్ణయించుటకు శబ్దవ్యుత్పత్తులును, నిఘంటువులును చాలవు. అలంకార శాస్త్రజ్ఞానమును బహుకావ్యపరిచయమును వలయును. అట్టిదియేపాటియున్నను ఆచార్యుఁ డాయాక్షేపములను చేసియుండఁడు. జాతి (విరజాజి) నిదక్క సకల పుష్పములను వసంతమున వర్ణింపవచ్చును. ఇదే కావ్యకల్పలతలోని అభ్యనుజ్ఞ .

శ్లో. సురభౌ డోలా కోకిల మారుత సూర్యగతి తరు దలోద్భేదాః
జాతీతర పుష్పచయా మ్రిమంజరీ భ్రమర ఝంకారాః.
నస్యాజ్జాతీ వసంతే:—

ఇట్టి యాఖ్యానుజ్ఞ రయేగాక, వసంతమున మల్లికను ప్రధానముగా వర్ణించిన కవివాక్యములు పరస్సహస్రములు కలవు. వసంతవర్ణనమునకుఁ బూనుకొనిన కవికి, తక్కిన పుష్పములమాట యటుండు, మల్లికయే తొలుత స్ఫురించిన ప్రయోగములును గలవు. వసంతమున మల్లికనుజెప్పని కవి లేఁడన్నను నతిశయోక్తి కాదేమో! కాని, యితరపుష్పములతోపాటు మల్లికనుజెప్పిన కవుల యుదాహరణములనువాని, దానిని ప్రధానీకరించి చెప్పిన లక్ష్యములనే చూపెదను.

(1) వసంత తిలక భాణము.

వసంతతిలక మనుపేరనే తన భాణమును సాగించిన శ్రీ వాత్స్యకుల తిలక వరదాచార్యకవి వసంతరామణీయకము నిట్లు వర్ణించినాఁడు.

"అహో ఖలు రమణీయతా వసంతస్య"

శ్లో. మందం మందం మలయపవనో మల్లికాసూత్రధారః
పాయం పాయం మధుపరిమళం పాటలీకుట్మలానాం
మధ్యే మధ్యే విరచితగతి ర్మాననీమంటపానాం
క్రీడాక్షేపం హరతి శనకైః క్రీడయాసుందరీణాం

వసంతకాలపు మందపవనుఁడు మల్లికాసూత్రధారుఁ డఁట. అనఁగా వసంతమున మల్లికాలతలను మలయపవనుఁ డాడించుచున్నాఁ డని యర్థము. 'వసంత' మనఁగానే వరదాచార్యకవికి ఏమి తోఁచినది? మల్లికయే—మన 'సిటీస్కావింజరు'? అదృష్టము!

(2) జయదేవమహాకవి, గీతగోవిందమున:—

శ్లో. దరవిదళిత మల్లీవల్లి చంచత్పరాగ
ప్రకటిత పటవాసై ర్వాసయన్ కాననాని
ఇహహి దహతి చేతః కేతకీ గంధబంధుః
ప్రసర దసమబాణ ప్రాణవ ద్గంధవాహః.

గంధవాహుఁడు మల్లెల పుప్పొడిచల్లి కాననములను సువాసితములు చేసి యీవసంతమున మనస్సును దహించుచున్నాఁడన్నాఁడు. ఇచ్చటను కవికి తొలుదొల్తతోఁచినది 'మల్లిక'—అవల నే కేతకి.

(3) సరస్వతికి కంఠాభరణము సమర్చిన మహాకవి శ్రీభోజరాజ సార్వభౌముఁడు తనరామాయణ చంపువున:—

* వసంతవాసరములలో రాముఁడు ఋశ్యమూకమున పొదరిండ్లలోఁ గ్రీడించుచున్న బోయపడుచుల వదులువాఱిన కొప్పులలోని మల్లెల నెత్తావులచే బలిసి వీచిన వనవాయువులకుఁ గంపిల్లి నట్లు చెప్పినాఁడు.

అభాసవిమర్శకుండా!

అమహారాజకవికిని వసంతమునఁ గనఁబడినది మల్లికయే. మఱి నీ వాదము గతియేమి?

(4) ప్రసన్నరాఘవమున జయదేవ కవియు:—
'అవతీర్ణైవ వసంతలక్ష్మ్యైః, అనివార్య సి వెనువెంట నే

---

* తస్మి న్ననుమ శరసమర సమయే రామః, గహనపద మవగాహ్య ........శంబరా రాతిశరధి సదృశ తటరుహసహకార శిఖర విసర దాసవాసార శీకరశేఖరైః...కాయమాన సమానాభోగ లతాగృహ కేళీలుబ్ధ లుబ్ధక పురంధ్రి శిథిల ధమ్మిల్ల మల్లికా గంధమాంసలైః...వనపవనైరను కంప్యమానః పంపా మభజత.

శ్లో. ఇహ మధుప వధూనాం పీత మల్లీమధూనాం
విలసతి కమనీయః కాకలీసంప్రదాయః
ఇహ నటతి సలీలం మంజరీ వంజుళస్య
ప్రతిపద ముపదిష్టా దక్షిణేనానిలేన.

వసంతావిర్భావమునకు మల్లెపూవుల మధువులను గ్రోలి సోలెడు తేంటి వధూటుల పాటలు, దక్షిణానిలమున కూఁగెడు (వంజులపు) లేఁగొమ్మల ఆటలు ముఖ్యలక్షణములుగాఁ జెప్పినాఁడు. ‘అవతీర్ణవా’లోని ఏవకారముచేత ‘ఋతు ధర్మములెల్ల చక్కఁగా నావిర్భవించినవని తాత్పర్యము’ అన్నారు తద్‌జ్ఞులు.

ఈవర్ణనమునను మల్లికకే ప్రధానత.

(5) పెద్దాపద నాగయామాత్యుఁడు. వసంతమును వర్ణింపఁబూనఁగానే- అతని మనస్సున కే పుష్పములు తగిలినవో చూడుము.

చం. అలరె వసంతకాలము వనాబ్జ కుటీసుకటీపటీ భవ
ల్లలితమదాళినీకలచలద్గరుదగ్రిమరుద్విధూతపే
శలతర మల్లికాప్రసవ జాలసితాంతరజఃప్రపూరితా
ఖిలహరిదంతరాళము, శుకీశుకరావవిశాల మొంటెయున్.

దిగంతరాళము లెల్లను, మల్లికాపుష్పముల తావితో సురభీకృతంబు లగుచుండఁగా నీకు ఆసౌరభము లేశమును అనుభూతము కాదేమి? ఆహాఁ తెలిసినది. నీవుచేయవలసినది ‘సాక్-షెంజ్!’ కావున నీకుఁ గొట్టవలసినవాసన యే నీకుకొట్టినది,

(6) రసికజనమనోభిరామ కర్త, కూచి మంచి తిమ్మన్న:—

సీ. "పరిఫుల్ల మల్లికాప్రసవ రసాస్వాద
నాలోల రోలంబ జాలకములు"

వసంతమున మల్లెలు 'పరిఫుల్లముల'ని— 'ప్రసవరసాస్వాద నాలోల రోలంబ జాలకము'లచే— సిద్ధాంతము చేయించినాఁడు. ఏమనెదవు!

(7) తారాశశాంక విజయకవి:—

వసంతసమయమున 'అల్లిబిల్లిగా మొల్లమిగ నల్లికొనిన మల్లియలను'— చెప్పుటతో నూరకొనక 'మొయిళ్ళనుండి ముత్యంబులు రాలువిధంబునఁ గొప్పుననుండి తెలిమల్లెమొగ్గలు రాల (తార) తేనెవాఁకలు దాఁటి' నట్లు కూడ చెప్పి వాని పెల్లిదమును ప్రకటించియున్నాఁడు. తెలియునా!

(8) శకుంతలాపరిణయకర్త పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి:— శకుంతలా దుష్యంతులు, వసంతమున—

'తావిచల్లులు వెదచల్లు నుత్ఫుల్లమల్లికావల్లికామతల్లికా గృహంబులఁ గ్రీడించినట్లు చెప్పుచున్నాఁడు, వినవచ్చుచున్నదా!
విమర్శకుండా,

ఇట్లు ఇందఱుకవులు మల్లికలను (విరియఁబూచినవానినే) వసుధుమా సమున వర్ణించియుండఁగా—అక్కడిదికొంత ఇక్కడ— ఇక్కడిదికొంత అక్కడ— అని నీళ్ళునమలెద వేమి?— కావ్యజ్ఞానములేకయేగదా?

అసలు, ఏదియుఁ జదువకయే, చదువుకొన్నది సమగ్రసించుకొన నేరకయే, సమరసించుకొన్నది తేటగాఁ జెప్ప రచనాపాటవము లేకయే— ఈలోకవంచనయేల 'చెప్మా'

(9) ఓయి ఆచారీ! ముద్దుపళని యను నొక వేశ్యకలదు. ఆవిదుష్ రాధికాసాంత్వనము— అనునొక శృంగారకావ్యము వ్రాసినది. అందులో ఈక్రింది పద్యమున్నది. చూడుము.

ఉ. "మల్లెలు మొల్లమొగ్గలును మంకెనపూవు సువర్ణకోశముల్
తెల్లనినవ్వు పల్వరుస తీయనివాతెఱ నిక్కముక్కునై
యల్లుకొనన్ ముఖాబ్జమున నాతఁడు మాధవుఁ డౌటింగి"

పద్యములోని యితరచమత్కారములు నీకేమిటికిఁగాని. మాధవు (వసంతు) నెఱుఁగుటకు మల్లెలు ప్రధానచిహ్నములుగాఁ జెప్పఁబడి యున్నదో లేదో తెలిసికో. పద్యములోని మల్లెలను తీసివేసినచో మాధవుని కెట్టి వికృతికల్గునో తెలియునా? నవ్వులు నువ్వులగును.

**(10)** ఉత్తరరామాయణమున సీతారాముల యుద్యానవిహారమునః-

చం. 'పొనపొన పొన్నగున్నపయి బోఁటిరొ, మల్లిక ప్రాఁకి మాటికిన్
నునువిరితేనె చిందుచు మనోహరభృంగరవం బెసంగ, గా
లి నోరయుచున్ రతిన్ నినువలెన్ జెలువొందెడి' నన్న నల్లనల్
గనుచు లతాంగి నవ్వుచు మొగం బదిమెన్ బతిపేరురంబునన్,

ఇందు మల్లికకును, పొన్నగున్నకును నాయికానాయకత్వము జెప్పుట ముఖ్యవర్ణనమా? ప్రాసంగికమా? అన్నిపూలతోపాటు మల్లెలనుగూడ- 'గుంపులో గోవిందా'- అన్నట్లు చెప్పుటకాదోయి? అర్థమగుచున్నదా!

(11) ఆ యుత్తర రామాయణముననే, ఆ ఘట్టముననే—

సీ. సీతాంబుజాతాక్షి చిఱునవ్వుచాయతో
సవతైన విరిమల్లెసరులు కొన్ని.
... ... ... ...
... ... ... ...
ఏర్చికొని తెచ్చి యినకులాధీశ్వరునకు
నెలమి వనపాలకులు కొన్ని యిచ్చుటయును.

మల్లెలు లేకున్నను తెచ్చి యివ్వవచ్చునందువా? లేనివి ఉన్నట్టు చూపుటకు, ఇదియేమి యక్షిణీవిద్యయా?

(12) రసికజనమనోభిరామము:—

కం. వనరమకున్ మాధవునకుఁ
దనరఁగఁ బరిణయ మొనర్పఁ దఱి యను జవరా
లునిచిన ముత్తెపుఁబ్రాలన
మొనసి వనిం గ్రొత్తమల్లెమొగ్గలు దనరెన్.

పరిణయసమయమున తలఁబ్రాలెంతముఖ్యములో వసంతసమయమున మల్లెలును అంతముఖ్యములఁట విన్నావఁటోయి విమర్శకమ్మన్యుఁడా?

(13) హరిభట్టు నరసింహపురాణమున:—

ఉ. 'సంతసమొందె నంతట వసంతము పుష్పమరందసింధువే
శంతము భోగిలోకచయశాంతము, సంతతఫుల్లమల్లికా
కాంతము, మాన్మథ స్ఫురణకాంతము, దిక్కుటకావగాహిరు
గ్భ్రాంతము, షట్పదస్ఫురదుపాంతము, చెన్నగునున్నతోన్నతిన్,
అనియు

సీ. "కోయిల లిగురాకుకొనలాని ముదమూని
కావించె బహుకుహూకారఫణితి
పుష్పంధయములు సంఫుల్లవల్లీలతా
ప్రసవగుచ్ఛంబుల బ్రమరివాలె"

అనియును వర్ణించి వసంతమున మల్లెలు సంఫుల్లము లని చెప్పినాఁడు.

(14) కవిజనరంజనము:—

సీ. సరసోరుకదళికా స్తంభంబులను మించి
శుభకరపల్లవ స్ఫురణ నెగడి

పృథులకుచంబులఁ బెంపొంది చారుచం
పకకలికాతను ప్రభలఁ దనరి
యనుపమసుమమాలి కాభీరయాప్యముదాల్చి
రాచిల్కపలుకుల రహిఁదనర్చి
భ్రమరకనీలశోభామంజిమ వహించి
పలుమల్లెమొగ్గలఁ బరిఢవిల్లి
తిలకరుచిఁబొల్చి మోవికాంతినిఁ జెలంగి
సొంపటఁబొసంగి, యామోద భరమునించెఁ
జూపఱకునెల్ల వనలక్ష్మి సొంపెలర్వ
నభినవంబైన యావసంతాగమమున.

అడిదము సూరకవి మల్లెలను ఆరామలక్ష్మికి దంతములుగాఁ జెప్పి. వాఁడుగదా, నీవేమందువు? నీసిద్ధాంతముప్రకారము అడిదమువారి ఆరామలక్ష్మమ్మను డెంటిస్టు (Dentist) కడకుఁబంపి 'పలుమల్లెమొగ్గలు' ఊడఁబెఱికించి బోసినోటిబోకిని చేయించవలసినదే నా? నలుగురును నవ్వెదరు. నీశాస్త్రజ్ఞానమును బయటఁబెట్టకు.

మహాకవులును, వ్యాఖ్యాతలును మల్లిక పుష్పవతియగుట వసంతర్తుధర్మ మని యేకగ్రీవముగా, చెప్పుచుండఁగాఁ నీవు మల్లికను వసంతమునఁ జెప్పుట తప్పని నన్ను వెక్కిరించితివే నీ తెలివి నేమనవలెను! నిన్నేమిచేయవలెను?

వసంతమున మల్లెలు వెల్లికొల్లలుగా పూచుట జగమెల్ల నెఱిఁగినవిషయమే అయియుండఁగా వానినినీవిట్లు కవులప్రయోగములవలనఁ దెలిసికొనుట ముంజేతికంకణమును అద్దమునఁజూచి తెలిసికొనుటవంటి నవ్వులమారి పనిగదా?

లక్షణకర్తలు జాతీతర కుసుమములను అనఁగా మల్లికాదులను వసంతమున కవులు యథేచ్ఛముగా వర్ణింపవచ్చునని యాజ్ఞయిచ్చినను, సకల కవులును మల్లికావసంతములకు మైత్రిని చెప్పియున్నను, మల్లెపుష్పాలను మనము వసంతమునఁ గన్నులారఁ జూచుచున్నను:—

'నిఘంటువున, శీతాద్రిభేశ; గ్రీష్మజత్వా చ్ఛీతభీరుః'

అని యున్నది కావున వానిని వసంతమునఁ జెప్పుట తప్పు; మహాదోషము అనుటకంటెను వింత యేముండును? అట్లను విమర్శకుఁడు 'నేను బ్రతికేవున్నానుకో భగవంతుఁడా' అని వేఁగి మొత్తుకొనుచున్నను వినక 'Doctor says that you are dead' నీవు చచ్చావని వైద్యుడు చెప్పాడు. కాబట్టి యింక నీవేమిచెప్పుకొన్నను లాభంలేదు''అని వివదించిన యవివేకికి అన్నయగునే కాని తమ్ముఁడు కాఁడనియే పెద్దల సిద్ధాంతము. మల్లికా వసంతులకు మైత్రిని జెప్పవచ్చునన్న ప్రాచీనకవి పరంపర వాక్యాలటుండఁగా, నేఁటి కవిసార్వభౌములు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, తమ 'చంద్రికాపరిణయ' నాటకములో, ఋతు (వసంత) వర్ణనమున మల్లికలనే ప్రధానీకరించి,

తరళము,

(15) మలయమారుతపోత మెంతయు మల్లికాకుసుమంబులన్
గలసుగంధము నల్గెలంకులఁ గ్రమ్మఁజేయఁగఁ దుమ్మెదల్
పలుతెఱంగులఁ బోయిహోయిగఁ బాడుచున్ మధు పానికో
కిలలపాట కుపశ్రుతిన్ గలిగించె మించినవేడుకన్.

అని కవిత్వముచెప్పినారే యెఱుఁగుదువా? వారికిని "లక్ష్య జ్ఞానములే"దందువా? వారికవిత్వమును 'అజ్ఞానవిలసితమే' నందువా? ఏమం

మనో అనుము. ప్రాజ్ఞలోకము పీఠులవించుగా వినుఁగాక. ఆ కవి సార్వభౌములను అంతరంగమున నానందింతురుగాక. ఆంధ్రలోకమంతయు నెల్లూరి 'నాగరకాచార్య' విమర్శజ్ఞానమునకు విస్మయంపడుఁగాక. నాగరకవిమర్శకుఁడా!

నేఁటి కవిసార్వభౌముని మాటను నీవు పాటింపకపోయినను పోయెదవేమో గాని, నాఁటి కవిసార్వభౌముని మాటను కాదని దాఁటిపోలేవుగదా! ఇదిగో అతనిమాట.

(16) ఉ. స్వామిహితంబునన్, సమసశాత్రవభంజన శక్తి,బంధుర
శ్రీమహనీయసంపద, వసంతసమాగమ ఫుల్లమల్లికా
స్తోమముతో పారపాండురయశోగరిమంబున, ధర్మశీలతన్
మామిడిమంత్రిఁ బోలమతిమంతులు లేరు వసుంధరాస్థలిన్.

—నైషధము.

వసంతమున 'ఫుల్లమల్లికాస్తోమము' (అరవిచ్చిన మల్లెలు, ఒకటిగాదు. రెండుగాదు, గుంపులుగుంపులు) అన్నట్లు శ్రీనాథమహాకవి చెప్పుచున్నాఁడు వినఁబడుచున్నదా! మిక్కిలి తెలివిగలవాఁడా! శ్రీనాథునిరచనయును 'అజ్ఞానవిలసితమే' నా! 'దేశకాలగాన సంకేతవ్యత్యయం' అనే దోషానికి ఆలంబనమే నా! అయ్యో! ఎంత గొప్పపండితుఁడవు దిగఁబడ్డావోయి నేఁటికి నెల్లూరి పుణ్యవిశేషమున!

సరేగాని, ఆ శ్రీనాథుని రచనను మన కళాప్రపూర్ణులు, సర్వతంత్ర స్వతంత్రులు, మహోపాధ్యాయులు, కీర్తిశేషులు, వే. వేం. శాస్త్రిగారెట్లు వివరించి చెప్పినారో ఆడుపుము; నీజాడ్యము వదలిపోవును.

వసంత.....బునన్ — వసంత (పుష్పవృద్ధికి ప్రధానమును, తమ

ఋతువును, ఐన, (యామినియొక్క) సమాగమ = రాకచేత, ఫుల్ల = వికాసించిన. మల్లికా = మల్లెలయొక్క. స్తోమ = సమూహము’’

—సర్వంకషావ్యాఖ్య.

ఆంధ్రమల్లినాథులు, ఆశాస్త్రిగారు, ‘మల్లెను’ ‘తమఋతువు’ అను మాటచేత వాసంతముగానే ఘంటాఘోషముగఁ జెప్పినారు. నీరాద్ధాంతము ప్రకారము వారును తెలివిమాలిన వారేకదా! వారివ్రాఁతయు ‘నజ్ఞాన విలసితమే’గదా!! ఆయనగారుకూడ, ‘కవిత్వం కన్నగాఁడే’నా? ‘పాండిత్యం ఉన్నగాఁడే’నా? ‘మూర్ఖుఁడే’నా’? ‘మొండికట్టె’యేనా? పల్లెత్తిపలుకవోయి; పండితలోకము నీపలుకులువిన నభిలషించుచున్నది.

వసంతమున మల్లికలుపుష్పించు నని సంస్కృతాంధ్రకవు లెల్లరును ఎల్లగ్గుద్దిపలుకుచున్నారు; వానినే ప్రధానీకరించియు పలుకుచున్నారు. మల్లికలకు వసంతము సొంతఋతు వని ఆంధ్రమల్లినాథులు సిద్ధాంతముచేయుచున్నారు.

మఱి నీవాదము బ్రతుకేమి? నీ తలపోతలగతియేమి? ‘లక్ష్యంజగత్తు’ చక్కఁగా కానవచ్చినదా? కవిసమయమంటే యేమిటో బుద్ధికివచ్చినదా? నీ విమర్శప్రజ్ఞ యేపాటిదో యీపాటికైనను నీకెఱుకయైనదా? వసంతమున మల్లెల యునికి ప్రకృతిసిద్ధమో ప్రకృతివిరుద్ధమో అవగతమైనదా? అవలేప మంతరించినదా!

ఓయీ, లక్ష్యలక్షణపారగుండా!

‘పిచ్చయ్యకు లక్ష్యజ్ఞానములే’దని వ్రాసితివే ఆవ్రాఁత బుద్ధితక్కువ వ్రాఁత యని సిద్ధాంతమైనట్లేనా! శర్మగారు చేసిన ప్రశంస ‘బట్టుసేవ’కాక కేవల గుణకథన మని తేలినట్లేనా?

## మల్లికా వసంతుల దాంపత్యము.

ఇఁక నీ మఱియొక ఆక్షేపము మల్లికావసంతులకు దాంపత్యము వర్ణింపరాదని కదా? అదియును తెలివికి వెలియైనదే.

(17) కంకంటిపాపరాజకవి యేమన్నాఁడో విన్నావా?

సీ. "నవమల్లికా వసంత సమాగమంబున
జనియించు పులకలచా లనంగ
... ... ... ...
మీఱె సారెకు మధుపకిశోరకములు
కోరికలు చెందఁ గోరకవారకంబు."

అనఁగా, మొగ్గలమొత్తములు— మల్లికావసంతులు, అను నాయికానాయకులకు, నూతనసమాగమమునఁ బొడమిన పులకలవలె నున్నవఁట లక్ష్యజ్ఞానం 'పిచ్చయ్య' కే లేదో నీకే లేదో ఇప్పుడునీవారి నడుగుము. వారే తెలియఁజెప్పెదరు: మఱియొక్క మాట:—

కాళిదాసమహాకవి, మేఘకాలము శ్రావణ భాద్రపదములైయుండఁగా, ఆషాఢస్యప్రథమదివస,(నట్టనడియెండకాల) ముననేమేఘోదయమును (ముఖ్యముగానే) చెప్పి, ఆమేఘముతోనే కమ్మనికావ్యము సాగించినాఁడు. ఆకావ్యమునకు ఆమేఘమునే పేరుగాఁజేసినాఁడు. కళాదృష్టిగల లోకమాగ్రంథమును శిరసావహించినది. జినసేనుఁడు, భవభూతి, బిల్హణుఁడు మున్నగు నెన్నికగన్నకవు లారచనము ననుకరించిరి. మేఘసందేశ మొరవడిగా, ఉద్ధవసందేశము హంససందేశము మొదలగు కృతులెన్నియో వెలసినవి.

ఆ సందేశ మంతటిఘనకావ్యంబయినను నీధోరణిప్రకారము "కవులు ఒక్కొక్కరు ఆషాఢమును వర్షకు ముఖం అనడం మాత్రంతలంచిరిఅయినా,

వర్ష గ్రీష్మానికి అత్యనంతరం అదికాబట్టి అక్కడినుంచి కొంత ఇక్కడ. ఇక్కడిది కొంత అక్కడ ప్రవేశం అంత ప్రకృతివిరోధం కాదు, అనుగుణం కూడా నేమో అని అయినా, ఋతుమర్యాదను అంతగా పాటించే తలపుగొనక అయినా, మేఘమును ఆషాఢములో చెప్పినా. మేఘమును కృతికి పేరే చేసి........ చమత్కారములు చేయడం, అది ప్రాసంగికం గాకుండా ముఖ్యమే కావడం కేవలం అజ్ఞానవిలసితం. 'దేశకాలాదిపరిస్థితివ్యత్యయం' అనే దోషాలంబం." అను నీ యాక్షేపమున కర్థము కావలసినదేగదా?

నీవలెనే దూరదృష్టిలేని పండితుఁ డొకండు 'ప్రథమదివస' పాఠమునాక్షేపించి 'ప్రశమదివసే' యని దిద్దుటయు "అహో! మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అని మల్లినాథసూరి ఆ దిద్దుపాటును తిరస్కరించుటయు పండితులెల్లరు నెఱుఁగుదురు. మేఘదూత వ్యాఖ్యానమును చదువుకొనఁగలిగినచో నీవును నెఱిఁగికొనవచ్చును. పెక్కుమాటలేల?

కాళిదాసుని ఆషాఢమేఘమెట్టిదో నావసంతమల్లికయు నట్టిదే. కావున నీ యాక్షేపము దురాపేక్షము. దూరదృష్టిలేని మందుడును ప్రసంగము. పండిత పరిహాసపాత్రమైన నీయాక్షేపమును నీకుతోడుపోయినవారు మెచ్చుకొందురులే. దుఃఖపడకు.



## దినలక్ష్మి మొగము.

"తన్ను విడి చను ప్రియు మిత్రు నెన్ని గతులఁ
బిలుఁగు పులుఁగుల బన్నవాలి ముద్దుమోము
గంద విలపించు దినలక్ష్మి కలికి మొగము
చాయ లన నొప్ప, సంజ కెంజాయ లలమె"

అను పద్యంబున సాయంసంధ్యారాగము 'విలపించుదినలక్ష్మి మొగము చాయలుగా" నుత్ప్రేక్షింపఁబడినది.

" 'దినలక్ష్మి మొగము' అంటే ప్రాతఃకాలమనే అందఱికి అర్థం. మఱి యిక్కడ......సాయంకాలము, ప్రాతర్వేళ కాదు. మఱి యిదేమికవనా"!

అని యాచార్యుని ఆక్షేపము.

'దినముఖము' అనుపదమునకు ప్రాతఃకాలము, అను నర్థ మున్నమాట నిజమే కాని, పద్యమున నున్నది 'దినలక్ష్మిముఖము' కాని దినముఖము కాదు * దిన ముఖము వేఱు. దినలక్ష్మి మొగము వేఱు. పాపమా కర్థము ఆక్షేపకునికి తెలియలేదు. కావుననే అంత పొరపడ్డాఁడు. నేను దినముఖమున ప్రొద్దుగ్రుంకెనని గాని, సాయంసూర్యుఁడు దినముఖమునకుఁ దిలకాయమానుఁడై యున్నాఁ

---

* దినముఖము=దినప్రారంభము, అదే యుదయము. దినలక్ష్మి మొగము=దినము అను కాంతయొక్క ముఖము.

డనిగాని అనియున్నచో ఆతనియాక్షేపమునరియే. కాని, నే నట్లనియుండ లేదు. కావుననతనియాక్షేపము తప్పు. నేను దినముఖమును సాయంపర్యాయముగావాడిన ట్లాతఁ డనుకొనుట అజ్ఞానము.

దినలక్ష్మీముఖము, దినముఖలక్ష్మీ అను పదము లలోని భావభేద మంతు పట్టక తబ్బిబ్బై తప్పుదారినిబడ్డాఁడాచార్యుఁడు. ముఖశబ్దానికి ఆరంభము అనునర్థ మున్నట్లును, దినముఖము అను శబ్దానికి ప్రాతఃకాల మను నర్థమున్న ట్లును, తన యఖండపాండితీబలమునను, తన యమేయప్రతిభాప్రభావమునను కనిపెట్టి, ఆ 'అద్భుతకనిపెట్టడమును' బలపఱుచుటకు, సంస్కృతాంధ్రకవుల పాదముల నేగాక పాశ్చాత్యులపాదములను గూడ పట్టుకొని, ఒక 47 మందిని సాక్ష్యముకై పిల్చుకొనివచ్చినాఁడు. అదియంతయు పనికిమాలిన పరిశ్రమము. బత్తాదంపుగపని. కాదు కాదు. అజ్ఞలోకముచేత 'అబ్బో! మన ఆచార్లు సామాన్యుఁడు గాఁడు, పెనుఁబండితుండురా' యని పొగడించుకొనుటకుఁ జేసిన జిత్తు. కాకున్న దినముఖము ప్రాతఃకాల మని, రాత్రి ముఖము ప్రదోష మని, వసంతముఖము వసంతారంభ మని, నిర్ధారణసేయుటకుఁ బ్రయోగములువలయునా! పాఠకుల పుణ్యాన నెట్లో వదలినాఁడుగాని, లేకున్న సూర్యుఁడు తూర్పుననే యుదయించును, పడమట నేగ్రుంకును, అనుటకుఁ దాను జదివిన యనంతగ్రంథజాతమునుండి యసంఖ్యోదాహరణములు చూపియుండఁడా యీ పరప్రతారణపరాయణుఁడు? పంగుపద పారంగతుఁడు!

ముఖ, దినముఖ శబ్దములకు, ఆ యర్థములు లేవని నే ననియుండలేదు. ఆ శబ్దము లతనికి క్రొత్త లేమోకాని అక్షరాస్యుల కందఱికిని బ్రాతవే.

నేను ప్రాతఃకాలమునకు అహర్ముఖ మనియేవాడినాను. మచ్చరము కనులకుఁ గప్పుటచే నాతనికి గనఁబడలేదు కాఁబోలు. అతఁడు కన్నులను

గడుగుకొని అసూయాదృష్టితో నింకొక్కమాటు ఆ ప్రణయకుసుమమునే (37 పుట) చూచుకొని తెలిసికొనుఁగాక.
ప్రకృతమనుసరింతము.

"తన్ను విడి చను.........లలమే" అను పద్యములోనిపలుకులు: మల్లిక యను నాయికవి: మల్లిక తనప్రియుని నిజముగ వలచిన నిర్మలహృదయ. ఆమె హృదయము ప్రేమమయము. ఆమెదృష్టికి లోకములోని యెల్లపదార్థములును నాయికానాయకులే, ప్రపంచమంతయును ప్రేమమయమే. ప్రణయభంగ మామెకు ప్రళయము. అట్టి ప్రళయ మెప్పుడు వచ్చి తన్ను ముంచునో యన్న భయ మా ప్రణయైకహృదయ చిత్తమును మాటిమాటికిని కలఁచుచుండును. సంధ్యారాగమును జూచి నంతనే మల్లికకు గుండెజల్లు మన్నది. ఎందువలన ననఁగా అహా స్వోక నాయికగను సూర్యుఁడొక నాయకుఁడుగను, అతఁడా నాయికను విడనాడిపోవు చున్నట్లుగను, ఆమె యాతని వెంబడించి అపరదిక్కువఱకును బోయి, 'పోవలదు' పోవలదు'అని 'పులుఁగు లెలుఁగుల, ఱలిమాలినట్లును, తన ప్రార్థనము నిరర్థకముకాఁగా విలపించినట్లును, ఆ విలాపమున ఆమె ముద్దుమొగ మెఱ్ఱగా కందినట్లును, ఆమొగము చాయలచేతనే అప్పుడు సూర్యుఁడున్న పడమటిదిక్కు కెంజాయ నెనసినట్లును, ఆమెకు పొడకట్టినది. అందు తప్పేమి?

నీ దృష్టికి దినలక్ష్మి-తూరుపుకొనను మొగము పెట్టి, పడమటికొనను 'మఱియొక అవయవము' పెట్టి ఆదిగంతమునుండి యీ దిగంతమువఱకును కదలక పడియున్నట్టి ఒక పెద్ద రాతిబండ.

మల్లికదృష్టిలోనో, దినలక్ష్మియొక నాయిక; ప్రియుని ప్రేమింప నేర్చిన యిల్లాలు. అతని ననుగమింపఁజాలినప్రాణి. ప్రియుని వియోగమున దుఃఖించు మృదులహృదయ. వస్తువొక్కటియేయైనను వారివారిహృదయ సంస్కారములఁబట్టి భిన్నభిన్నరూపములఁ దోఁచుచుండును.

దినలక్ష్మి, పడమటిదిక్కొంతయిల్లుచేరిన, తన పతివంక నెఱ్ఱవాఱిన మొగముతోఁ బలకించినది. ఆమోముచాయ లాదిక్కునెల్ల నెఱుపుగావించి నవి. అదియే సంజ. ఉత్ప్రేక్ష అర్థమయినదా? ఆచార్యా!

ఒకయింతిమొగము చాయలకే, ఒకదిక్కెల్ల నెఱ్ఱవాఱునా? యని తమరు ఒకయెత్తు ఎత్తకమానరు. తమ కుశంకకు సమాధానము,

ఇదిగో,—

ఉ. ఎప్పుడు వచ్చెఁ గాంతుఁ డిటుచెప్పకఁ గ్రుంకె నటంచు నాత్మలో
నుప్పరిగొన్న రాగము సముత్కటమై కనుదోయి నిబ్బఁగాఁ
దొప్పఁగఁ దోఁగుమోడ్కి నపరామణి సారెకుఁ జూడఁగాఁ బలెన్
యిప్పాటుపొందె నీతఁ డన హేళి క్రమంబునఁ దాల్చె రక్తిమన్
—ప్రభావతీ ప్రద్యుమ్నము.

దినలక్ష్మిముఖ మెప్పటికిని తూర్పుననే యుండు ననుకొనుట అజ్ఞానము. దినలక్ష్మి నాయిక, సూర్యుఁడు నాయకుఁడు. సూర్యుఁడు తూర్పున నున్నవేళ దినలక్ష్మియుఁ దూర్పుననే యుండును. ఇనుఁడు పడమటికిఁ జేరినప్పుడు అనపాయిని యగు దినలక్ష్మియుఁ బడమటికి వచ్చును. ప్రియుఁడు పడమటిదిక్కున పడియుండఁగా, ప్రియురాలు ప్రియునివంక పృష్ఠావయవము పెట్టి యుండు ననుకొనుట తెలివిచాలమి. దినలక్ష్మి సూర్యునితోనే బయలువెడలి యతనిననుగమించు నిల్లాలు. కావున అస్తమయమునను ఆ దినలక్ష్మిమొగము పడమటిదిక్కున నుండక తప్పదు.

ఈవిషయమున 'పట్టియెండుకట్టెయలు' గాక ఊహయుఁ బ్రతిభయుఁ గల మహాకవులవాక్కులు కొన్ని వినిపెదను. వినుమా!

(1) 'కోకతతుల్ వియోగహతిఁ గూయఁదొడంగ దివిన్ సుధాంశుమేల్
రాక మదిన్ దలంచి దినలక్ష్మి వడిం దనకేని హేళి ను

'గ్రాక్కృపవిహీను నుష్ణకరుఁ బెంచు సహింపక యేటఁద్రోచెనం
చాపలవృత్తి విష్ణుపది పంకజ మొగిన్ వెఱవేర్పఱచెన్.'

— రసికజనమనోభిరామము.

ఇందు కవి 'దినలక్ష్మి'ని దుశ్శీలఁగా వర్ణించుచున్నాఁడు. 'నిరంకుశాః కవయః' గదా.

చల్లనివాఁడైన చంద్రుని మీఁది అభిలాషచేత, దినలక్ష్మి తనపతియైన ఉష్ణకిరణుని సంద్రమునఁద్రోచెనఁట! అగ్గిత్రోయువేళ ఆ కాంత యెటనుండునో, మొగమే వంకనుండునో ఊహించుకొనుము.

(2) మ. దినలక్ష్మీజనకాత్మజాపహరణోద్వేలస్థితిన్ బొల్చిన
స్తనగంధ్రక్షణదాచరేశ్వరుని భాస్వన్మౌళిబృందంబు నా
తనతారావరకాలకీలపటుయాథార్థ్యంబుచే నుల్లసన్
గినుకం బస్వత దక్షిణాగముల మార్కొన్ మించెసంధ్యారుచుల్

— చంద్రభానుచరిత్ర

ఈ పద్యమున దినలక్ష్మి యను సీతను పడమటికొండ యను రావణుఁడపహరించినట్లు, ఉత్ప్రేక్షింపఁబడినది ఈ పద్యములోని 'దినలక్ష్మీజనకాత్మజ' మొగ మేఱక్కసనున్నదో నీకేమైన గోచరించుచున్నదా?—

తూర్పున నున్న దినలక్ష్మి నెత్తికొనిపోవుటకు పడమటికొండయే పాఱిదికి నడచివచ్చినదని యందువా? అనవోయ్. అను. కళాదృష్టి లేని ధృతరాష్ట్రుఁడవు. నీ వేమన్నను అనవచ్చును.

(3) సీ. ఇనుని వెంబడి నేఁగు దినలక్ష్మి యిడుకొన్న
మేలిమి జాళువా మేలిముసుఁగొ

... ... ... యు.

నంగఁ గనుపట్టె నపుడు సంధ్యావిభూతి.
—చంద్రాంగదచరిత్ర.

సంధ్యారాగము, సూర్యునివెంటఁ బోవుచున్న దినలక్ష్మి మేలిముసుఁగువలె నున్నదఁట. దినలక్ష్మి నీవనుకొన్నట్లు ఒకరాతిబొమ్మయో, లేకసప్రాణమగు వ్యక్తియో, యిప్పటికైనఁ దెలియుచున్నదా? దినలక్ష్మి మొగము సాయంకాలమున, పడమటిదిక్కున, కన్నట్లు నేను చెప్పుట తప్పంటివి. ఇప్పు డేమనెదవు? మేలిముసుఁగు ముఖముకేగాని మఱియొకఅవయవానికి వేసికొనరుగదా! కాక నీసరస్వతీశాస్త్రమున ఆచారములు భిన్నములా; నాగరకుఁ డఁట! నవ్వులచేటు.

(4) మాఘుకవి, పరిణతదివసమును ముదుసలినిగా వర్ణించి, చావువలన ఆవృద్ధుఁడు తేలవేసిన కన్నుగా వర్ణించినాఁడు అస్తమానసూర్యుని. సూర్యుఁడు కన్నైన, కన్నుసాయంవేళ తూర్పున నుండునో పడమర నుండునో, ఊహ కందుచున్నదా! కన్నుపడమట నున్నను, ముఖముతూర్పుననే యుండవలెనందువా?

ఓహో య్ విమర్శకుఁడా, చూచితివా! ఒకచో దినలక్ష్మి నాయికయనియు సూర్యుఁడు నాయకుఁడనియు వర్ణింపఁగావేఱొకచో- దివసము వృద్ధుఁడు (మగవాఁడు) అనియు సూర్యుఁడు, అతని కన్ననియు ధ్వనింపఁజేయుచున్నారు- కవులపోకడల జాడ లిప్పటికైనను గోచరించుచున్నవా? లేక. నీ మనస్సునకునచ్చునట్లే, వారందఱు వర్ణింపవలయు ననియందువా?

మాఘునిశ్లోకము కావలెనా? ఇదిగో,

శ్లో. విరళా దపచ్ఛవి రనుష్ణవపుః
పరితో విపాండు దధ దభ్రశిరః

ఆభవద్గతిః పరిణతిం శిథిలః
పరిమంద సూర్యనయనో దివసః.

శ్లోక మర్థము తెలియకున్న, గోపినాథుని యీ తెలిఁగింపు చదువుకో.

చ. పరిణతి నొందినందున విభాపరిహీనప్రకాశయుక్తమై
స్ఫురితవిపాండురాభ్రశిరముఁగా వహించి యనుష్ణగాత్రమై
మఱియు ననాతపంబగుట మందదివాకరబింబనేత్రమై
యరుదుగ నత్తఱిన్ శిథిలమై కననయ్యె దినంబు
చూడఁగాన్ ॥

(5) శ్లో. దివసో౽నుమిత్ర మగమ ద్విలయం
కి మిహాస్య తే బత మయా౽బలయా
రుచిభర్తు రస్య విరహాధ్వగమా
దితి సంధ్యయా౽పి సపది వ్యగమి.

తే. అకట మిత్త్రునితోఁ గూడ సరిగ దివస
మేను మిక్కిలి నబల నిం కెటుల నుందు
ననుచు రవివిరహంబున నతనితోడఁ
జనిగొ నట్లనవెంటనే చనియె సంధ్య.

(గోపీనాథవేంకటకవి.)

ఇటు చూడు. ఆ మాఘుఁడే మరల నే మను చున్నాఁడో. దివసము మిత్త్రునితోఁగూడ విలయమందినదఁట. అనఁగా సూర్యాస్తమయముతో దినాంతమైనదఁట. అది చూచి, సంధ్యయు, సూర్యవిరహముచే వేగముగా తొలఁగిపోయిన దఁట. సూర్యుఁడే దిక్కున నస్తమించునో, అచటనే-దివసవిలయమును. అది పడమటి దిక్కు కాక మఱియేది?

లేక నీ యపారపాండిత్యబలముచే, అమేయప్రతిభాసంపత్తిచే సూర్యుఁడు తూర్పుననే అస్తమించు నని నిరూపింతువా? కానిమ్ము. ఆ ప్రభావ

మును కనుగొందము. నీవును విపర్యస్తుఁడవ వనుకొను వారును కొందఱు కలరు గదా!

కవులు దినము నొకకాంతగనే కాదు. ఏనుఁగుగా, దున్నపోతుగా కోడిపుంజుగా, నెన్నెన్ని తెఱఁగులనో యెవరి యిచ్చ వచ్చినట్లు వారు వర్ణించి యున్నారు. ఏమిగా వర్ణించినను సాయంకాలమునకు దినమును పడమటిదిక్కునకే చేర్చినారు,

## ఏనుఁగు

(6) గీ. సమయ సింహంబు దివసగజంబు ద్రవ్వఁ
దొరఁగు నెత్తురు కరణి సాంధ్యరుచి తనర
నందు రాలిన కుంభముక్తాంకురముల
తెఱఁగు దలకొల్పె నూతనతారకములు.

కాలమను సింహము దినమను గజము యొక్క కుంభస్థలమును వ్రచ్చుటచేఁ జిందిన రక్తముగా నుత్ప్రేక్షించినాఁడు, సాయంసంధ్యారాగమును హరిభట్టు నారసింహపురాణమున. ఆచార్యా, కరికుంభములు, ముఖభాగమున నుండునో తదితరభాగమున నుండునో! 'చెప్పాస్త్ర' అని నీ తోడివారు వేయుదుగము.

## దున్నపోతు

(7) మహాకవి సుబంధుఁడు:—వాసవదత్తలో,
"కాలకరవాళ సంఛిన్న వాసరమహిష స్కంధ చక్రికాః."
అన్నాఁడు.
దానికే వక్కలంక వీరభద్రకవి తెనిఁగింపు,

గీ. కాల కరవాల విదళిత ఘస్ర మహిష
రుధిర ధారాప్రవాహ సంయోగ నలరె

నినుఁడు చరమాంబునిధి గ్రుంకు వెనుక వెనుక
నంబు మీఁఱఁగ సాంధ్యరాగంబు పెఱసె.

ఉగ్ర మయినదా ఆచారీ? 'మన్నపోతయినా' తెలివిగా సాయంసమయమునను పడమటికే చేరినది గదోయీ!

## కోడిపుంజు

(8) ఆ సుబంధుమహాకవియే ఆ వాసవదత్తలోనే-
"వాసర తామ్రచూడ చూడా చక్రికారః"

అన్నాఁడు—

ఆ వక్కలంక వీరభద్రునిదే తెనుఁగు-

సీ. 'జరఠసంగ విసర వాసర తామ్ర చూడ చూ
డాచక్ర లోహిత రోచి యనఁగ.

సాయంసమయపు సూర్యుఁ డెలరె'—నన్నాఁడు.

అనఁగా సాయంసూర్యుఁడు వాసర మను కోడిపుంజు నెత్తిమీఁది గొజ్జుని బొట్టువలె నున్నాఁడని గదా యర్థము! ఇప్పుడు పడమటి దిక్కు వంక కొక్కమాటు కన్నులు కడుగుకొని చూడు. ఆ కానవచ్చునది కోడిపుంజు తలో-మొలో-గమనించు.

ఓయి కొత్తరకపు విమర్శకా,

మఱి యీ కవు లందఱును మొగాన్ని 'మఱొక యవయవముగాఁ జెప్పిన మూర్ఖులే'నా! 'మొండికట్టెలే'నా? 'కవిత్వం కన్నగాండ్రే'నా? 'పాండిత్యం సున్నగాండ్రే'నా: చెప్పవేమోయ్ ఊరక గుఱ్ఱిక్కిళ్లు ద్రింగితే యెలా మఱి? చెప్పు.

దినలక్ష్మి సూర్యునితోఁ గూడ వచ్చి అతనితోనే ప్రయాణము చేసి సాయంసమయమునకు సూర్యునితో పాటు తానును అపర దిక్కునకుఁ జేరును. అతని తోడనే యస్తమించును ఇది, కవిహృదయము. ఇదిగో యీ శ్లోకమును గూడ వినుము.

(9) ఆయాన్త్యా దివసశ్రియః పదతల స్పర్శానుభావాదివ
వ్యోమాశోకతరో ర్నవీనకలికాగుచ్ఛ స్సముజ్జృంభితః
అత్యన్త న్నవతంసవిభ్రమ మసౌ వాశాకురంగీదృశా
మస్మిల్లత్తరుణ ప్రభాకరకరస్తోమ స్సముద్భాసతే.''

ఈ పద్యము జయదేవుని ప్రసన్నరాఘవ నాటకము లోనిది సుమా! అల్లాటప్పాకవులది కాదు. ఆ జయదేవుఁడు ''వచ్చుచున్న దినలక్ష్మి పాద స్పర్శచేత ఆకాశ మను నశోకమునఁ బొడమిన చివుళ్ల మొత్తము వలె సూర్య కిరణజాలము లన్నిదిక్కుల నలంకరించినవి'' అన్నాఁడు—వచ్చుచున్న దినలక్ష్మి'—అనుటచేత దినలక్ష్మికి వచ్చుటయు, పోవుటయు, కలదని తేలు చున్నది గదా? మఱి నీవు దినలక్ష్మి తూర్పున మొగము పెట్టి పడమట మఱి యొక అవయవమును పెట్టి పడియుండు బండబొమ్మ యంటివే నీ కేమైన కావ్యజ్ఞానము కాని కవులపోకడలు గ్రహింపఁగల తెలివి గాని కలదో మా వారినే యడిగి తెలిసికో.

ఇంతయేల! మహారాజును మహాకవియు నైన శ్రీహర్షునిచేత చెప్పింతునా దినలక్ష్మి సూర్యులకుఁ గల సంబంధ మెట్టిదో? ఆయన తన ప్రియదర్శికలోఁ జెప్పుచున్నాఁడు గదా:—

దినలక్ష్మి సూర్యునికి నాయికయఁట; సాయంసమయము నందు తన నాయిక రొండసి పోఁగా నుత్కృట మైన రాగము నెనయు చున్నాడంట

ఇవిగో, అకవిపలుకులు.—

(10) రాజా.-(విలోక్య) అయే పరిణత ప్రాయో దివసః. సంప్రతిహి

శ్లో. హృత్వా పద్మవనద్యుతిం ప్రియతమే వేయం దినశ్రీ ర్గతా
రాగో స్మిన్మమచేతసీవ సవితు ర్బింబేధికం లక్ష్యతే
చక్రాహ్వో హ మివ స్థితః సహచరీం ధ్యాయ న్నళిన్యాస్తటే
సంజాతా స్సహసా మమేవ భువన స్యాప్యంధకారా దిశః

వే. వేం. శాస్త్రిగారి తెనుఁగు

రాజు. (చూఁచి) అహో పగటికి ముదిమి ముసరుచున్నది కావున నిప్పుడు.—

చ. కమల వనంపు శోభగొని కొంత వలెఁ దినలక్ష్మి యేఁగె, రా
గము రవిమండలిఁ ఘనముగాఁ గననయ్యెడి, నా యెదఁ బలెఁ
గమలిని చెంత నావలెనె కొంతఁ దలంచుచుఁ గోక ముండెడిఁ
సమకొనె నాకుఁ బోలె దివసంబున కంతట నంధకారముల్.

(దివసంబున కనుట పొరపాటు. భువనంబున కనవలెను. పొరపాటెంత వారి కైన నుండును గదా!)

అర్థమైన దటోయీ ఆచారీ? మఱే, నాపద్యమే యర్థము చేసికొనలేక యింతటి యనర్థమునకు భాజనమ వైన నీ తెలివికి వేంకటరామశాస్త్రి గారి పద్య మర్థ మవునా! నినువంటి వారిని తలంచియే కాఁబోలు, అమహాను భావుఁడు—

"వేంకటరాయశాస్త్రి కృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే"
అని యన్నది. సరే దాని కేమి. ఇంతవఱకును తనతో నున్న ఆరణ్యక తన్ను వదలి పోయి నట్లే దినలక్ష్మి సూర్యుని వదలి పోయినదన్నాఁడు వత్సరాజు, ఆరణ్యకా వత్సరాజు లెట్టి నాయికానాయకులో

దినలక్ష్మి సూర్యులనట్టి నాయికా నాయకులే యనియు. సూర్యుని దిగనాడి చను వేళకు దినలక్ష్మి పడమటనే యుండవలయు ననియు నీ కిప్పటి కైన నర్థ మగు చున్నదా!-

నీవు వే జెవ్వరి కావ్యములు చదువ లేదు. శ్రీ శాస్త్రులవారి గ్రంథముల నైనను చదివి యుండరాదా! చదివే యుందువు; కాని "లోచ నాభ్యాం విహీనస్య దర్పణేన చ కిం ఫలమ్"

విపరీతవిమర్శ కుండా!

దినలక్ష్మికి తూర్పు ముఖ మనియు, పడమర వఱి యొకటి యనియు నందువు గదా- దినలక్ష్మి మొగము తూర్పున మన కభిముఖముగా నున్న ప్పుడు, దాని మఱియొక అవయవము (నీవనుకొన్నది) మొగమున కవ్వలి వైపు అనఁగా, వెనుక భాగమున నుండును గాని పడమటివైపు అనఁగా ముందరి కెట్లు వచ్చునోయీ! బాగుగా చూచి చూచుకొని చెప్పు.

సాయంసమయపు దినలక్ష్మి మొగమును అవయవాంతరముగా నను కొని అధిక ప్రసంగము చేయుట అవివేక మని యిప్పటికైనను మనసునకు వచ్చినదా? మఱి విను నీ మాటలు నీకే అప్పగించెదను.

"పండితుఁడు కాని విమర్శకుఁడుంబడు గాని, శబ్దదోషాలు అర్థ దోషాలు తలకు ఒక్క సుతంగా పెనగదగిసవి యొట్లయినా సొగాన్ని అవయవాంతరంగా భావించే మూర్ఖుఁడు విమర్శకుఁ డౌతాఁ డటోయీ! సాయంకాలపు దినలక్ష్మి ముఖము మఱియొక అవయవము గా తోచునా! ఇది దొంగతనం గాని విమర్శయగునా! తోచని దానిని యున్నదని దానిని తోచినట్టుగాను యెఱిగినట్టుగాను చెప్పడం! ఆర్ల్ల మహానుభావు డేమ న్నాడు. Sympathy. sincerity, honesty అను వాని తెనుగుతెం

-చి విమర్శకునికి యివి వుండవలెనట. వీటి వునికి కొలదీ వాడు విమర్శకుఁడు అదివిమర్శ అవుతుంది. అవి తగ్గే కొలదీ వాఁడు విమర్శకుఁడు కాకనూ అది విమర్శ కాకనూ పోతుంది. అవి మఱీ మొగాన్ని అవయవాంతరంగా చెప్పేటంతకు వస్తే ఆ 'అసంబద్ధప్రలపితం' 'పిచ్చికూత' అయిన దానికి విమర్శ నామం పెట్ట చూడడంచేత అదిదొంగతనం. ఏ ప్రాయశ్చిత్తమూ లేనిది అవుతుంది. అంతే కాదు ఉత్తమకావ్యమున తెలివితక్కువగా దోష కల్పనము చేయఁ బూనుట చేత ఆ విద్యార్థులకున్నూ - నిప్పు తెలిసితాకినా తెలియకుండా తాకినా కాల్చేదే- అనే న్యాయంచేత మహాద్రోహం అనిన్ని ఆలాగు ఆలాగు ఆత్మను కాల్చే మహాపాతకం అనిన్ని నిర్ణయం అయిందిగదా!'' చాలునా? నీప్రలాపాలన్నీ నీకుముట్టినట్లేనా?

## B

నా పద్యము లోని, మొగమునకు మొగ మనియే యర్థము. ఆరంభ మని కాదు. ముఖశబ్దమునకు ఆరంభమని యు నర్థము కలదు. అంతమాత్రాన, ఆ శబ్ద మెక్కడ కనఁబడినను ఆరంభ మనియే అర్థము చెప్పికొనుట యవివేకము: అనగా జ్ఞానము లేమి. ప్రకరణము నెఱిఁగి పదమున కర్థమును చెప్పికొన వలయును. అదియే నేర్పు. ఆ నేర్పునకే పాండిత్యమని పేరు. ఆపాండిత్యము లేని వాని పనువు హాస్యభాజనము.- సభవారు నినువంటి యొక పండితునితో - 'స్వామీ, ఆ యాసనము నలంకరింపుడు'-అనఁగా నాతఁడు అందుపాటులో నున్న గందపుగిన్నె నందుకొని కుర్చీకి పులిమె నఁట. 'అయ్యో అది యేమి పని స్వామీ' యని సభ్యు లనఁగా ఆ స్వామి 'గంధము పూయుట అలంకరించుట కాదా? కాదందు రేని నిఘంటువులతో సిద్ధాంతము చేయుదును' అని వాదమునకు, దిగె నఁట. నా పద్యములోని దినలక్ష్మి మొగమునకు దినప్రారంభ మని నీవు వ్యాఖ్యానము చేయుటయు నట్టిదే.

కావున నీ యాక్షేపము తప్పు. పట్టి ఆకొండతాండవము. అస్థాన

సంరంభము. అక్కఱ లేని 'యార్భాటము.'

## ముఖము- ప్రారంభము

అపూర్వ శబ్దార్థవిత్తా!

"స్త్రీ(లక్ష్మి) వాచకం మహిమ చేత ఆ 'ముఖ' శబ్దానికి మొగము (=వదనము) న్నూ స్వరసంగా అర్థమే. ఈ లాంటియోగాలలో- 'ముఖానికి' తొలిభాగం- ప్రారంభం అనేఅర్థంలేకుండా కేవలం వదనం అన్న అర్థమే వుండడం అసంబద్ధ ప్రలాపంవలె అవుతుంది!"-

అని అంటివిగదా! మఱి, కాళిదాసమహాకవి రఘువంశమున:— *సముద్రుఁడు (నాయకుఁడు) నదీకాంతల ముఖములను చుంబించినట్లు చెప్పినాఁడే. అచ్చట ముఖశబ్దమునకు ప్రారంభ మనేనా యర్థము? నదికి ప్రారంభమేది? జన్మస్థానమా? సాగర సంగమస్థానమా; సంగమస్థానము విలయస్థాన మని పెద్ద లందురు.

నీ మతము ప్రకారము సముద్రుఁడు చుంబించు భాగములు నదీకాంతల మఱియొక యవయవము లగునే గాని ముఖములు కాఁజాలవే, యేమి చెప్పెదవు? ముఖశబ్దమునకు సందర్భోచితముగా అర్థమును చెప్పుటకో వలయును- అని యెప్పుడో; విధియా! కర్మమా!

ఆ మహాకవి కాళిదాసే ఆ రఘువంశముననే "స్త్రీవాచకంమహిమ" లేకుండనే ముఖశబ్దమును వాడి నాఁడు చూడు

---

* "ముఖార్పణేషు ప్రకృతిప్రగల్భాః
స్వయం తరంగాధరదానదక్షః
అనన్యసామాన్యకళత్రవృత్తిః
పిబత్యసౌ పాయయతే చ సింధూః.

"లిపే ర్యథా వద్గ్రహణేవ వాఙ్మయం
నదీముఖే నేవ సముద్ర మావిశత్"

అనఁగా నదీముఖమున సముద్రమునుప్రవేశించి నట్లు, రఘువులిపిగ్రహణము మూలమున వాఙ్మయమును ప్రవేశించెను- అనియర్థము.

ఇక్కడ ముఖశబ్దమున కర్థ మే మని చెప్పెదవు? ప్రారంభ మనియే చెప్పెదవా? లేక నది సముద్రములో కలియు చోటును నదీముఖ మన్నారు కావున నదీప్రారంభస్థానమును నదికి మఱియొక యవయవమని యందువా?

ఓ శబ్దతత్త్వము నెఱుఁగని తిట్టుఁబోతు విమర్శకుండా, పది గ్రంథములు చదువుకో. పదుగురు కవులను సేవించుకో. పదముల యర్థములను భావములను ప్రయోగపద్ధతులను బాగుగా నేర్చుకో. ఊరక తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానముతో పండితులను కవులను పడఁదిట్టు పనిమానుకో. అది మంచిది కాదు. కవులను దిట్టి కడలేని యప్రతిష్ఠలో బ్రుంగిన ఘనుల కథలు వినుచున్నావు గదా!

C

ఓయీ తలక్రిందు విమర్శకుఁడా, నీ కొక ప్రశ్న:—

దినలక్ష్మికి 'ప్రాతస్సు' (తూర్పు) ముఖము; ప్రదోషము (పడమర) అవయవాంతరము అనికదా నీ సిద్ధాంతము! అట్లే రజనికి ప్రదోషము (పడమర) ముఖముగదా నీ మతమున!— నీమాటయటుండ-

(1) మహాకవిబాణుఁడు- సాయంసంధ్యారాగమును నిశావిలాసినీ ముఖావతంస పల్లవముగా, వర్ణించియుండుటచేతను,

(2) ఆంధ్రకవితా పితామహుని

"తరణి యిదె క్రుంకఁ జూచున్నాఁ

(1) శనైఃశనైశ్చ నిశావిలాసినీ ముఖావతంస పల్లవే గళితే సంధ్యారాగే' —కాదంబరి.

పరుద పశ్మని సంధ్యాం బిల్వ సరిగెడు రజనీ
తరుణీమణి దూతిక లన
సరిగెక దూర్పునకు నీడ లతిదీర్ఘములై.”

అన్న పద్యమున రజని యునికి పడమటి వైపుననే యని నిర్ణయమై యుండుట చేతను, మఱియు నిట్టివియే యగు పెక్కు వర్ణనముల చేతను గూడ- సాయంసంధ్యారాగ ముండుదిక్కు- అనఁగా పశ్చిమమే నిశాముఖము అని తెలుచున్నది గదా? పడమటి దిక్కు- ముఖ మైనప్పుడు తూరుపు దిక్కు- మ ఱి యొ క యవయవము . కాక తప్పదు కదా నీ సిద్ధాంతము ప్రకారము.—

(A) మఱి కాళిదాస మహాకవి “కుమారం.” లో తూర్పున నుద యించు చున్న నిండుచందురుని వర్ణించుచు- చంద్రుఁడు (రసికుడు) వ్రేళ్ళతో కురుల మొత్తాన్ని దువ్వి దిద్ది నట్లుగా కిరణాలతో చీకటిని తొలగఁ జోపి మూతలు పడు పద్మాలఁ అనే కన్నులు గల నిశాముఖాన్ని ముద్దు పెట్టుకొం టున్నాఁడు- అనెనే దాని కే మందువు?

తూరుపు నిశాకాంతకు మఱియొక యవయవమగునే గాని ముఖము కాదు గదా? అట్టిచోట కురుల మొత్త మేమి! వానిని దిద్దుట యేమి! దానిని ముద్దు గొనుట యేమి! సమర్థించవోయ్, సమర్థించు. ఇది మఱియొక యవయ వాన్ని మొగముగా చెప్పుటే కావున కాళిదాసు కూడ “మూర్ఖుఁడే, మొండి కట్టెయే”- అందువా? అను నీ యిష్టము.

ఓహోయ్. నిశకు తూర్పు పడమరలు రెండును ముఖము లేనా? అది యేమి రెండుతలల శిఖండియా కాదు గదా! కా కున్నచో సాయం

---

(A) అంగుళీభి రి వ కేశసంచయం సన్నియమ్య తిమిరం మరీచిభిః
కుట్మలీకృత సరోజ లోచనం చుంబ తీవ రజనీముఖం శశీ.

సంధ్యను నిశావిలాసినీ ముఖావతంస పల్లవముగా వర్ణించిన ఆబాణుఁడే- కవితా కామినికి పంచబాణుఁడే,

(b) చంద్ర దర్శనము వల్ల ఎల నవ్వు నవ్వుతూ ఉన్న దాని యొక్క దశనాల కాంతి అనే టట్లుగా వెన్నెల మెల్ల మెల్లఁగా వెలువడుతూ నిశకు మొగమందు (ప్రారంభమందు) కాంతి గొల్పు తుంది- అన్నాఁడే! నీవే మందువు?

నీ మతమును, బట్టియు, ఇంతకు ముందటి తన వర్ణనమును బట్టియు రజనికి మఱియొక అవయవ మైన తూరుపు దెసను, తానే మఱల రజనికి ముఖము చేసి అందు దంతము లమర్చి, వాని కాంతులను వెలయించుట వింత కదా! వింత యేమి? విపరీతమే కాదా! బాణుఁడు కూడా మూర్ఖుఁడే కదోయీ నాగర కుండా! 'మొండి కట్టె'యే కదోయీ! ఘనుండా!

ఓ కవితాపరిశీలన మార్గ మెఱుఁగని మొఱకు రంధ్రాన్వేషీ, యిట్లు విమర్శించుచో నీవు ఉదాహరించిన చంద్రోదయము లన్నియు రజని ముఖముఁ గాక మఱియొక యవయవమునఁ బ్రవర్తిల్లి నట్లు తేలి ఆ కవన మంతయు హాస్యపాత్రమై ఆ కవులప్రతిష్ఠ యంతయు నధ్వాన్నమయి పోవుట నిక్కము. "మొగాన్ని......గాను చెప్పె మూర్ఖుఁడు కవి అవుతాడా"- అని యజ్ఞానమున నీవు నన్ను గూర్చి వ్రాసిన వ్రాఁత- ఆనందవర్ధన భట్టబాణ విశ్వనాథకవిరాజ హర్షదేవ మాఘ భారవి భాస వ్యాస ప్రముఖ సమస్త ప్రశస్త సంస్కృత కవులకును, వాగనుశాసన కవిబ్రహ్మ కవిసార్వభౌమాంధ్రకవితాపితామహాదిసకలాంధ్రకవులకును తాఁకి, వా రందఱును మూర్ఖులే గాని కవులు గారు- అని మిక్కిలి మొక్కలపు తీర్పును చెప్పు చున్నది.

---

(b) శనైశ్శనై శ్చంద్రదర్శనా న్మందస్మితాయా దశనప్రభేవ జ్యోత్స్నానిష్పతంతీ నిశాయా ముఖశోభ మకరోత్

ఇట్టి సాహసపు వ్రాఁతలు ఆయువును శ్రీయును గోరు వారు వ్రాయఁదగినవి కావు. అనిమిత్త మహా త్పరివాదశీలుని సాధులోకముగర్హించునే గాని మన్నింపదు.

అహర్ముఖము రజనీముఖము అను పదములంబట్టి దివారాత్రములకు మొగములను, ఇతరావయవంబులను కల్పించుట తెలివిమాలినపని. కవి భావము నెఱుఁగక కావ్యమును కంగాళు చేసి కవిని తెగడదిట్టుటయునట్టి పనియే.

---

# IV

## రసాభాసము.

"చుట్టుపట్టుల చెట్టుల కట్టె ప్రాఁకి
లీల మెయి నల్లె నల్ల నల్లీమతల్లి
చూచితిరె? యను సఖి కను నా చతురుఁడు
'అవు లతాతన్వ్యలవిధంబు లట్లకాదె"?

అను పద్యమున నాయికకు బహునాయకాసక్తి చెప్పఁబడిన దనియు 'అందువలన రసాభాస'మనియు- ఆక్షేపము.

'నాగరకాచార్యు'లవారు- 'రసాభాస' మన్నమాటవిన్నవారే గాని కావ్యప్రపంచమున దాని వినియోగ మెట్టిదో కన్నవారు కారు.

గుడ్డియెద్దు జొన్నలోఁ బడ్డట్లు చదువువారికి కావ్యగుణము కనుపింపదు. అసూయాదూషితదృక్కులకు సత్యము గోచరింపదు. నిందైకరతులకు నిజముతో పనియుండదు.

"నాయిక (మల్లిక) పలువురు నాయకుల యందు రతిచెందదనం" ను పద్యము చెప్పుటలేదు. కావున ఆక్షేపముతప్పు. వసంతుని వాక్యాలయం దట్టిస్ఫురణము లేదా? యన్న నుండునుగాక. ఆ వాక్యా లతని ధార్ష్ట్య మునకో, శాఠ్యమునకో, తార్కాణము లగునేగాని మల్లికాశీలమును మలి నీకరింప సమర్థములగునా?

అతఁడైన నట్లనవచ్చునా? యన్న- 'భేషుగ్గా' అనవచ్చును. ఎందువలన ననఁగా ఆ యనుటలోను, సరసభావమేగాని విరసభావములేదు కావుననే. ఓహోయి, వసంతుఁ డెట్టివాఁడనఁగా;— కావ్యగుణపరిశీలనము కావించు వేళ, సరసచ్ఛలోక్తులతో కవిని కదలించిచూచు సువిమర్శకునివంటివాఁడు. అంతేగాని, విమర్శనెపమున కవిని (నీవలె) తెగఁడిట్టు మొఱటువిమర్శకుని వంటివాఁడు కాఁడు.

మఱియు, కావ్యమును వ్యాఖ్యానించువేళ, ప్రయోజనచమత్కార ములను వెలయించుతలంపున (కవిహృదయమునుగమనించుచు) పదము నొరసిచూచు సుకుమారవ్యాఖ్యాతవంటివాఁడు. కాని, పదప్రయోజన మని, ఆదేపనిగా, పదపదమును బట్టి పాలార్చు బండపండితునివంటివాఁడు కాఁడు. అర్థమగుచున్నదా? భావముపట్టుచున్నదా? నీవు కవియుద్దేశము నెఱుఁగనే రక, నీ ముక్కుకు సూటిగాఁజూచుకొని కవిని తప్పుపట్టి తిట్టిన నేమిప్రయో జనము? విమర్శకునికి మంచిలోకజ్ఞాన ముండవలెను. కవిహృదయమునుకని పెట్టఁజాలిన సునిశితప్రతిభ యుండవలెను.

లోకమునఁ గొందఱు పసిబిడ్డల నూరక గిల్లి, గిచ్చి, యేడిపించి, పిమ్మట బుజ్జగించి ముద్దులాడుదురు. అది వారికిముచ్చట. వసంతుఁ డాతర గతికిఁజేరినవాఁడు. కానిమాటలాడి కనలించి (కుపితయైన) తనప్రియురాలి యనుభావములమార్పు లరసి, మురిసికొనుటయు, మరల వెనువెంట నేవల పు మెలపులతో నామె ననునయించి, ప్రసన్నురాలినిజేసికొనుటయు నాతని

లోక వినోదము. అదియే యాతనికి బ్రహ్మానందము. కావుననే, తొలుత 'అతాతన్వ్యలవిధంబు లట్లకాదె' అని మల్లికమనసు నొగిలించినాఁడు. తన విరసపుఁబలుకు 'ములికి' వలె మదికి సోఁకుటచేత ఆమె మొగమును చిన్న పుచ్చుకొన్నసడి కనిపెట్టి, వెంటనే

తమ్మిఁ జిలకించి దాని పాదమ్ములరసి
కలువ నీక్షించి దాని కన్నులనుజూచి
ప్రసవగుచ్ఛము గని దాని వక్షమరసి

చల్లఁగా మనసును మరలించి, అలరించినాఁడు. అట్టి యలరింపునఁ గల ఆనంద మెట్టిదో, 'అనుభవరసికోవిజానాతి.' అది 'అనౌచిత్యప్రవృత్తౌ ఆభాసోరసభావయోః'—అని శ్లోకముల నూరక వల్లెవేసికొను శుష్కహృదయుల కవగతమగునదిగాదు. చూడు,

(1) శ్రీరామునివంటి ఉత్తమనాయకుఁడు తన ప్రియురాలికి కోపము గలిగించి, ఆ కోపమును దీర్చుటకుఁ బాదములంబడి, మన్నింపు మని బతిమాలుకొనెడి వాఁడఁట. చదువుకొనవోయి నిర్వచనోత్తరరామాయణము.

మ. ప్రణయకోపధముఁ దాన యొక్కమెయి సంపాదించుఁ, బాదాంబుజ
ప్రణతిన్ గ్రమ్మఱఁదీర్చు, నేర్చి ధరణీపాలుండు సాకూతభా
షణముల్ వీనులనించు మన్మథకళాస్వాతంత్ర్య మానందపూ
రణ మార్గంబునఁ జెల్లనిచ్చు రమణీరాగాబ్ధిపూర్ణేందుఁడై.

"ఆఁడదాని కాళ్లమీఁదఁబడే అవివేకి-రాముఁడొక నాయకుఁడా? అట్లు కవిత్వముఁజెప్పిన తిక్కన్న 'తిక్కన్న' యేగాని ఒక పెద్ద కవియా? అది 'తక్కుమాత'యేగాని కవనమా? అని యాక్షేపించు వివేకశూన్యునకు బదులుచెప్పుట వృథా ప్రయాసముగదా.

పరిణయ కోరికయు వేఱు, అన్యపురుష పరిసంగముచేత నాయికను నోనాడుట వేఱు. తొలిదిగ్రాహిగను గాని రెండవది కూడదని వాదింప వచ్చెద వేమో! అవాదమును, అజ్ఞానమూలకమే. ఈకింది కథచదువుకో.—

ఆంధ్రభాగవతము.

(2) "భగవంతుఁడును, శృంగారనాయకాగ్రేసరుఁడును నయిన శ్రీకృష్ణుఁ డొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట......లోపలి మందిరంబున శరచ్చంద్రచంద్రికాధవళపర్యంక మధ్యంబున సుఖాసీనుండై—

* మ. పతి యేరూపముదాల్చినం ద దనురూపం బైన రూపంబుతో
సతి దా నుండెడునట్టి రూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా
సుతనుఁ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా
చతురత్వంబున (శౌరి) యిట్లనియెఁ జంచన్మందహాసంబుతోఁ.

శ్రీభాగవతమ్

* తాం రుక్మిణీం శ్రియ మనన్యగతిం నిరీక్ష్య.
యా లీలయా ధృతతనో రనురూప రూపా
ప్రీతస్స్మయ న్నలకకుండలనిష్కకంఠ
వక్త్రోల్లస త్స్మితసుధాం హరి రాబభాషే.
రాజపుత్రీప్సితా భూపైః, ల్లోకపాలవిభూతిభిః
మహానుభావై శ్శ్రీమద్భి రూపౌదార్యబలోర్జితైః
తాన్ప్రాప్తా నర్థినో హిత్వా చైద్యాదీన్ స్మరదుర్మదాన్.
దత్తా భ్రాత్రా స్వపిత్రా చ, కస్మాన్నో వవృషేఽసమాన్.
నిష్కించనా వయం శశ్వ, న్నిష్కించనజనప్రియాః
తస్మాత్ప్రాయేణ నహ్యాఢ్యా, మాం భజంతి సుమధ్యమే.
అథాత్మనోఽనురూపం వై, భజస్వ పురుషర్షభం
యేన త్వయాశిషస్సత్యా ఇహాముత్రచ లప్స్యసే.

మ. బలశౌర్యంబుల భోగ మూర్తి కుల రూప త్యాగ సంపద్గుణం
బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్ వారికిన్
నెలతా, తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ నిన్నిచ్చినం బోక యీ
బలవద్వైరుల వార్ధిలీనుల మముం బాటింప నీకేటికిన్.?

క. తగ దని యెఱుఁగవు మమ్మిం
దగిలితివి మృగాక్షి, దీనఁ దప్పగు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కని
దగులుము గుణహీనజనులఁ దగునే తగులన్?"

అని పిడుగులవంటి విరసోక్తు లాడఁగా, పాపము ఆ
"అలికులవేణి తన్ను బ్రియుఁ డాడిన యప్రియభాషలిమ్మెయిన్
సొలవక కర్ణరంధ్రముల సూదులు చొన్పినరీతిగాఁగ బె

---

ఇతి త్రిలోకాధిపతే స్తదాత్మనః, ప్రియస్య దేవ్యశ్రుతపూర్వ మప్రియం
ఆశ్రుత్య భీతా హృది జాతవేపథు. శ్చింతాం దురంతాం రుదతీ జగామహ.
పదా సుజాతేన నఖారుణశ్రియా భువం లిఖంత్యశ్రుభి రంజనాసితైః.
ఆసించతీ కుంకుమరూషితస్తనౌ, తస్థా వధోముఖ్యతిదుఃఖరుద్ధవాక్

తం దృష్ట్వా భగవాన్ కృష్ణః ప్రియాయాః ప్రేమబంధనమ్
హాస్యప్రౌఢి మజానంత్యాః, కరుణస్సోన్వకంపత.
పర్యంకా దవరుహ్యాశు, తా ముత్థాప్య చతుర్భుజః
కేశాన్ సమూహ్య తద్వక్త్రం, ప్రామృజ త్పద్మపాణినా.
ప్రమృజ్యాశ్రుకలే నేత్రే, స్తనౌ చోపహతౌ శుచా
ఆశ్లిష్య బాహునా రాజ! న్ననన్యవిషయాం సతీం.
సాంత్వయామాస సాంత్వజ్ఞః.—

కృష్ణః.

బ్బులి రొదవిన్నలేడిక్రియఁ బొల్పఱిచేష్టలుడక్కి నేలపై,
వల నతి వ్రాలె...'' నఁట.

అట్లు విరసంబులాడి-యేడిపించి-దుఃఖభరంబున సొమ్మసిల్లిన ఆ యింతికి- మరలఁ దానె శైత్యోపచారమ్ములుచేసి,

గీ. కమలదళచారుతాళవృంతముల విసరి
పాలుచు పయ్యెద కుచములఁ బొందుపఱిచి
చిత్త మిగురొత్త నొయ్యన సేదదేర్చి
బిగియఁ గౌఁగిటఁజేర్చి నెమ్మొగము నిమిరి.

'కురులు నులిదీర్చి విరు లిడి కొప్పుపెట్టి'

'ఇందిందిరగరు దనిల చలత్ప్రసూన కలికాంచితసుందరశయ్యఁజేర్చి' మృదుమధురభాషణంబుల ననునయించె నఁట.

వసంతుఁడు శ్రీకృష్ణునివలె, వాచ్యముగా విరసోక్తులనలేదు. వ్యంగ్యముగా, లోకముమీఁది మాటగా నన్నాఁడు. కావున నేరుక్మిణివలె మల్లిక 'బెబ్బులిరొదవిన్నలేడిక్రియఁ బొల్పఱి చేష్టలుడక్కి నేలపై వలనతి వ్రాల' లేదు. మఱియుఁదన నాయకుఁడు-అని యనిపించుకొనియానందించు స్వభావము గలవాఁడౌట నెఱిఁగినదికావున అతనికిఁబ్రీతికరమగు సన్నని ప్రత్యుత్తరమిచ్చినది.

---

మామా వైదర్భ్యసూయేథా జానే త్వాం మత్పరాయణాం
త్వద్వచ శ్శ్రోతుకామేన క్ష్వేళ్యాచరిత మంగనే.
ముఖంచ ప్రేమసంరంభ స్ఫురితాధర...
కటాక్షే పారుణాపాంగం సుందరభ్రుకుటీతటమ్.
అయంహి పరమోలాభో గృహేషు గృహమేధినామ్.
య న్నర్మై రీయతే యామః ప్రియయాభీరుభామిని...

మఱి నీకా శృంగారకర్మములు తెలియవుగదా? ఏమో తెలిసినవా నివలె 'అసాధ్విని, తన రెండవహృదయాన్ని, అలాగు పాదవహం కరం అనుచితము.' అనియు, తామేమోగొప్ప శాస్త్రవేత్తలైనట్టు 'శాస్త్రాలు ఎందుకులే ఉండనీ: వట్టి లోకజనస్వభావము చూస్తేచాలు, అనియు అఘోరించితివే, యిపు డేమనెదవు? శాస్త్రాలూ, లోకజ్ఞతా రెండుకూడా శూన్య మని వొప్పుకుంటావా? యింకా పెనగులాడి కొఅవాసరవా బైటవేసుకొంటావా?

తన రెండవప్రాణమును. పరమపతివ్రతను, సాక్షాల్లక్ష్మిని శ్రీకృష్ణ భగవానుఁడు కేళీవిలాససమయమున–మేము నీకు తగము, నీకుతెగినవానిని ఎవని నైనను తగులుకొనిపో!. అని విరసము లాడుట–'కళాచతురత్వము' అన్న భాగవతకవికి నీపాటి శాస్త్రజ్ఞానము, నీకున్న 'వట్టిలోకజనస్వభావము నెఱుఁగు నేర్పు, నీకున్న ప్రపంచజ్ఞానము లేదా?

ఎక్కడదాపరించితివోయీ! శృంగారకావ్యవిమర్శకు? 'మునిరాజు' గారి యీమాటవిను

'అయంహిపరమోలాభో
గృహేషుగృహమేధినాం'

అనఁగాఁ బ్రియురాలికిఁగోపముపుట్టించి, అప్పటి ఆ మోముతీరు, ఆయధరస్పందనము ఆ యోరచూపులవాడి, ఆకనుబొమల సంచలనము, ఆబొమముడి బిగువు, డగ్గుత్తికతోడిమాటలబింకము, చూచుకొని మురిసి మురిసి పిమ్మటలాలించి బేలించి పాదములమీఁద నైనఁ బడి బహిమాలి వశవర్తినిఁ గావించుకొని పిమ్మట ముచ్చటలతో ముద్దులతో గాఢాలింగనములతో, అలరించిఆనందించుటయొకటే గృహస్థుఁడైనవానికి సంసారమునఁ గల పరమలాభ మఁట.

ఓయి! నాగరకనామధారీ! సుకుమారహృదయులకుఁ గాని యీ కథలు అంతుపట్టవు. నీవంటివారికో– రసాభాసములే.

'సొంతబుద్ధివల దెకొంతధైన'?

ఓయి స. నా. కొచార్యా,

'నాథ' అనుసంబోధనము శృంగారానుచిత మన్నావే ఎందువలన నోయి? అదేమి తిట్టా? అం దేమేని దురర్థముకలదా? ఆ శబ్ద మేమి యప భ్రంశమా?

'నాథ' శబ్దము శృంగా రానుచిత మని నీ కెవరుచెప్పినారు? బాల, ప్రియ, దయిత, కాంతమొదలగు శబ్దములలోను-ఆశ్లో-ప్రియుఁడు-కాంతుఁడు-వల్లభుఁడు-నాథుఁడు-మొదలగు శబ్దములలోను, ఒండొంటికించు కించుక భేద ముండుట కవు లెఱుఁగని విషయముకాదు. వివక్షాధీనులై ఆనుకూల్యముఁబట్టి వారు వానిని వాడుచుందురు. నీవు 'నాథ' శబ్దము శృంగారానుచిత మంటివిగదా: కావ్యాలంకారసంగ్రహమున, అష్టవిధ (శృంగార) నాయికలను వివరించుచు, కవి, 'నాథా'దిశబ్దముల నెట్లువాడియున్నాఁడో చూడు—

(1) సీ. వసుఁడు కైవసమైనవనిత స్వాధీన భ
ర్తృక; ప్రియాగమవేళ గృహముఁ దనువు
సవరించు నింతి వాసకసజ్జ; పతి రాక
తడవుండ నుత్క—ంఠఁదాల్చు నింతి
విరహోత్క—; సంకేత మరసి 'నాథుఁడు' లేమి
వెస నార్తయౌకాంత విప్రలబ్ధ;
విభుఁ డన్యసతిఁజెంది వేకువరాఁ గుందు
నబల ఖండిత; యల్క— నధిపుఁబొగడి...

పై పద్యములోని —'నాథుఁడు'—అను పదమునకు ప్రియుఁడుఅనియర్థమా? కూడుగుడ్డ నొసంగి పోషించువాఁడు (Guardian) అనియర్థమా? నీ వాదమునే ప్రమాణీకరించుచో, శృంగారనాయికలలో, పోషితభర్తృక-స్వాధీనపతిక అనువారే యుండరాదు. భర్తృ పతి శబ్దవాచ్యులునీమతమున

కూతుగుడ్డ యిచ్చువారేకదా! ప్రామాణికు లయిన ప్రాచీనకవిశేఖరు లెల్ల రును, శృంగారమున-'నాథ' శబ్దము నెట్లువాడినారో చూచితివోయి, చూడుము.

(2) భాగవతమున:—

పడఁతి యొకతె పాటపాడిచన్నిన నధ
రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్క-సతికి నంసావృతం బైనఁ
గాంతుఁ డురముఁజేర్చి కౌఁగిలించె.

అధరామృతమున నాదరించిన 'నాథు'ఁడాత్మవల్లభుఁ డైయుండు నా! లేక ఆయింటఁబెంటలెత్తుతోటి యుండునా?

ఆచారీ,-ఈ పద్యములో నాథుఁడు, కాంతుఁడు నొక్క-ఁడో! యి ద్దరో? కవితామార్గము లేవియు నెఱుఁగక కవులసమయముల నెఱుఁ గక విరసమార్గమున విమర్శలుసాగించినంతనే సంబరమా?

(3) విజయవిలాసము:—

మ. తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును 'నాథా' నీకరస్పర్శనం
బున గిల్గింతలె యంచుఁ బద్మిని కరాంభోజమ్ములన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు గన్పట్టంగ న వ్వెల్గురా
యని 'రారా', యని పిల్చెనాఁ దగె ద్విరేఫాత్యంతదీర్ఘధ్వనుల్.

పద్మినికి సూర్యుఁడు పోషకుఁడనియేనా నీవాదము?

(4) పారిజాతాపహరణము:—

మ. జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబైన తన
ర్చు లతాంతాయుధుఁ గన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
తొలఁగన్ద్రోచె లతాంగి, యట్లయగు 'నాథుల్' నేరముల్ సేయఁజే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేస్తురే?

ఈ పద్యమున మగని నెడమకాలితోఁ దన్నిన సత్యభామ 'కాంత' యనియు, తన్నఁదిన్న కృష్ణుఁడు 'నాథు'ఁ డనియు నున్నదిగదా, మఱి కృష్ణుఁడు సత్యకు గాఢ్రియనా? లేకవల్లభుఁడా?

నాథుల్ నేరముల్ సేయఁగ, అనఁగా-కూఁడుగుడ్డయిచ్చువారు నేరము సేయఁగా ననియేనా నీయర్థము?

(5) ప్రభావతీప్రద్యుమ్నము:—

మ. సమయాభిజ్ఞత గుక్కుటంబు "వివిధచ్ఛంద స్త్రీయామాంతరం
తిమయామో భగవాన్ ఋషిః, కుసుమధన్వీ దేవతా మానినీ
రమణాయాః వినియోగ" యంచు నిది యారంభించెఁగాఁబోలు నా
నమరెన్ దధ్వని మానినుల్ రతికిఁ దామై నాథులం బైకొనన్.

మానినులు నాథులను పైకొనిరఁట. ఇట నాథు లనఁగా నెవరయ్యా? మానిను లనుటయేలాగో తెలిసినయెడల నీకు నాథశబ్దముశృంగారోచిత మగునో కాదో తెలియఁగలదు.

(6) కళాపూర్ణోదయము,

మ. అకటా! యేమనిదూఱుదాన నిను 'నాథా' వేగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త్ర రమ్మనుట గానీ యొంటి యేమోగదా
నికటక్షోణికిఁ జేర రమ్మనుటగానీ కొంత నెయ్యంపుఁబూ
నికతోఁగన్నులువిచ్చి చూచుటయె గానీ లేదయొక్కింతయున్.

ఇక్కడ నాయికయే స్వయముగా నాయకుని సంబోధించుచున్నది; కూఁడుగుడ్డ నిమ్మనియా! కాదు కాదు, రతికేళికిరమ్మని.

(7) భాగవతము:—

ఉ. అక్కట బంధులున్, న్మగలు, నన్నలు, దమ్ములు, బుత్రకాదులున్
నెక్కొని తాత్రిఁ బోనఁ డన నీ మృదుగీతరవంబు వీనులన్

ఏకాంతమైన వచ్చితిమి వేగమె మోహము నొంది 'నాథ' నీ
వెక్కడఁబోయితో యెఱుఁగ మాకియ నిర్దయుఁడెందుఁగల్గునే!

(8) భాగవతమునందే:—

సీ. ఎలయించి ప్రాణేశ, యెందుఁబోయితి వని
తోరంపు టలుకతో దూఱె నొకతె,
జలజాక్ష నను(బాసి చనఁగ నీ పాదంబు
లెట్లాడె నని వగ నెయిచె నొకతె,
'నాథ', నీ వరిగిన నాప్రాణ మున్నది
కూర్మియే యిది! యని కుంచె నొకతె,
యీశ్వర, నను నిన్ను నిందాకఁబాపెనే
పాపపువిధి? యని పలికె నొకతె...

ప్రాణేశ, ఈశ్వర, 'నాథ' శబ్దములు పోతన్న సమానముగా వేవాడి
యునికి యిప్పటికైనను బుద్ధికివచ్చినదా?

(9) గోపికాగీతలు (శ్రీభాగవతము)

శ్లో. చలసియ ద్వ్రజాచ్చారయన్ పశూన్
నళినసుందరం 'నాథ' తే పదం
శిలతృణాంకురైః సీదతీతి నః
కలిలతాం మనః కాంత గచ్ఛతి.

నాథా, నీవు మందనుండి వెడలిపోయి, గోవులను మేపునప్పుడు
నీపాదములు కసవు, శిలములు, దాఁకి నొచ్చునేమో యని మామనస్సులు పరి
తాపమును బొందును'— అన్నారు గోపికలు. ఇక్కడ గోపికలు
కృష్ణుని 'నాథా' అని సంభోధించుటలో భావమేమో!

'కళాప్రపూర్ణ' శ్రీ శేషాద్రిశర్మగారి తెనుఁగు.

మ. "కమనీయాకృతిమీఱ నాథ, పశుసంఘాతంబు వెంటన్"
—తాండవకృష్ణ భాగవతము.

ఆ శర్మగారికికూడ-'నాథ' శబ్దసారస్యము నీకు తెలిసినంతగా తెలిసి నట్లులేదోయి. మఱి ఆయనగారు నీవంటిగొప్పపండితుఁడైతేగదా!

(10) ఇదిగో ఆదికవి వాల్మీకిమాట యొకటి విను.—

శ్లో. బాష్పపూర్ణముఖీ మందం
చక్షుషీ పరిమార్జతీ
లక్షితాహం త్వయా 'నాథ'
వాయసేన ప్రకోపితా.

—సుందరకాండము.

ఈవాక్యమెవరిదో తెలియునా! సీతామహాదేవిది. ఆమెయెవరిని-'నాథా' అని పిలుచుకొన్నది? శ్రీరాముని. ఆతఁడామె కేమికావలెనో! వల్లభుఁడే; దయితుఁడే; ప్రాణప్రియుఁడే; కాంతుఁడే. అయినచో-మఱి 'నాథా' అన్నదెందువలన? శ్రీరాముని నిరసించుతలంపుననా! లేక ఒడలిపొగరుచేతనా! కాదుకాదు, వాల్మీకిమహర్షి నీవుచదివినచదువు చదువక, తెలివితక్కువగా ఆమెచేత అట్లనిపించినాఁడు. అంతేనా!

స. నా. కొచారీ, ఇంకెన్ని ప్రయోగాలు కావలెను? శృంగారఘట్టములలో, సురతప్రసంగములలో 'నాథ' శబ్దమును వాడినకవులుపెక్కురుకలరు కావలెనంటివేని కొన్నివందల ఉదాహరణములున్నవి. నీకుశృంగారమన నేమో తెలియనే తెలియదని తెలిసినది. ఇఁక ప్రయోగము లెందుకు? నీవంటివానిఆక్షేపములకు సమాధానముచెప్పుట ప్రాజ్ఞులుపోనిపని యని తెలిసినది. అయినను, నాసమాధానములు నీకుఁగా వ్రాయఁబడుటలేదు. నిన్నొకగొప్పపండితునిగా భావించి, నిన్నుపెద్దనుచేసి, నీప్రజ్ఞకు చంకలుకొట్టుకొనువారికై వ్రాయుచున్నాను. ఇంతతోనైనను వారు నీ తీరు తెలిసికొందురుగాక.

సరస్వతిశాస్త్రినాగరకుండా, నీనోటిమీఁదుగనే చెప్పు. పై పద్యము లన్నియును–'చెడ్డకంపు' కొట్టుపదార్థములేనా! అందలి–'నాథ' సంబోధనములన్నియు 'దోమ' లేనా?

# V

## విచారణ

స. నా. కౌచార్య,

నీ పాండిత్యపుబండారమును తెలిసికొంటినిగాని ఇంతకును నీవెవఁడవో విచారింపనైతిని. ఇపుడుమాత్రము మునిఁగిపోయినదేమి?—నీవునీపేర 'సరస్వతిశాస్త్రినాగరకౌచార్య' అనివ్రాసికొన్నావు. 'ఆచార్య' అను పదము స్త్రీవాచకముగాని పుంవాచకముకాదు. అది స్త్రీలింగమైన ఆచార్యా శబ్దముయొక్క తత్సమరూపము. ఆచార్య యనఁగా వేదవ్యాఖ్యానము చేసెడుఆఁడుదిఅనియర్థమఁట బహుజనపల్లి సీతారామాచార్యులవారు చెప్పుచున్నారు. నేను నీ నామమునుగమనించియు–ఈతఁడాచార్యుఁడయ్యును భ్రమచే ఆఁడపేరుపెట్టుకొనెనో, లేక ఆ సరస్వతిశాస్త్రిము స్త్రీశాస్త్రిముకావునను అందలి పురుషులను స్త్రీనామమునే పెట్టుకొనుటఆచారమో—అనిభావించితిని. కావుననే తొలుతనుండియు నిన్నాచార్యునిగనే వ్యవహరించితిని. నాభావనతప్పని నీవుచెప్పుచో తప్పక సవరింతును.

నిజముచెప్పుము. నీవెవఁడవు? ఏయూరివాఁడవు? నీకునీతల్లిదండ్రులు పెట్టినపేరేమి? ఇట్లు 'నాగరకౌచార్య ఖుస్రూ' కళేబరపు బురకా లోఁదూరవలసిన అవస్థనీకేల పట్టినది?

శ్రీ శాస్త్రులవారిని గొప్పచేయుటకు పరపండితులనుపరిహసింప కం

కణముకట్టుకొనిన తచ్ఛిష్యులలోని వాఁడవేనా? కాకున్నచో ము. నా. రెడ్డి గారు తమ 'తలపోతల'లో నీ'తలపోతలు'ను చేర్చిప్రఖ్యాపింపనేల? శాస్త్రి శిష్యులలోని వాఁడవేయైనచో వారివలెనే 'వీరమర్యాద' గా సొంతపేరు తోనే తిట్టక దొంగపేరుపెట్టుకొని మొఱఁగనేల!

నీవు దొంగపేరుపెట్టుకొనుట చేతను, ఆపేరైనను లోకసామాన్యము కాకపోవుటయేకాక పురుషసామాన్యముగూడ కాకపోవుటచేతను నీ విపరీత నామమున నేమేని వింతయుపంశయము కలదేమో అన్నతలఁపున నింతగవిచారించుటయేకాని నీ వెవఁడవైన నేమి? ఏయూరివాఁడవైననాకేమి? కాని నీవు విమర్శకుఁడవేనా? కావ్యవిమర్శనమే నీ ప్రధానోద్దేశమేని తిట్లకుదిగనేల? తిట్టుటయే ప్రధానమేని కావ్యముమాటయెత్తనేల? వాఙ్మయవిమర్శలలో, పండితులైనవాఁడు, గుణము, దోషము, ఔచిత్యము, అనౌచిత్యము మున్నగుపదములువాడును గాని నీవలె—'దొంగతనము' 'తోడుదొంగతనము' 'క్రైము' 'తెఫ్టు' 'జాలము' 'సుప్రెక్షన్—' 'ద్రోహం' 'చీటింగు' 'కేసు' 'లోపాయితనం'—'ఆమాతే' అను పాడుపదములను వాడునా? అవి—క్రిమినల్ కేసులు, ఫోర్జరీలు—దొంగతనములు జాలములు మొదలయినవానిలో నలిఁగిన—తత్సంబంధులతో మెలఁగిన వారాడుకొనఁదగినవి గాని, కావ్యములతోఁ బరిచయము గలిగి కవులతో పండితులతో మెలఁగినవారు వాడుకొనఁదగినవేనా!

నీవు నాగరకాచార్యుఁడవా?— ఏమో, కులముచేత నీవాచార్యుఁడవౌదువేమో గాని, వాగ్రీతిచేత నాగరకుఁడవుమాత్రము కావు. అంతవఱకు స్పష్టము. నాగరకుని మాట అటుండనీ, నాగరకుని వాసన సోఁకిన వాఁడైనను ఒక కవి కవిత్వమును విమర్శించునపుడు, ఆ కవిని నీచముగా నిర్దేశించునా?...'చెప్పే మూర్ఖుఁడు కవి అవుతాడా'?......'వర్ణించే మొండికట్టె' 'కవింమన్యుఁడు' ...'అసంబద్ధప్రలపితం' 'పిచ్చిమాత' 'పిచ్చయ్యకు తోడు శర్మయ్య' 'అర్ధపిచ్చి' 'మహాకవుల తప్పుపట్టడం,' 'ఉబ్బిపడడం' —'ఇంకను ఏజెన్ (ఫీ) ప్రూఫ్ క్రిమినల్యాకులం' 'మునిసిపాలిటీ వారు స్కా—

వెంజి చేయించవలసినది'—'బొచ్చు' 'తోలు' 'చిప్ప' 'చెడ్డకంపు' 'దోమ' అని అసహ్యపు, అనాగరకపు మోటువ్రాఁత వ్రాయునా! ఆహా! నీవా నాగరకుల కెల్ల నాచార్యుఁడవు! జుగుప్సాకరపు మోటుమాటల మానిసియా ఆ సరస్వతీరాష్ట్రమున నాగర కాచార్యుఁడు? ఇది మొగము, ఇది పుఱ్ఱి యొకటి యని కూడ నెఱుఁగని వానికా అంతపెద్ద బిరుదు?

ఓయీ నిన్నొక గొప్పపండితునిగా భావించి, నీ పక్షము లాశ్రయించి, నీ మూలాన విజయలక్ష్మీస్వయంగ్రాహసుఖము ననుభవింప నాసపడిన వారెవరోయి వెఱ్ఱివెంగళప్పలు! నీ వేమో పొడిచి గెలుతువని వారనుకొన్నారు. నీ గుట్టువారి కేమి యెఱుక? ఆచార్యుఁడవైన నీ కట్టూ బొట్టూ జుట్టూ చూచి, నీ నీవా జావా చూచి, నీ యాడంబరమూ హంగూ చూచి, ఆసపడి మోసపోయినారు. పాపము వారియాస వట్టియడియాస చేసితివి. నీ యాక్షేపము లన్నియు నవేఁగారి పోయెను. వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడితివి. మెయ్యఁబోయి మొహకు తగిలించుకొంటివి. ఇఱుసుకొని యిగిలించు చుంటివి. నీయగచాట్లు వారి కే మెఱుక! 'దాసరి తిప్పలు పెరుమాళ్ళకే యెఱుక'. నిన్ను నమ్ముకొని యింతపనికి దిగిన ము. నా. రెడ్డికి నీమొగమెట్లు చూపెదవు? ఆ దొడ్డరెడ్డి నీ వ్రాఁతపై నాధారపడి యీ ఘనకార్యమునకు దిగుట దేనినో నమ్ముకొని యేటిలో దిగుట యయ్యెఁగదా!

నీది మతిలేని వ్రాఁత. కాకున్నచో,—"ఈ కబ్బపుకంచులో నుంచి ఇంకొక మెతుకు ఉడకనిది. పాసిపోయింది. పుట్టికూడా అయింది"—అని వ్రాయుదువా?

కబ్బము కంచయినచో, అందు మెతుకు లేల యుండును! ఎట్లుండును? ఉండెఁబో! ఒక్క మెతుకే, యేకకాలమున, అన్ని యవస్థలలోఁగనఁబడునా? ఉడుకని మెతుకు పాయునా! పుట్టికూడా అయిపోయినచో వ్రాఁత మెతుకుగా నగపడునా! ఇంతకును నీ కంటఁబడినది మెతుకే! [illegible]!—

కంచులో మెఱుఁగేమిటోయ్ కంచములోఁగాక?— ఇట్లు పరామర్శించి చూచిన నీ వాక్య మొక్కటినిలువఁగలదా!— ఈమాత్రపు తెలివిగల పురుషుఁడవు నీవు నన్ను— శర్మగారినే కాక, విశ్వకళాపరిషత్పండితులనుగూడ వెనకఁబోవుట నీ మర్యాదగ్ధతను బయటఁబెట్టుటకొనుటే కాక మఱేమి యగును?

నీవు. ఒకరికావ్యమును విమర్శింపఁ దగినవాఁడవా! ఒక్కవాక్యము నైనను సమన్వితముగా చక్కఁగా వ్రాయలేవుగదా! అనుకొన్న సంగతిని తేలికగా తేటగా మనసున కెక్కునట్లు మంచి మాటలతో వ్రాయుపాటి ప్రజ్ఞయునులేని నీకు కావ్యవిమర్శలగొడవ యేమిటికి? నీ వికృతశైలి పండితులకే కాదు. సామాన్యులకు కూడ రోఁతపుట్టించుచున్నదే, మఱి యెవరికొఱకు నీవ్రాఁత? వ్రాయునది వాడుకభాషయైనను, అనువాదమున మూలార్థమును కొన్నవృత్తమున నిముడక త్రొక్కటపడు 'ముక్కకిముక్క' కష్టజాతకవి వలె—వాక్యమున పదపదమునకు అట్లు, ఉత్కృష్టముగావస్థపడెద వేల? అట్టి శైలిని కళాప్రియులు—'మలబద్ధకపు శైలి' అని రఁట వినావా! ఏ భాషలోనైనను, వివక్షితార్థమును విశదముగాఁ జెప్పఁగలుగుటయే రచనాకౌశలమైయుండఁగా, నీవ్రాఁతయిట్లు—అనర్థకమై—తెఁకఁగుంజుట్టిన తెగులయినదేమి? నీవాక్యములు నీకైనను సులువుగా అర్థమగునా! ఏమో నమ్మఁజాలను "నావ్రాలు నాకే తెలియదు" అన్నకోటికి చేరియున్నదిసుమా, నీవికటపదబంధము. యేదీ ఒక్కవాక్యమున నైనను అర్థాన్వయములు ప్రసన్నములుగా నున్నవో చూపుము. చేతఁగానికవులు పద్యరచనలోపడుపాట్లు నీకువచనరచనలో నేపట్టుపడుట నీయదృష్టము కాఁబోలు! ఇప్పటికైనను మించిపోయినదిలేదు ఏ వీరేశలింగముపంతులో, యే చిలకమర్తికవియో, యే వేంకటపార్వతీశ్వర కవులో వ్రాసిన వచనగ్రంథములు పదిమాఱులుచదువుకొనుము. కొంతకు కొంతవక్రత తొలఁగి చక్కఁబడును నీవ్రాఁత—అటుసంస్కృతము, ఇటు తెనుఁగుం గాని యీయుభయభ్రష్ట దురన్వయ మూర్ఖాన్వయ రసాభాస [illegible] బంధమే శరణమైన యెడల, ఆనాథప్రేతములఁబోని [illegible]

"పేడాజెల్లం" కలిపి పిసికిన శయ్యాసౌభాగ్యముతో, లోనినిస్సారతనుకప్పి పుచ్చు మేడిపండుమేలిమితో, అర్థముచేసికొననేరనివారికి అబ్బో! అనిపించు అప్పుతెరచనతోనే జీవితముసాగించుకొనుము. నీ 'కాలగతి' యిట్లుండ నేమిచెప్పిన నేమి ప్రయోజనము?

## భావకవులు- వెక్కిరింపు.

అంగ్ల కావ్యములు చదివి అందలి చమత్కారములను అలవఱచుకొని వానిని లలిత లలిత మార్గములతో తెలుఁగున వెలయించుచున్న నేఁటి భావకవులను నిరసించుచు నీవు-" తెలుఁగులు- ఇంగ్లీషు పరిచయం, పాండిత్యం సంపాదించుకొని ఆ ఇంగ్లీషులో ఆ జాతివారు మెచ్చుకో దగిన దేమి కావ్యము వ్రాయలేక- చెన్నపట్ణం నడిమంత్రపు వాసం నుంచి వచ్చిన పల్లె విలాపి పల్లెలో ఉత్త పేకపుసు వేసుకొన్న రోడ్లుగోడ్లు సులోచనాలతో మిట్టి మిట్టి చూస్తూ షికారీ తిరగడం వలె- ఆ మార్గంలో తెలుఁగులోనే గంతులు వేయడం తమ సుందరిద్రతకు, వంచన ప్రవృత్తికి ఒకంత తార్కాణం అవుతుంది"——

అని వెక్కిరించి నావే అది సరదైన వెక్కిరింపేనా? నీవు కవితావాసన యెఱిఁగిన వాఁడవేనా? అంగ్లము, హిందీ, బెంగాలీ, ఫ్రెంచి, మొదలగు నన్యభాష లభ్యసించి అందలి సాహిత్యపు సొబగులను, కవనపు మెలఁకువలను, గ్రహించి వానితో తెలుఁగు బాస నలంకరించు కవి కవుల రులను కొనియాడుటకు మాఱు వెక్కిరించు నీవు విమర్శకుఁడవేనా? పోనీ గాని ఆచారీ నీవు చెన్నపట్ణం నడి బొడ్డునఁ బుట్టిన అసలుజాతి పట్ణం విలాసివా? నీవు వేసికొను నవి ప్యూర్ గోల్డు సులోచనాలా? వానిని నీవు వేసికొనుట కనులు చెడిపోవుట చేతనే గాని ఉత్త షోకుకు కాదా? కాదన్న మాఁనెఁగాని ఒక్క మాట అడిగెదను 'దెప్పు'-వేదం వేంకటరాయ శాస్త్రిగారు.

సీ. 'హాలాహలరూపకరసం బుదరంబు నిండార
దిగఁద్రావి గట్టునఁ బేర్చినారు'

అని గొప్పగా చెప్పికొన్నారు గదా! అందలి భావమేమి? ఆంగ్లము నెఱుఁగని యితరకవిపండితుల వలెఁ గాక తామాంగ్లమునుండి అనేక విశేషాంశములను తెలిసికొని తమ నాటకములకు కొంగ్రొత్తవన్నెలు చిన్నెలు కూర్చినట్లు చెప్పికొనుటయేకదా? అట్లు వన్నెలు చిన్నెలు కూర్చినందుకు మఱి వారిని గూడ 'గొల్లు గొల్లు సులోచనాల వారితోఁ' బోల్చి వెక్కిరింపవలసినదే నా!

ఇంకొక్క మాట- నే- నేం- శాస్త్రిగారు సంస్కృత మర్యాదల నేకము తెలుఁగునకు దిగుమతి చేసి తెనుఁగుఁదనమును తొలఁచి తమ ప్రౌఢిమను ప్రకటించినారు. నేను సంస్కృతమున నొకముక్కయైనను వ్రాసియుండలేదు కావున వారిని-

“తెలుఁగులు సంస్కృతపరిచయం పాండిత్యం సంపాదించుకొని ఆ సంస్కృతములో పండితులు, మెచ్చుకోఁదగిన యే కావ్యం వ్రాయలేక చెన్నపట్నం...వలె ఆ మార్గంలో తెలుఁగు లోనే గంతులు వేయుడం తమ గూఢదరిద్రతకు వంచనప్రియతకు ఒకింత తార్కాణం అవుతుంది”.

అని వెక్కిరింపవచ్చునా?- శాస్త్రిగారి రచనలు కాన వారికిఁ జెల్లదో నీ యాక్షేపము?

ఓయీ! ఆక్షేపైకజీవీ! నీకు గుణము గోచరింపదు, పైఁగా గుణము దోషముగాఁ గూడ, గాన్పించును. నీ కర్మ మంతే. పో.

## స్వవచనవ్యాఘాతము.

నేను- “లక్ష్యాలను- అంటే యితరుల కావ్యాలను- అనుసరించక స్వతంత్రించిన” శ్లోక పోటను, నా కథ, వర్ణన, సంవిధానం, సంభాషణం

సర్వము నున్నా, మహాకవుల- 'తమ్మిపడగం'- 'ఊమ్మిపడగం'- అని మాటి యొక చోటను వ్రాసితివే. అది బుద్ధిగల వ్రాఁతయేనా? అందేది నిజం? నీకు తిట్టుమాటలు వెదకుకొనుటకున్న శ్రద్ధలోఁ బదియవపాలు సత్యాన్వేషణ ము మీఁద నున్నచో నిట్టి అవకతవక వ్రాఁతలు వ్రాసియుందువా!

## దొంగతనమా?

నేను సంజకెంజాయను, దినలక్ష్మి మొగము చాయలనుటయు, మల్లి కావసంతులకు మైత్రిం జెప్పుటయు, నాయికానాయకులకు, ఎగతాళి ప్రసంగము కల్పించుటయు.- దొంగతనమా,?

ఆ రచన శాస్త్రసమ్మతముకానిచో తప్పగును, గాని దొంగతనమే లగును:— "ఒర్వరాని, ఒప్పుకించరాని, దొంగతనం, తగినదండన యేమి చెప్మా. అని వెతకదగింది" అని వ్రాసితివే. దండన కిదియేమి దొంగ డైరీలువ్రాసి దొరకోవడమా! తప్పుడు చెల్లులు వేసి అప్పు లెగవేయుడ మా! పలువతనమున పత్రాలుమ్రింగడమా! కొనికూళ్లు కుడువడమా! కూటసాక్ష్యములు చెప్పడమా! గురుద్రోహముచేయుడమా:— కాదే! ఇది కవిత్వము. ఇంతతె ప్పొప్పులే కాని, దొంగతనమేమి? దండనయేమి? నేను గ్రంథమును రచించుట 'దొంగతనము'ను, పీఠికను వ్రాసిన శ్రీ శర్మగారు నా కవితను ప్రశంసించుట 'తోడుదొంగతనము'నా! ఏమినీ తెలివి! అట్లై యినచో, ఒకశర్మగారేయేమి; వారివలెనే నాగ్రంథమును ప్రశంసించిన పండిత ప్రకాండు లందఱును 'తోడుదొంగలే' యగుదురుగదా!

ఓయీ! కూపకూర్మమా! యిటు తిలకింపుము. ప్రణయ కుసుమ కావ్యమును గూర్చి పండితు లేమన్నారో వినుము.

(1) బ్రహ్మశ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.-

'ప్రణయకుసుమము'......ను జదివితిని...... మిక్కిలి వ్యను సంతోష

రమైన శైలితో వెలయుచున్నది. ప్రాచీ నాధునాతన కవితా మార్గము లందలి నిగ్గును, జగ్గును నించెనని యుండుటచే నియ్యది సహృదయ హృదయంగమముగా నున్నది.

(2) బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు.

ప్రణయకుసుమము... నామూలాగ్రముగాఁ జదివినాను. కథాపోషణము ప్రాచీ నార్వాచీన పద్ధతుల కూడికను దెల్పుచున్నది. భాషమృదువుగానున్నది. శైలిహృద్యము.

(3) బ్ర. శ్రీ. వడ్డాది సుబ్బారాయఁడు గారు.

ప్రణయ కుసుమము నందలి అనర్గళ మైన కవితా ధారయు రసానుగుణము లయిన వృత్తి భేదములును, విషయానుకూలము లయిన వర్ణనా కల్పనములును మిగుల శ్లాఘనీయములు. లోకానుభవ ప్రకాశక స్వభావ వర్ణనలు పెక్కులు పాఠకహృదయాకర్షకములుగా నుండుటంబట్టి మీ కవితా ప్రౌఢిమకొనియాడఁదగియున్నది.

(4) మ. రా. రా. శ్రీ. నటకునుటి వీరరాజు పంతులుగారు.

.........గ్రంథమంతయు మృదు మధుర పద సంఘటితమై యెల్లర యుల్లంబులఁ జల్లవింపఁ జేయునదిగా నొప్పారుచున్నది. ఆందందు తిక్కన మఖి శబ్ద భావముల మేలి కూరుపును, నాచన సోముని మనోహర పద సంఘటనమును, నన్నిచోడ కవిరాజు జానుతెనుఁగు సోయగము మొదలగు సత్కావ్య లక్షణములు గలిగి, నవీన భావ విన్యాసములతోఁ జెన్నుమిగిలి యున్నది. గ్రంథ పీఠికయు స్తవ్యమై యొప్పారుచున్నది.

(5) మ. రా. రా. శ్రీ. త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావు దొరవారు.

తమరు దయతో పంపిన ప్రణయకుసుమము నాకు చేరినది. అందలి

ష్పాసు మధురకవితా మరందమును గ్రోలి యానందము నందెదను. ఇంతకు మున్నే పత్రికలలో తమ కవితా రసమును కొంత చవిమాచి యుంటిని.

(6) పిఠాపుర సంస్థాన విద్వత్కవులు.

ఓలేటి వేంకట రామశాస్త్రి గారు.

ప్రణయ కుసుమము మృదుతరము రసమును, సుగంధమును గలది కావున సుమనో మనోహరముగా నున్నది.

(7) చింతా దీక్షితులుగారు బి. ఏ., యల్. టి.

ఉత్తేజము గలిగించే యీనాటి సారస్వతమున నీ కావ్యము మంచి స్థాన మాక్రమించఁగలదు.

(8) విజయనగర సంస్థానాస్థాన కవులు.

భోగరాజు నారాయణ మూర్తి గారు.

.........'అలతి తొలిబట్ట చంద్ర మండలము నుండి, జలజలను రాలు నమృతంపుఁ జాలు లీల?' రసమును తొలఁకించు నీ ప్రణయ కుసుమము భాషాయోష కవతంస కుసుమము కాఁగలదు.

(9) త్రిలిఙ్గ.

......ఈ చిన్న కావ్యము......నూతన యుగ సంద్గ్రాహకము, భావ గీత సంశోభితము, హృదయానంద సంధాయకము. కవి యశంబు కల్ప స్థాయి యగుంగాక.

(10) ఆంధ్రపత్రిక

......శాస్త్రి గారి కవితా లత శర్మగారన్నట్లు ఈ గ్రంథము నందు పుష్పించిన దనుటకు సందియము లేదు. కనుకనే ప్రణయ కుసుమమునందలి సౌరభము విదగ్ధజనుల నాకర్షింప జాలియున్నది. ఇందలి

యితివృత్తము, ఇతివృత్తమునకుం దగిన పదపదార్థరసావిష్కరణ చాతురి యును, అందు కనఁబరచిన ఔచిత్యమును మిక్కిలి గమనింపఁదగియున్నవి.

## *(11) Swarajya*

*As regards the style of the varied verses of the book I venture to say that it is not only copious and vigorous but also rich in its simplicity. I am sure that the book deserves to have a place among the many gems of Andhra Literature and I recommend it to the perusal of the Andhra young men.*

ఇట్లు నా ప్రణయకుసుమమును ప్రశంసించిన కవులు, పండితులు, విమర్శకులు, పత్రికాధిపతులు, అందఱును తోడుదొంగలేనా? వారి కందఱికిని ఆమోదమును గొలిపిన ప్రణయకుసుమము నీకు 'పూతిక్రిమిపర్యాకులంబు' గాఁ గనఁబడుట నీ పురాకృత కర్మవిపాకము గాక మఱేమగును! ప్రాజ్ఞులు దోషములను విడిచి గుణములనే గ్రహింతురు; నినువంటి దుర్విమర్శకులు గుణమునుగూడా దోషముగా నొనరింపసాహసింతురు; అనుటకింతకంటె తార్కాణ మేమికావలయును?

ఓయీ సాహసికుఁడా!

నీవు కొత్త బిచ్చగానివలె నున్నావు-దొంగతన మన నేమో, దోష మన నేమో యెఱుంగవు. నీవుకూపకూర్మమవు. కాదు కాదు. నినువంటి వారిని కూపమండూక మనవలె నన్నారు మా తిరుపతి వేంకటేశ్వరకవులు. ఇదిగో వారి పద్యము.

"కూపకూర్మం బటంచు పేర్కొనుట తప్పు
కూపమం దున్న కూర్మంబు కూయ దెందు
అరయ కెంతయు బెక బెక మనెడు కతన
కూపమండూక మనుచు పేర్కొనఁగవలయు."

నా యానందమునకై, నాకుఁదోఁచినరీతిగా కావ్యమును వ్రాసికొన్న నాది దొంగతనమా— లేక నా కావ్యమున ద్వేషబుద్ధితో దోషములు కల్పించి —నన్నుఁ దిట్టి—మాఱువేషమువేసికొని మఱుఁగునఁబడియున్న నీదిదొంగతనమా ప్రాజ్ఞలోకము తెలిసికొనఁజాలదా!

## కుకవినింద

కావ్యవిమర్శన మంత సులభమైన పని కాదు. గండగత్తెరలోఁగంతము పెట్టుట వంటిది. కవి కావచ్చును, గాని విమర్శకుఁడు కారాదని పెద్ద లందురు. కవుల దృష్టి వేఱు. కవుల సృష్టి వేఱు. కళారహస్యము నెఱుఁగని మొద్దు బుద్ధులకు అజాడలు పొడకట్టవు. కవులుపోయిన మార్గములను గుఱుతించి లోకమునకుఁ దెలుపుమహానుభావులు విమర్శకులు. అంతే కాని రంధ్రాన్వేషణ దృష్టితోఁ గావ్యమును చీకాకు చేసి, కవిని పడదిట్టు "మొఱటు గాండ్లు" విమర్శకులు కారు. ప్రాజ్ఞులైన ప్రాచీనులు అట్టివారిని కుకవులని, కువిమర్శకులని వక్కాణించిరి. కువిమర్శకులు కవుల కకారణ శత్రువులు. తప్పులు వెదకుటయే వారి వృత్తి. ఒప్పును తప్పొనరించుటయే వారివిద్య. వారు కవితాలతికకు వేరుపురుగు వంటివారు. వారి అలజడికి జడియని కవియు, వారిని నిందింపని కవియు సంస్కృతాంధ్రవాఙ్మయమున లేఁడన్నను అనవచ్చును.

మహాకవి భవభూతి, కువిమర్శకుని— తప్పఁద్రాగి వైదేహినిఁ గూర్చి తప్పుడు కూతలు కూసిన చాకలితో జత చేసినాఁడు. ఆ చాకలి వలన జనకతనయకుఁ గలిగిన ముప్పెట్టిదో, దుర్విమర్శకుని వలన కవితకుఁ గల్గు ముప్పును నట్టిదియే యని లోకమునకు చాటిచెప్పినాఁడు. దుర్విమర్శకుని దుర్జనుఁడన్నాడు. అంతతోఁ దనిసనక—'అతి దుర్జనుఁ'డనియు నన్నాఁడు.— అతి దుర్జన శబ్దమునకు వ్యాఖ్యాత యిట్లు వివరణమును వ్రాసినాఁడు.

"విద్యమానస్యాపి దోషస్య కథనం దుర్జనకార్యం–, తత్రాప్యసత స్తస్య కథనం తతోఽపి దుర్జనకార్యం, విషయప్రభావ మవిగణయ్యాస తోఽపి తస్యకథనం సుతరాం దుర్జనకార్యం. తత్రాపి వ్యసాధారణహేతు మదృష్ట్వా విషయప్రభావమప్యవిగణయ్యాసతోఽపి దోషస్య కథనం తతోఽపిదుర్జనకార్యం. తత్రాపిబాధకప్రమాణమ ప్యవిశ్వా స్యాసాధారణకారణమ ప్యదృష్ట్వా విషయప్రభావమ ప్యవిగణయ్యాసతోఽపి దోషస్యకథనం తతోఽప్యతిదుర్జనకార్యమితి"

నిఖిలామ్నాయమండలీ వ్యాఖ్యా విఖ్యాత మాహాత్మ్య మండితుఁడును అఖిలశాస్త్రగ్రంథ నిర్మాణచాతురీ శోభితుఁడును, సర్వజ్ఞశిరోమణియు, నైన శ్రీ మాధవాచార్యుఁడు * శంకర విజయమున– తనకమ్మని కావ్యము నిష్కరుణు లగు దుష్కవుల (దుర్విమర్శకుల) వాఁతఁబడి– ముష్కర తురుష్కుల పాలఁ బడిన ధేనువువలె– వికృతిని బొరయు నేమో యని జడిసినాఁడు. దుర్జనునికి జడియని వారెవరు?

> ఆకార ణావిష్కృత కోప దారుణా
> దసజ్జనాత్ కస్య భయం న జాయతే,
> విషం మహాహే రివ యస్య దుర్వచ
> స్సుదుస్సహం సన్నిహితం సదాముఖే.
>
> —కాదంబరి.

ఆంధ్రకవులు దుర్విమర్శకుల నెట్లు చీవాట్లు పెట్టిరో చూడుఁడు–

---

* సామోదై రనుమోదితా మ్మగిమదై రానందితా చందనై ర్మందారై రభినందితా ప్రియగిరా కాశ్మీరజైః స్మేరితా,
వాగేషా నవకాళిదాస విదుషో దోషోజ్ఝితా దుష్కవి వ్రాతైర్నిష్కరుణైః క్రియేత వికృతా ధేను స్తురుష్కై రివ.

జక్కన.

నవనానారస భాస్వరార్థ పదవిన్యాస క్రియాలంక్రియా
శ్రవణానంద కథా సుధా మయ మహాసారస్వతాంభోధిలోఁ
నవలీలన్ విహరించు తద్జ్ఞులు గతాహంకారులై యుండఁగాఁ
గవితా ప్రౌఢిమ లేని యజ్ఞులు వృథా గర్వాంధు లే లౌదురో?

నారాయణకవి.

సరసులు గద్యపద్యముల చాతురికిం దలలూచి మెచ్చఁగా
విరసు లసూయ చేత మఱి వేడ్కవహింపరు, తేఁటి మొత్తముల్
శరదరవింద బృంద ఘనసార మరంద సుగంధ సంగ్రహ
స్ఫురణ వహించుఁ గాని, పురసూకరపంక్తులు చెంద నేర్చునే?

అప్పకవి కుకవిని (దుర్విమర్శకుని) ఈఁగఁగా నిరసించినాఁడు—

“వ్రణము గని నిర్మలాంగంబు వదలు నీఁగ
యనఁ గుకవి తప్పుఁగని యొప్పు నడఁచి పుచ్చు”

ప్రెగడరాజు నరసరా జను నొకకవి తెనాలి రామకృష్ణుని కవిత్వమున పుళింకలు చేసి యెట్లు చీవాట్లు తిన్నాఁడో చూడు-

చ. ఒకని కవిత్వ మం దెనయు నొప్పులు తప్పులు, నా కవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టఁ బని యుండదు, కాదని తప్పు పట్టినన్
మొక మటు క్రిందుగాఁ దిగిచి ముక్కలు వోవని యున్న కత్తితో
సిక మొద లంటఁ గోయుదును జెప్పున దంతము లూడఁ దన్నుదున్.

చ. తెలియని వన్ని తప్పులని దిట్టతనాన సభాంతరంబులన్
బలుకఁగ రాకురోరి పలుమాఱుఁ బిశాచపుఁ బాడె కట్టె నీ
పలికిన నోట దుమ్ముపడ! భావ్య మెఱుంగవు పెద్దలైన వా
రల నిరసింతురా! ప్రెగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!

న్యాయ్యమైన దోషములను జూపిన వారి నెవ్వరుఁ గాని యేమం దుష

నిందింతురు? ఒప్పులను తప్పు లనువాని నెవ్వఁడు గాని యెందును మన్నింతురు!

సంకుసాల నరసింహకవి 'ఫురోభాగి దూషణము' నెట్లు చేసినాఁడో చిత్తగింపవయ్యా—

చ. ఖలుఁ డిలఁ దప్పులే వెదకుఁ గావ్యరసానుభవంబు సేయలేఁ
డొలుకులు గోరుఁ గాక ముద మూనఁగ గర్దభ మొంద నేర్చునే?
మలయ మరుద్విధూత మధుమాస వికస్వర కేసరావళీ
గళిత పరాగ యోగ పరికల్పిత పేశల తల్ప సౌఖ్యముల్,

ఇట్టెన్ని పద్యము లని యుదాహరింతును? కావ్యమును వ్రాసిన ప్రతికవియు నిట్లే ముందుగా దుర్విమర్శకుని మొగాన నింత దుమ్ముచల్లియే కవిత్వమునకుఁ దొడఁగి యున్నాఁడు. కవుల కది యొక యాచారము. ఆ యాచారమును బట్టియే నేనును,

"ఇంచుకయుం గవిత్వ మన నేమొ యెఱుంగని యెడ్డెయుం గృతిం
గాంచి హసించు, దిట్టుఁ బలుగాకులు తన్గని యాడు, నట్టిచో
గొంచెము గొప్ప నేర్చుకొని, కుత్సిత బుద్ధిఁ గవీశనిర్మితో
దంచితకావ్యముం జెనకు నాతనిఁ గాకవిఁ దిట్ట నేటికిన్"—

అంటిని. నా పద్యమున నేను కాకవులను దిట్ట నక్కఱ లే దంటిని గాని తిట్టవలె నన లేదే. నా కావ్యమును పఠించిన ప్రాజ్ఞ లోక మా పద్యమునకుఁ గోపగింపక పోవుటయును— నీవు కోపగించుటయును కారణ మేమో! ఏ మయిన నగును గాక. దుర్విమర్శకులను కవులు సహింపరు. పాడు విమర్శకుల బాసచే నెంతనొగిలెనో, యెంత విసిగెనో గాని, యొకకవి యెంతమాట యన్నాఁడో విను—

క. కుక్కలు చెప్పులు వెదకును
అక్కజముతో నూరఁబంది యగడిత వెదకున్

నక్కలు బొక్కలు వెదకును
తక్కిడి నా...కొడుకు తప్పే వెదకున్.

—చాటువు.

దురాక్షేపకుఁడా, తప్పన్నఁ జెప్పవచ్చునుగాని, ఒప్పను తప్పఁగాఁ జెప్పుటలేకి పని. నాగ్రంథమున నూఱుతప్పులుండవచ్చును; గాని, నీవుచూపినవి మాత్రము తప్పులుకావు. నీవంటి నీరసవిమర్శకుఁడు– 'నభూతో నభవిష్యతి'.– ఆక్షేపములన్నప్పుడు, ఒకటికాకున్న నొకటియైన నిలువవలదా? నీయాక్షేపములలో నిలిచినదేదీ!

సీ. నినువెట్టినొవరించి దినలక్ష్మి మఱియేమొ
చూపెఁగాని మొగంబుఁ జూపదయ్యె,
'నాథ' ను గట్టిగా నమ్ముకొంటివి గాని
'నాథ' యే తుదినిన్ననాథుఁ జేసె,
కొండంతయాసతో 'కుందమ్ము'ఁ గొంటివా
కుందమ్ము నమ్మించి కొంప ముంచె,
వగచెడి యాల 'రసాభాసమ్ము' నను బుర్రంగ
వార్తయంతయు రసాభాసమయ్యె,
'మల్లె' యల్లరిచేసి నీమానముడిపె
'ముఖము' నీ ముఖమున మసిపూసినవ్వె
నీవు కొనితెచ్చుకొన్న వన్నియును నిన్నె
నవ్వులకుఁ బాలుచేసెఁగా! నాగరకుఁడ!

క. పరిపాటి కలిమి మల్లెకు
సరిగాఁ గుందమును జెప్పుసత్కవుల వచ
స్సరణి యెఱుంగక పదరితి
వెలుకపడెనె తత్త్వమిప్పుడేని? స. నా. కొ.

క. తిరుగని ప్రయోగములై యొక
యిరువది యిచ్చితిని. చాల వేయిరువది నీ
యఱగొఱ చదువు తెలుఁగుఁజదు
వరులకు వివరముగఁ దేటపఱుప! స. నా. కా.

సీ. పరదేశపండిత ప్రవరు లెందఱో కుంద
మును మల్లెగాఁగ వాకొనిరి కృతుల
మబ్బుకబ్బములోన మన సుబ్బరామార్యుఁ
డును కుందమును మల్లెయనియె చెప్పె
నూరికరించిరి, నే. రామదాసుగా
రద్దాని కింక నీ యఱపులేల!
తొలిసిపుచ్చంగ నేస్తుపై- సర్వతంత్రస్వ
తంత్రులవారి ఖైవగ్గిఁగూడ!

పెద్దపెద్దల నిందఱ వెక్కిరింప
నిట్లు పొల్పుష్టఘనుఁడ వీ వెవఁడవోయి!
జ్ఞానలవదుర్విదగ్ధతాగరిమ మెల్ల
తెల్లమొనరించుకొంటివి మల్లెకతన.

ఓయీ స. నా. కా.

కుందముమాటకేమి, మాఘ్యాలే (మాఘమాసికవం మాఘ్యం) మల్లెలని, సర్వతంత్ర స్వతంత్రులు, 'ఉష' లో 'సరవి' పద్యమునకు వ్రాసిన టీకలో, సెలవిచ్చియున్నారు. మఱి అంతకన్న వింతగా మొల్లలు 'మల్లె'లని అంటే 5-వ పుటలో అర్థముఁవ్రాసి యున్నారు. ఇఁక నీవు నీ వావాడి తనమునకు శర్మప్రభృతి పండితులకు క్షమాపణ చెప్పికొందువో లేక శ్రీశాస్త్రిలవారిని 'పాండిత్యపు సున్నగాంష్టలో' చేర్చి ఢాం ఢాం భేరివాయింతువో ఏదో ఒకటి నిశ్చయించుకో.

శా. పార్థక్యంబు నెఱుఁగుజాణనని 'భాంభాం' భేరివాయించుచున్
వ్యర్థాలాపములం గెరల్చితివి సుబ్రహ్మణ్య బ్రహ్మణ్య, స
త్యర్థంబైన భవద్దురాకృత మసహ్యంబయ్యెఁ బ్రాజ్ఞాళికిన్
దీర్ఘక్షేత్రములేఁగి, పాపుకొనుమర్థిన్ సాధునిందాఘమున్.

ఉ. నాలితనానఁ 'బండితుఁడు' 'నాగరకుం' డను పెద్దపెద్ద నా
మాలుధరించి క్రుమ్మరినమాత్రన పాండితి యబ్బునొక్కొ! గ్రం
థాలు పఠింపఁగావలయుఁ దద్జ్ఞపదంబులు కొల్వఁగావలెన్
జాల కృషిం బొనర్పవలెఁ జక్కఁగ లోకమెఱుంగఁగావలెన్.

గీ. ఒండుకడ నేవియో కొన్ని కొండగుర్తు
లనుగ్రహించినమాత్రఁ జాలదు, ప్రశస్త
కవులఁ బల్వురభజియించి కావ్యమార్గ
ముల రహస్యములనెఱుంగ వలయునోయి!

ఆ. వె. ఇతరకవుల కృతులనీక్షింపకున్నను
పూర్వకృతుల జోలిపోవకున్నఁ
జదివియుండరాదె సరవి వేంకటరాయ
పృథ్వీదేవ కృతులనేని నీవు?

గీ. 'దైత్య' 'దానవు' లను నభేదముగ వాడు
లీల సుకవులు మొల్లమల్లెలను వాడు
చుందురనుట నెఱుంగక బొందఁబడితి
వెఱుఁగు మిప్పుడైన మునిఁగిపోయినది లేదు.

మ. సకలాంశంబు లెఱింగి దిద్దఁదగు శాస్త్రజ్ఞాన మున్నట్లు కొం
కక, బింకం బలరార, నేవియొ కుశంకల్ చేసి, నన్ దిట్టి, యూ
రక వాపోయితి వేమి యయ్యెఁ దుది నీ ప్రారబ్ధకర్మం బిసీ!
వికటాత్ముండవు నీవు నీ కెసఁగునే విద్వత్తయున్ సత్తయున్?

ఓ యీా, నీ 'తోడుదొంగతనాల' ను నీ పేరనే ప్రకటించుకొని యున్నచో నెంత బాగుగ నుండెడిది. నీవు 'ఫలానా' యని తెలిసియున్నచో నీకుఁ దగిన గౌరవమును నీకును జూపియుందురుగదా! ఇట్టు 'నిర్మొగ మాటముగా' విచారించి యుండవుగదా! దొంగబ్రదు కెవ్వనికైనను సుఖకరము కాదు సుమా! 'దొంగతన' మని- 'తోడుదొంగతనా' లని యితరులను వెక్కిరింపనీవే- అసలు దొంగతనమునకు పాలుపడి మూలల కీఁగుట కంటే హేయమేమి యుండును; నిన్ను లోకు లే మందురో యెఱుఁగుదువా? బురకావాలా విమర్శకుఁడా!

మ. 'సరకా వంతయు లేక లేకిగ విమర్శల్ గిల్కుచున్, భీతిచే
బురకా దాలిచి మ్రిగ్గు భీరుఁడును, అబ్బో నేఁడు తానొక్క నా
గరకాచార్యుఁడె సింహపట్టనమునన్, గాకేమి! విద్వాంసు లె
ల్లరు నీ భీరువు జోలి యిప్డు మన కేలా యం చుపేక్షింపఁగన్'

అనియుందురు. కాఁబట్టి,

ఆ. వె. వారి వీరి వెనుకఁ జేరి కాఱులు కూయు
పాడుపని య దేల? బయటఁ బడుము
ఎన్ని నాళ్లు డాఁగె దీ రీతిగాఁ దెర
పాసి రాఁగదయ్య! దాసరయ్య!

చ. చెడుతలపోఁతలన్, వెడఁగుఁజేఁతలు సేసి తుదిన్ భయంబునన్
మడుఁగున డాఁగె మున్ దురభిమానధనుండు సుయోధనుం డహో
చెడు 'తలపోఁత'-లన్ వెడఁగుఁజేఁతలు చేసిన నీవు, భీతమై
నడఁగితె మాఱుపేరిమడు వందు నశేష మనీషిదూషకా!

క. భయ మేలా బయటికిరా,
నయమార్గమ్మునను బుధులు నలుగురు విన, వా

న్యాయచర్చ చేసి కొంచము
జయము పరాజయము లేదు చదువుల లోనన్.

క. సర్వజ్ఞుఁడు లేఁ డొక్కఁడు
సర్వజగత్తునను పంచజనులందు. వృథా
గర్వించు టెం;- 'న హి సర్వ
స్సర్వం జానాతి' యనువచనముల్ వినవే?

మ. కవులన్ రేఁచి వివాదముల్ సలుపు వాక్యాంచాతి నీ కున్న చో
చవియున్ సారము గల్గు మార్గమున వైశద్యంబు దీపింపఁ గా
వ్య విమర్శల్ పొనరింపఁగాఁ దగును గా కాత్యేతరుల్ వోలె నీ
వచఃపంకము జల్లు లాడఁ దగునే సారజ్ఞ లిప్సీ యనన్!

మ. కవులం దిట్టి నిజ ప్రశస్తి నిటు ప్రఖ్యాపించు కోఁ జూచు నీ
వ్యవసాయం బది నిష్ఫలం బగు టె కా దత్యంత దుష్కీర్తి సం
క విమర్శ్నం బొనరించి పుచ్చు నిను: ప్రాజ్ఞస్వ్యాహానిందాక్రియా
ప్రవణుల్ శ్రేయము లొంది నారనుచుఁ జెప్పన్ వింటివే యెచ్చటన్

శా. దోషోద్ఘాటన దుష్క్రియా నిష్కృతమౌ దుష్కీర్తితోఁ గన్న నే
భాషాకావ్యము నందుఁ గాని వాసఁగుల్ పాటిల్లవే! మాఘుఁడున్
'హేమామాషి'గఁ దప్పు వ్రాసె, మఱి వ్యాపాతీతవృత్తంబునన్
భాషాభామిని కైనఁ బోవఁ దర మౌనా కావ్యమార్గంబునన్?

శా. దోషం బంచిహిహీ యటంచు కవులన్ దుర్భాషలం బల్క నీ
భాషాభిజ్ఞత, కావ్యకల్పన కళాపాండిత్యముల్, నీదు ని
ర్దోషప్రౌఢవివేకశూరతయు, నేవో, యెట్టివో! రమ్ము నీ
వేషం బిందుక వెళ్లఁ బెట్టు మదియున్ వీక్షింతు మిం తేటికిన్!

శా. 'వోగో' పగ్గ గలట్టి శూరు లఁట నీవో లేక నీ వెన్కవా
రో రంకోయ్ యిటు రండి మాతము కవిత్వోద్యోగముంబూ: వా

కాన్గస్యంబును, దోషశూన్యత, లసచ్ఛైత్య లీపకీపాక మిం
పొరన్ గావ్యము చేయఁగాఁ గలిగి యోగ్యశ్రేణి మెప్పింపఁగన్

మ. నరకాపాకక దూషణోద్ధత ఘనాజ్ఞైపుణ్య మెందేని నా
గరకా, కావ్యవిమర్శ నాఖ్యకును యోగ్యంబౌనె! దూషించు న
మ్మొల కాచార్యపదానికర్హుఁడయి పెంపుంగాంచునే! సుంతయున్
పరకాయింపక చెట్టుపై యకట 'భాంభాం' భేరి వాయించెదే!

మ. వెనుకన్ ముందును జూడ కౌడెవవు నీవే పెద్దవా నేఁటి యా
తెనుఁగుం గబ్బను లెల్ల దిద్దుటకు! నీదే శాసనంబా! సుధీ
ఘనులౌ పెద్దల వాక్యజాల మిటుఁ దార్క్రాణం బగున్ గాక, యే
మని లెక్కించును సత్కవిప్రతతి నీ యధ్వాన్నపుం బల్కులన్!

క. అనువైన తప్పు దొరకిన
ననఁదగు సోల్లుంఠనముల ననవచ్చును గా
కనవసరముగా నకటా
ననుఁ దిట్టితి వేమయా స. నా. కాచార్యా!

క. స్మయ దూషిత వృత్తంబున
భయ మించుక యైన లేక పడఁ దిట్టెదవే
అయథార్థ దోషములకున్
నయవిద్యాదూర గుండ! నాగరకుండా!

శా. నీ జన్మంబున నీవు నీ పలుకులన్ నెగ్గించుకో నేర వే
దో జన్మాంతర వాసనన్ జదివి తేమో గాని, సద్వాదవి
ద్యా జాగ్రత్త లభింపలేను, పయిఁగా ధార్ష్ట్యంబు నిన్ గ్రమ్మెనే
యోజన్ గావ్య విమర్శ భాగ్య మది నీ కొప్పారు నిప్పాటునన్!

ఆ. వె. ఎగిరి వెక్కిరించి యిగిలించు కొన్నట్టు
కాదు, కవులతోడి కతలు వెతలు

కవులఁ జెనక నూరకయ పోవునా? అది
"కుమ్మ రడుసుగాదు; కమ్మ రడుసు"

ఆ. వె. తప్పుపనికి ఫలము తత్ క్షణమే కల్గ
దనుభవమున కద్ది యావల వచ్చు
'కుడుము తిన్న నాఁడె గుగ్గిళ్ళు వెళ్ళవు'నోరి
విశ్వ దాభి రామ వినర వేమ?

స. నా. కౌచార్యా,

చ. కపటపు దారికై వగవఁ గాఁబలికే దిఁకమీఁద నైన, నీ
దుడుకుఁదనంబు మానుకొని తొంటిపగల్ దిగఁద్రావి, బుద్ధిమం
తుఁడవయి, సత్కవీశ్వరులతో వినయమ్మునఁ జెల్మి చేసికొ
మ్మెడఁద భయంబు లేక సుఖియింతువు మంతువు మాసిపోవఁగన్.

స. నా. కుఁడా,

ఏటి కోరి భారతమునుండి—

ఉ. "కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం
బోలుచుఁ బేర్చి యాద్రుపద భూపసుతుల్ సమయించె, వేదనన్
బోలఁగ రోఁజఁగాఁ బలుమఱుం బొరలంబడి లాలఁగ్రక్కు—న
వ్వాలు మగండు వాక్పరిభవంబు దలంచుచుఁ గ్రౌర్యధుర్యుఁడై"

అనే పద్యాన్ని సంపాదించుకొని—నీ 'తోడుదొంగతనాల' ముఖమున ముద్రించుకొంటివే, ఆపద్యాన్ని ఇప్పుడు అన్వయించుకొని చూచుకో—పద పదమును—అన్నివిధాల నీ కతికియున్నదో లేదో ఆలోచించుకో.—

"శర్మగారన్న నదియే మోజంకు నాకు"

అని వ్రాసికొన్నావే. అదియేమి జంకు? నీకుఁ బ్రయోగజ్ఞానముంటే, ఆక్షేపణలు నిలుస్తాయని దిటవుంటే, పండితులంటే జంకు ఎందుకు! అంత జంకుకలవాఁడవు పాప మీపని యెందుకు పెట్టుకొన్నావు?

‘‘పిచ్చికవితన్ను నది  యేమి మెచ్చునాను’’

అని యొక కవిత్వముకూడా చెప్పికొన్నావే, దానిభావమేమి? ఆకాస్త వాక్యంలో సంధిదోషమా? నీవు నిజముగా దైవవంచితుడవే; పిచ్చికవి తన్నుతే(=తన్నితే) అదనీకు మెచ్చా! మెచ్చైనవో ఇటువంటివే యింకా కొన్ని ఆక్షేపణలు వెదకుము; తరువాత ‘‘ముప్పికొమ్ము పగ్గా’’ రచియించుకొందువుగాని, ఈజన్మానికల్లా యిదేనా యేమి నీవు తొలిసారి ‘కవికట్టడం?’ బలే కవిత్వ మోయ్! మ్యూజియంలో పెట్టికొ పాతడగినది!

నీవు దైవవంచితుడవు—కావున నీవాంఛిత నిన్నే బలిగొన్నది.

‘‘చాలు ఎందుకు ఇంకా పెంచడం—‘‘ఆహా ఏమి నాకొలగతి! ఆహా ఏమి నాకొలగతి! ప్రియమనసుచు కావ్యమును దుర్మార్గముగా దూషింపనేల? నాకీగతి పట్టనేల! అమ్మాగ్రదేశ ఆంధ్ర! అకాల దేశ యూనివర్సిటీ! నాథా త్వయము మన్నించండి తల్లీ!’’ అని క్షమాపణచేసుకో. ఈనాటికి పో.

ములుమూడి నారాయణరెడ్డి

# కౌలగతి తలపోతలగతి-

## 3. మందలింపు

ము. నా. రెడ్డిగారూ,

మీ కౌలగతి తలపోతలగతి తుదకెట్లు తెల్లవారినదో చూచితిరా! ఈపాడు తలపోతలు తమ కులమర్యాదకు తగినవికావు. మీకులము వారు (పంటకాఁపులు) నాఁటివారు, నేఁటివారును కవిపోషకులై ఘనతఁ గాంచినవారు. పండితపోషకులై ప్రతిష్ఠ నార్జించినవారు. అట్టిపవిత్రవంశమునఁ బుట్టి మీరిట్టుల పండిత దూషణకు పాల్పడుట వింతగా నున్నది. మేటి విమర్శకుఁడని పేరుపడిన శ్రీగిడుగు పండితుని నిరసించితిరి. కవితానైపుణ్యములకుఁ బెద్దపేరుగన్న శ్రీశర్మగారిని నిందించితిరి. విశ్వవిఖ్యాత విద్వత్కవియై, శతావధానియై వాసికెక్కిన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిని దిట్టితిరి. నిజగురువులను భూషించుటకు పరపండితులను దూషించుట మంచి పద్ధతికాదు. గురుభూషణమువలని పుణ్యముకంటెను, పరదూషణము వలనిపాపము పదిరెట్లు హెచ్చు. ప్రాజ్ఞులనడిగి చూడుఁడు. సాధునింద శ్రేయోహానికి మూలము. పోనిండు.

నేనొక్కమాట యడిగెదను: మీరు శ్రీవేంకటశాస్త్రిగారిని దిట్టితిరిగదా? దానికి కారణమేమేని కలదా? వారికి మీ వివాదముతో సంబంధము కలదా? లేదు. మిమ్మెప్పుడైనను దిట్టియుండిరా? లేదు. మీగురువుల నెప్పుడేని యాక్షేపించిరా? లేదు. ఏదియులేక యేల దిట్టితిరి?

ఇఁక నా మాట: రెడ్డిపుంగవా, నెల్లూరు మండలమున సరసులై,

సంపన్న గృహస్థులై పేరెన్నిక గన్న రెడ్డి ప్రముఖులతో పలువురితో నాకు పరిచయము కలదు. కాని మీ మొగము నేనెన్నఁడును చూచి యెఱుఁగను చూచియే యుందు నేమోగాని, మీరు 'ఫలానా' యని నాకీనాఁటికిని తెలియదు. మిమ్ము గుఱించి యెన్నఁడుగాని కానిమాటలు నేనాడియు నుండలేదు కదా? మీరు నన్ను ద్వేషించుటకు కారణమేమి! ఏమియును లేదు. మఱి నిష్కారణముగా అస్మద్గురువర్యులను శ్రీశాస్త్రిగారిని తిట్టుటయును స. నా. కాచార్యుని చేత నన్నుఁదిట్టించి ఆతిట్టు వ్రాఁతను వ్యయ ప్రయాసములకోర్చి యొక గ్రంథముగా ప్రఖ్యాపించుటయు నేమి యోగ్యమయిన పని? నా దడఁచుట రెడ్డితనముగాని తగాదాలు పెంచి తమాషాలు చూచుటరెడ్డితనమా? కాదే! పెద్దలేమన్నారు?

"కాదన్నవాఁడు కరణము,
వాదడఁచినవాఁడు రెడ్డి"

అనికదా యన్నారు? తగవెఱిఁగి ధర్మములను నిలుపవలసిన రెడ్డే తగవుమాలినదారి త్రొక్కి నీచముగా తిట్టను తిట్టించనుగూడ పాలుపడిన నిఁక నన వలసినదేమున్నది? కంచెయే చేను మేసిన కాఁపేమి చేయఁగలఁడు?

కాలగతితలపోతలు— మీసొంతమా? స. నా. కాచార్యతో జాయంటూ? జాయింటు కాకపోతే—* పీఠికలో మీరు వ్రాసికొన్న మేరకు, ఆతలపోతల కర్మమునకు మీ రేకాధికారులై యుండఁగా, ఆ 'స. నా. కాచార్య,

"ఆహా! ఏమి యీ కాలగతి. ఆహా ఏమి యీ కాలగతి!...మఱి
యీలాగు ఒప్పురికిస్తారేమే అమ్మా, దేవీ, ఆంధ్రీ! అకా౯
దేవీ యూనివర్సిటీ!"—

---

* "రాజ్యాంగ వర్ణాశ్రమ సారస్వత ఆత్మతత్త్వాది సకలమందును నేటి కాలగతిని, అంతలో చింతాదోధూయమానమును, అంతలో ప్రత్యాశోచ్ఛ్వసమానమును అగుచిత్తముతో తలపోసుకొనుచుందును."

—కా. త.

అని తన అప్పను- అక్కను గూడ తలఁచుకొని, అపసోపాలతో అంగలార్చుట కధికార మెక్కడిది?

రెడ్డికులాలంకారమా!

నామాటవిని ఆయాచార్యుని బయటికి గెంటుము. లేకున్నచో మీయిద్దరిచేతలే 'తోడుదొంగతనా' లని లోకముముడి వేయును. 'నాగరకాచార్యునిపేర నారాయణరెడ్డి యే యీతిట్టువ్రాఁత వ్రాసియుండు' నని కొంద అనుమానించుచున్నారు. 'కాదు కాదు. కాలగతితలపోతల వ్రాఁతలన్నియు నాగరకాచార్యునివే. నారాయణరెడ్డికి ఆమాత్రపు ప్రజ్ఞ యెక్కడిది?' అని కొందఱనుచున్నారు. నిజమేమో నీవే చెప్పవలెను.

ఆ నాగరకుఁడెవఁడో ధూర్తుఁడు. అతిథిచేత పామును కొట్టించినట్లు నీచేత పండితులను తిట్టించుచున్నాఁడు. అతనిని లోకమునకు పట్టియిచ్చితివా నీవు మేలుఁపొందెదవు; లేదా యావజ్జీవము పండిత దూషకాపయశోభారమును మెడలు విఱుగ మోయవలసినవాఁడ వగుదువు.

విద్యావివాదములలోఁ దిట్టుటకొని తిట్లుతినుట-గాని తప్పుగాదందువా! కాకపోవుఁగాక, ఆ తిట్టుకొనుటయందును ఔచిత్యముండవలెను. నాగరకత-నాజూకు-ఉండవలెను. సభ్యత, సౌకుమార్యము, నుండవలెను. రసికత రామణీయకము నుండవలెను. సత్యదూరముగాని చమత్కారము, మర్యాదకు ఎడయని మాటలపొందిక, మనసును రంజించు మంచితనము, పండితజనోచితమైన భాషాప్రాగల్భ్యము, ప్రౌఢజనోచితమైన భావగాంభీర్యము నుండవలెను. అదిలేనినాఁడు పండితవివాదములకును, పామరుల బండుబూతులకును భేద మేమి? మీతిట్టువ్రాఁత నీచజనోచితము గాని విద్వజ్జనోచితము గాదు. తక్కిన కథలు నా కక్కఱలేదు. 'జితకాశి' 'దేవాదేవేషు' లను గూర్చి ఒకమాట అడిగెదను-జెప్పుండు.

'జితకాశి' తప్పైనదో-'తప్పు' అనవలసినదే గాని తిట్టవలసినపనియే మి? ఆ తప్పైనను తాము కనిపెట్టిరా? ఎన్నడో ఏడేండ్లక్రిందట నెవ్వరో తప్పన్నదానిని పట్టుకొని తాము తిట్టుటలో నర్థమేమి? ఔచిత్యమేమి తప్పును పట్టినవాఁడు ధార్ష్ట్యమున సోల్లుంఠనములు పలికినను పలుకవచ్చు నేమో గాని నడిమియింటివారికి నాలుకపొడిమాటలేల? మీయధికారమేమి! శతాధికగ్రంథకర్తలై శతావధానులై జగజ్జేగీయమానయశోవిభూషితులై యలరారు వేంకటశాస్త్రులవారిని 'దేవాదేవేషు' అని తిట్టుటయేమి?

శా. ఏదే నొక్కఁడొసంగు కావ్యమున సెందేఁ దోఁచుఁగా కంతతో
నే దివ్యాశుశతావధానకవితా నిస్త్రప్రతిష్ఠాయుతున్
వేదాధీతపవిత్రు వేంకటకవిన్ విద్యాలవాలంబు- 'దే
వాదేవే'షని చెప్ప నర్హుఁడవు నీవా! రెడ్డి నారాయణా!

మ. అటు గద్వాలిని చెన్నపట్టనము మఱ్యంగల్గుదేశంబునన్
పటుపాండిత్యవిశేషభూషిత కవిత్వప్రక్రియాప్రౌఢి వి
స్ఫుటకీర్తింగనినట్టి మేటికవి, విద్వద్గర్వప్రభావాఢ్యు, వేం
కటశాస్త్రిన్ దెగిట్టి సింహపురివిఖ్యాతిం బ్రపంచించితే!

చ. అనితరసాధ్యకావ్యకరణార్జిత దుర్జయకీర్తి, నిర్జితా
వినయ విపశ్చిదాళి, పృథివీపతి పూజితపాదపద్ముఁ డ
య్యనఘుఁడు, తత్పదద్వయికి నర్చనసేయుటకైనఁ జాల వీ
వన విన రాని చెడ్డనుడు లక్కట! యెక్కరణిన్ లిఖించితో!

ఉ. కావ్యముమాటయేల? సరిగా నొకవాక్యమునైన వ్రాయతే
వవ్యయకీర్తిశోభిత మహాకవులన్ మిఱులంగ దూఱెదే.
నీ వ్యవసాయ మార్గ్యజననింద్య మెఱుంగవు నీవు! ప్రాజ్ఞసం
భావ్యము కాని యీమనుసువర్తన మెట్టుల నీకు గిట్టెనో!

చ. పనియును పాటలే కదరి పాటునఁ బ్రాజ్ఞులఁ బెట్టి యంత స
జ్జనకృతగర్హకున్ జయిపఁజాలక కుందెదవయ్యో! యశక్తమ
జ్జనుని విధంబు దోఁపఁగను: రడ్డి! బుధుండవు నీ వెఱుంగవే?
అని యనిపించుకొంట సరియా మరియాద గలట్టివానికిన్?

విద్యావిషయము కావున అడుగుచున్నాను.—

సీతారామశాస్త్రి—

క. లేఁ డని, కాఁ డని, రాఁ డని
కూడని వాదములఁ దప్పుకొనుటే గానీ
యేఁడీ బదులాడిన మోన
గాఁ డల యానాఁటి దోషకాండంబునకున్?

## తెలిఁగింపులు

క. తెలిఁగింపుల దోషంబులు
తలఁగింపఁగరాని వని యతం డని నాఁ గదా!
తలఁగించి గురునికీరితి
వెలిఁగించినదేది మీరు విద్యావిదులై!

## మదీయము

గీ. అల 'మదీయము' నన్వాయ మరయఁగఁ 'బ్రౌఢ
బాలవాక్యంబు' 'మందరపర్వతంబు'
'చుట్టుతిరుగుట' అని యేమొ నోచె చెప్పి
తది సమాధానమా! చెప్పవయ్య ఘనుఁడ;

## శుద్ధముత్తెములు

ఆ. వె. శుద్ధముత్తెములను సొంతమ్ముగాఁ జేసి

నారు గురువు లనుట న్యాయ్య మగునె!
అట్టిపనికి యుష్మ దాచార్యునకు నధి
కార మెవ్వ రిచ్చినారు చెప్పుఁడ!

గీ. భాష నున్న యసాధుశబ్దముల కెట్లొ
గతులు గల్పించినారు వ్యాకర్త లంతె
కాని, అట్టి యపభ్రంశ కల్పనములు
చేయవచ్చు నటంచును జెప్పినారె!

ఆ. వె. శుద్ధముక్త ప్రక్రి 'శుద్ధముత్తం' బైన
శుద్ధమూర్ధ్ని భవము 'శుద్ధమొఱకు';
దారి చెడినమీఁద తప్పేమి! యొప్పేమి?
శాస్త్రమేమి? దాని చగ్గ్రయేమి?

ఉరి—వల

గీ. 'ఉరి' కి 'వల' యను జెల్లు 'వాగుర' నిజంబె,
అంతమాత్రేన నురి వల యాగుట యెట్లు!
మిత్రునకు సూర్యునకుఁ జెల్లు మిత్ర పదము
కానఁ జెలికాఁడునా సూర్యుఁడౌనటయ్య!

గీ. అకట! 'సూతక' పదము పుట్టుకకుఁ జావు
నకును జెల్లును గాన పుట్టుకయుఁ జావు
నొక్కటే యని వాదింతువో! బళా! బ
ళా!! యదెక్కడి చదువు నారాయణుండ!

క. తెలుగు నిఘంటువుఁ జూడం
గల తెలివియు లేని వట్టి గడబిడ లేలా?
'తల' లేని 'పోత' లేలా?
కలకల నవ్వెదరు పిల్లకాయలు మిమ్ముల్.

## క్రియ

* క. లలి, క్రియ, గమనిక యను పద
ములు - వలె, కైవడిని, చాయ, పోలిక యను ప
లుకులవలె తెలుఁగుపదము లవి;
తలపూర్పఁగ లేవు సంస్కృతసమాసములన్.

గీ. మాధవీవలె - మాధవీమాడ్కి - మాధ
వీ తెఱంగున - మాధవీవీఁక - మాధ
వీరహి నినన నొప్పఁగా వెలయు నేని
మాధవీక్రియ నన నవమాన మేల?

గీ. ‡ క్రియ - ఇవార్థంబునందు సంస్కృత మటంచు
నీకు శ. ర. కర్త చెప్పెనా నిక్కువముగ?
అతని పల్కుల తీరవగతము కాక
అవక తవకైన వా రహస్యంబు తెలిసె.

చంద్రరేఖావిలాప సారంగధరాదులలో 'క్రియ' యుండుఁగాక. ఆక్రియ శాస్త్రిగారి కుపాదేయమగునా! ఆగ్రంథములలోని వ్యాకరణవిరుద్ధ ప్రయోగముల కెల్ల వారు తలయొగ్గెడివారేనా?

గీ. 'భారతేతర కావ్యప్రపంచభాష
కాదు గ్రాహ్యంబు కా' దన్న ఘనులు తుదకు
చంద్రరేఖావిలాపంబు శరణు చొచ్చి
మనుటకంటెను మఱి కసుమాలమేది?

---

* శుద్ధాంధ్ర నిఘంటువు (లక్ష్మీనారాయణీయము) చూచుకొ.

‡ క్రియ=(పన్నెండవ అర్థము.) విధము (కపటియర్థమునకు తెనుఁగున మాత్రము ప్రయోగము.) శబ్దరత్నాకరము.

ఆ. వె. ఒక్క యలంతి 'క్రియ' కు కక్కజితింబడి
'చంద్రరేఖ' పదము శరణ మనుట
న్యాయ్య మగునె? యల సనాతన నియమ ని
ష్ఠాగరిష్ఠు లైన నాగరులకు?

క. 'శారంగధర' ను తన మన
సారంగను సుస్మరించునా? కీ. శే. వే.
వే. రాయఁడు? 'గురురాయఁడు'
భారత కావ్యైక శరణ పండితుఁడు గదా!

గీ. తతిని గమనించుచు రసప్రధానబుద్ధి
వ్యాకృతిని లెక్కసేయని ప్రౌఢకవుల
పలుకులకు స్వాగతముఁజెప్పఁ బొలుపడుట
అల్ల 'గిడుగుకు' 'దాసోహ' మనుట కాదె!

క. ఇది తెలుఁగుపదము, సంస్కృత
పద మిది, యని తెలిసికొనెడు ప్రజ్ఞయు లేదే
కుదురుగ నుండక యేటికి
పదరుట, పగదెచ్చుకొనుట, పదుగురితోడన్?

క. 'బాల' మ్మని-'ప్రౌఢ' మ్మని
బేలల బెదరించి నట్లు బెదరించెదు మీ
యాలరితనమును పండితు
లేలా సహియింత్రు? విడుతు రేలా మిమ్మున్!

రాజు-రాజధాని

ఉ. బత్తెము గట్టియిచ్చి బలవంతముగా నృపు రాజధానికిన్
బుత్తు మటంచుఁ బల్కితిరి, పుచ్చెద రేమిటి? మీ కిదేటి యు

స్మర్తత? ఆ నృపుండు తన మానసమున హరియించినట్టి యా
పుత్త్రుడిబొమ్మ నౌర! విడి పోవునె మీ రొకలక్ష యిచ్చినన్!

క. కత తీ రెఱుఁగమిచేఁ బడు
వెత లంతయు కాకయున్న వివిధోద్దేశ
ప్రతులం జెప్పింతుము మే
మతనిం బంపింతు మందురా? బళి! బళిరా!!

ఉ. * బత్తెపు రాత్రి క్రిందఁ గల పంక్తి పఠించినఁ జాలు, రాజు తా
నత్తఱిఁ బోవఁగాఁ దగిన యట్టి ప్రదేశము రాజధానియో,
కోర్కెగఁ దానుకోరిన శకుంతల యున్న తపోవనంబొ, వి
ద్వత్తములార, మీ కెఱుఁగవచ్చును, చచ్చును హాద మంతతోన్.

ధీవరాగ్రణీ,

ఈ వెలమకన్నివారి యాక్షేపణల సందర్భములో బోలెఁడంత సమాధానము చెప్పవలసియుండఁగాఁ జెప్పనుచేతగాక, ధ. వెం. సుబ్బయ్యగారు—

"తమదొంగతనాన్ని కమ్మకోడానికిన్ని, సత్యజిజ్ఞాసులో కాన్ని ఆనందాన్వేషిజనాన్ని, 'ఏమీ! మోసంచేస్తావా'—అనిపట్టిస్తూ తన్ను పట్టి

* విదూ:— అట్లయిన నిఁక నేమి! రాజధానికి బత్తెము కట్టుకో, నాకు తెలిసినది. నీ విపు డీతపోవనమును నీ యుద్యానవనమును జేసికొంటివి.

రాజు:— తపస్వులు కొంద ఱిచటనున్న నన్నుఁ దెలిసికొనియున్నారు. ఊహించిచూడుము— ఏ వ్యాజనమున నింకొకమారైన నాశ్రమమునఁ బ్రవేశింపఁగలను?

— వే. వేం. శాకుంతలము.

కట్టను సంభ్రమించేదాన్ని అదరగొట్టి ఉడాయించడానికిన్ని – వేసిన లగువు" చూచారా? ఇదుగో ఆలగువు–

"మచ్చునకుఁ గొన్నియాక్షేపములకు మేము సమాధానము
చెప్పఁగనే వెలమకన్ని ప్రతిపక్షి వాగ్బంధన మయ్యెను.
అతని శకము పూర్తియయ్యెను"? తత్త్వబోధ.

ఈలాటి లగువులు విద్యావివాదాల్లో విద్వాంసుల దగ్గర పనికి రావని ఆ సుబ్బయ్యగారికి మీరైనా తెలియఁజెప్పండి. రెడ్డిగారూ; సరే, ఆయన సామర్థ్యమేమో తెలిసిపోయింది గదా! పై యాక్షేపములకు మీ యాస్థానపండితుఁడో, పండితురాలో అయిన– 'ఆ. స. నా. కొచార్య' రేమైనా సమాధానములు చెప్పనేమో చెప్పించండి, పండితలోకము విం టుంది. తిట్టుకుమాత్రము 144 యిప్పించండి. తర్వాత తమాషా చూడండి.

పరనింద

సీ. 'మాశాస్త్రి కేవల మల్లినాథు' డటంచుఁ
బొగడుకో మిత్రులఁ దెగడనేల?
నీ దేశికుండు పాణిని యైన నౌఁగాక
పరపండితులఁ దేలఁ జులుకనేల?
'అస్మద్గురుండు బృహస్పతి' యని సభఁ
జెప్పికో మిత్రులఁ జెనకనేల?
నీ యుపాధ్యాయు వర్ణించుకొ మ్మొక్కరి
పెంపుసొంపుల నిరసింపనేల!

ఒకరి గొప్పచేయ నొక్కరి పేరెత్తి
కొంచెపఱచు టెల్ల గొప్పతప్పు;
తప్పు నొప్పు నెఱుఁగఁదగు తెల్వియును లేని
మెప్పు మెచ్చు చాల ముప్పుతెచ్చు.

ఆ. వె. ఒకఁడు వ్రేలుచూప నొక్కఁడు కొల్లాపు
నుక్విజనులకెల్ల నున్నగుణమె,
ఒకటి మీరు తిట్ట నొకటికిపది మిమ్ముఁ
బట్టి తిట్టుఁ దిట్టువడిన యతఁడు.

గీ. చెళ్ళపిళ్ళాన్వయుని మీరు చెనకకున్న
బలిసి మీశాస్త్రిఁ దిట్టునే వెలమకన్ని?
ఆతని తప్పేమి? న్యాయమ్ము నరసిచూడఁ
బట్టి తిట్టించు తప్పు మీదేగదయ్య?

గీ. పేరుపెట్టితిట్ట నేరమా నని పట్టి
మొద్దుకైనఁ దెలియుఁ, బెద్దచదువు
చదువుకొంటి మనుచు సంబరపడువారి
కేల తెలియు? దదియె చాలవింత!

క. తప్పులు కలిగినమాత్రనె
తప్పడు మాటలను దిట్టఁదగునా కవులా?
గొప్పతనము చెడకుండఁగ
దెప్పుము తెలివియును తేట తేనవ యున్నన్.

## యద్దేవ

క. కావలె నని మును వ్రాసిన
'దేవాదేవేషు' జడిసి దిద్దితివా? 'య
ద్దేవ' యని? నీదు కొతర
భావము బయలయ్యెఁగాక ఫల మేమొకొ వెళ్ళా!

క. బలువగు 'దేవాదేవే
షు' తొలఁగెను గాని వాని వ్రోటున- 'యద్దే

వలు' చేరి గురుని నొంచుట
తెలిసికొనఁగ లేకపోయితే రెడ్డిసుధీ!

ఉ. ధీవిభవంబునన్ దెలుఁగుదేశపుఁ బెద్దలలోనఁ బెద్ద సం
భావన లంది, యెన్నఁదగుపద్ధతి నుద్ధతిఁజూపి కీర్తికిన్
దావలమైన పండితుని, భట్టుని, వేంకటరాయశాస్త్రి 'యు
ద్దేవ'ల పాలుచేసితిరె! ధీరులు శిష్యులు నల్వురేకమై!

చ. ప్రలి తన కెంపులేక, తనవారలకైనను చేరరాక, యు
ద్ధతిమెయి మన్న 'శాస్త్రిపులి' తద్దయు హేళన కగ్గమయ్యెనేఁ
డతితరమైన మీకు పరహంకృతి యొక్కఁడె కారణంబుగా
కితరము హేతువేమి! వచియింపుము, రెడ్డికులావతంసమా!

క. 'రాయయ్య'యు 'గప్పయ్య' యు
నై యొకతాళికిని బాత్రమైపోయెఁగదా!
మీ యయ్య! యెవరికతమున
నో యించుక చెప్పవయ్య యోరెడ్డిసుధీ!

క. తగని తలపోతలకు దిగి
తెగిటివి పండితులఁ గవులఁ దిట్టగ నీ కా
లగతి తలపోతల గతికి
నగుచున్నది జగ మహో! ము. నా. రెడ్డి సుధీ!

భుజంగ ప్రయాతము

ఘనుల్ పండితుల్ చూచి గర్వాంధ్యమ్మై గర్వాంధ
మ్మైనాఁ దిట్టిదేబిట్టు పూజ్యాళినోహో!
ము. నా. రెడ్డి! నీ తీరు పోవంగఁబోవం
గ నానాఁటికిన్ దీసి కట్టాయెఁ దోఁచెన్.

ఘనారావసంకాశ గంభీరవాగ్గుం
భనప్రీత నానాక్షమానాథ విద్వ
జ్జనస్తోముఁడౌ శాస్త్రిచంద్రున్ హసింతే!
ము. నా. రెడ్డి చాల్ చాలు- పోవయ్యా పో పో.

క. తిట్టుట చాలక కవులను
దిట్టించితి వదియు నొక్క-దీక్షయొ నీకున్?
తిట్టను తిట్టించుటకును
పట్టంబును గట్టుకొంటివా నీవు? రెడ్డీ.

క. తిట్టించితివి సరే, ఆ
తిట్టిన కాపురుషుఁ డెవఁడో తిన్నఁగ మాకున్
జట్టిమ్ము, వాని భరతము
పట్టింతుము మేము నీకు భారముతొలఁగున్.

వ. పరకాఁడై నినుఁ దిప్పఁగాఁబోవఁగె నిర్మర్యాదమార్గాన 'నా
గరకాచార్యుఁ'డన్న పేర నెవఁడో కాని శఠాత్ముండు; కా
వ్య రసాస్వాదపరాఙ్ముఖుం డయిన యా వాచాలునిన్ నమ్మి నీ
పరు వెల్లన్ జెడఁగొట్టుకొంటి వకటా! పాపంబు దీపింపఁగన్.

ఆ. వె. వాదశక్తి లేదు, వాక్శుద్ధియును లేదు
వాక్యమును గుదుర్చు వహియు లేదు
వాని నమ్మి పెద్దవాదంబునకు దిగి
వాసి చెఱచుకొందువా? ఘనుండ!

గీ. దూర మారాన నుండి యందోఱును 'మూర్ఖ'
'దూష' మనువారె నీ వెంట దూఁక రెవరు;
దూకితివి నీవు, నీ పేరు దూసిపోయె,
నెవరు చెడిపోయి రిప్డు నీవే గదయ్యా?

విద్వద్రెడ్డీ,

నీకు నిజముగా విద్వత్తయున్నచో, విద్వాంసులు మెచ్చు విమర్శను వ్రాయుము, కవితాధారయున్నచో, కమ్మని కావ్యాలు వ్రాసి కళావిల్లోకమును మెచ్చింపుము. విద్యాపోషకుఁడవైనచో సత్కవులను, సత్పండితులను పోషించి, సత్కావ్యములను సద్విమర్శలను వ్రాయించి ప్రఖ్యాపించి, ప్రఖ్యాతి గడించుకొనుము; అదిలోకము మెచ్చుపని. అంతేకాని, అకీర్త్యాకరములును, అనిష్టాపాదకములును నగు- 'తిట్లకలపోతల'- వంటి పాడువ్రాఁతలను వ్రాయకుము- వ్రాయించి ప్రఖ్యాపింపకుము. అది తగనిపని. తగనిపనులకై ధనమును తగులవేసికొనుట ప్రాజ్ఞపద్ధతి కాదు.

ప్రథమ 'కళాప్రపూర్ణు'ల యందు నాకెట్టి ద్వేషమునులేదు. ద్వేషమే కాదు. "శాస్త్రిగారొకరే ప్రపంచానికెల్ల పండితుఁడు. లోకానికంతా ఆయన యొక్కఁడే కవి. ఆయనగారు పోయినందువలన ఆంధ్రలోకము పండితశూన్యమైనది. కవితాకాంత అగతికయైనది. 'నిర్వీర ముర్వీతలం'......" అనిపించే గుడ్డియభిమానమును లేదు. పండితులైనవారియెడ నెట్టి యభిమానముండవలెనో అట్టి అభిమానమే యుండెడిది. కాని, మీరు మాగురువుల నేనాఁడు నిష్కారణముగా నిందించినారో, ఆనాఁడే ఆయభిమానము పలుచవాఱినది. మీరొకవంక మా శాస్త్రిగారిని అకారణముగా తిట్టుచుండఁగా, నాకు మీ శాస్త్రిగారియెడ నభిమానముండునా? ఉండవచ్చునా? మీకు మా శాస్త్రిగారియెడ నెట్టిభావమో- మీశాస్త్రిగారియెడ నాకును అట్టిభావమే, "ఈవూరికి ఆవూరెంత దూరమో ఆవూరికి యీవూరూ అంతేదూరము"— ఇంకను, మీరు దుడుకుపడి మాగురువును దూషించితిరిగాని, మీ గురువును నేనెన్నఁడుఁగాని దూషింపలేదు. పైఁగా భూషించియున్నాను. ఆభూషణము (మీవలన) దేనికో చేసిన సింగారమైపోయినఁ బోయెఁగాక!

పెక్కుమాటలేటికి? మీరు మీదేశికుని గొప్పచేసికొనుట కితర

పండితులను హేళనచేసి – తప్పులు పెట్టి – 'దేవాదేవేషు' వంటి తిట్లు తిట్టుటు మానుకొనుడు. అదియొక్కటి మానుకొంటిరా; మనమంద అమును మిత్రులమే, శాస్త్రికి ప్రియులమే. తిరుపతి వేంకటకవులకును ప్రియులమే. తద్వాఙ్మయ సేవాభినందకులమే. భాషాసేవకులమే. మనమంతా భాయ్-భాయ్.

మనసులోని మాట మనవిచేసినాను. మన్నించితిరా, మంచివారు. మన్నింపరా, మఱీమంచివారే.

ఒక్కమాట:— నేను 'కాలగతి తలపోతలగతి'లో, మంచి నస పట్లలో effect కొఱకూ, మీ – 'కాలగతి' వ్రాత కనుగుణముగానుండుట కొఱకూ వాడుకభాషనే వాడాను. అసంగతిని కొస్త మీ స. నా. కొచార్యకున్నూ. భ. వెం. సుబ్బయ్యగారికిన్ని తెలియఁజెప్పండి. అవేం కారణంగా వారు మల్లీ నోరు చేసుకొంటారేమో!

మీరు కొంచెము పెద్దమనసుచేసికొని, యీజాతర నిప్పటి కింతటితో ఆపివేయించండి. లోకమిప్పటికే రోసినది.



ములుమూడి నారాయణరెడ్డి

# కాలగతి తలపోతల గతి.

## 4. దీమసము గాక యేమి?

ధ. వెం. సుబ్బయ్యగారూ,

మనలో మాట:--దీమసములో నా పేరు-దాదాపు 60 మాఱులు వాడితిరే. ఒక్క-సారియైనను, 'శాస్త్రి' అనక పోతిరేల? ఆపదము మీ కంత ఱోయరాని బాధను గలిగించినది కాఁబోలు! కాకున్న మీరు 'దీమసమున' దాని నేల తొలఁగింతురు? పోనిండు, మీరు బాధతొలఁగి బాగుపడుటయే నాకుఁ బదివేలు. మీరునన్ను 'శాస్త్రి' యనకున్నంతమాత్రమున నాకుఁ బోవునదేమియు లేదు. ఇంకను గావలయునేని ఆ 'శాస్త్రి' పదమును తామే తగిలించుకొని, నేఁటినుండియు 'శాస్త్రి' పదశోభితులరై వెలుఁగుండు.

సుబ్బాశాస్త్రిగారూ,

నేనొక్క-మాట చెప్పెద వినుఁడు. ఎదుటివారిని నీచముగాఁ జూచుట మననైచ్యమును వెల్లడించుకొనుటయే యగును గాని, అందు గొప్పతనములేదు. కావుననే పెద్దలు 'మరియాద యిచ్చి మర్యాద తెచ్చుకొ' మ్మన్నారు. మఱో! పుట్టైను బుట్టిన బుద్ధిని మార్చుకొనుట అంత సులువైన పనిగాదు లెండి!

## పరికృతము

'ధరణికోటవారి ధార్ష్ట్యము' ఒరవడిగా మీరు కైకొన్న 'దీపాలవారి దీమసము' అను శీర్షిక చక్కఁగ నేయున్నది గాని, ఆంజలివాఁడ్రుఁత

మాత్రము నావ్యాసమునకు సరియైన సమాధానముకాదు, అది సమాధానమే అయితే నావ్యాసములోని—

(1) నేను శర్మగారి నగ్గించుట తప్పా ?,

(2) శర్మగారి నగ్గించుట శాస్త్రిద్వేషిత కాక సాక్ష్యమా?

(3) శాస్త్రిగారిని కొనియాడితినే, మఱి శర్మగారికి విరోధినిగా వలసినదేనా ?

(4) మీతో నెన్నఁడైనను వివదించియుంటినా ?

(5) నన్ను విరోధిగా నేఁడు మీరు పేర్కొనుటకుఁగారణ మేమి?

(6) రామదాసుగారితో పదియేండ్లక్రిందట వివదించియుంటచే నేఁడు మీకు విరోధి నెట్లగుదును?

(7) మీ కలహకారణకల్పనము 'గొఱ్ఱెపిల్ల-తోడేలు' కథను బోలినదే కదా?

(8) మీకోటికిఁజేరిన గు. సుబ్బరామయ్యగారిని, మీ గురువులను విమర్శించిన పండితులందఱును మీకు విరోధులే యగుదురుగదా!

(9) వారిపేరులను వదలి, విరోధికోటిలో నాపేరే పేర్కొనుటేల?

(10) గిడుగువారి విమర్శ 'వీరమర్యాదానుసారి' యై నాది కాక పోవుటకుఁ గారణమేమి?

(11) శాస్త్రిగారిని తన్మరణానంతర మెన్నఁడేని నిందించితినా?

(12) నిందించని నన్ను తద్విరోధిగా వ్రాయుటేల?

(13) శాస్త్రిగారిని తన్మరణానంతరము పొగడితినా? లేదా?

(14) పొగడినవారును విరోధులే యగుదురా?

(15) కానిచో నన్ను విరోధిగా వ్రాయుటేల?

(16) భాషావిమర్శకులు విరోధులగుచో శాస్త్రిగారు శ్రీనాథాదుల కెల్లరకు విరోధియేకదా?

(17) నేను కాళిదాస మల్లినాథుల కట్టివిరోధినో శాస్త్రిగారికిని

అట్టివిరోధి నేగదా?

(18) 'జితకాశి' మేఘువిమర్శకు బదు లని స. నా. శర్మగారును, కాదని మీరును గదా? ఎవరిమాటనిజము?

అను ప్రశ్నములకు ఆ దీనుసమున ప్రత్యుత్తరము లేవీ? లేవే! దాని యర్థమేమి? తమ కరము కట్టువడ్డ దన్నమాట. అట్టి స్థితికేగదా వాదము లలో - 'వాగ్బంధన' శబ్దమును పండితులు వాడుట! అట్లు వాదప్రారంభ మున నే, పల్లెత్తిపలుక వీలుగాని దశ పొసగినప్పుడు- తాము మర్యాదగా వాదమును మానుకొనక- అతిప్రసంగములతోను, అప్రసక్త కథలతోను, అను చితవ్యాఖ్యానములతోను, అక్రమాధిక్షేపములతోను మరల నొక 18 పుటల గ్రంథమును ప్రకటించితి రెందుకయ్యా?

దానికంతకును బదులు వ్రాసిన నొక చేటభారతమై- పాఠకులకు విసుపుపుట్టించుట యగునే గాని, మఱి ప్రయోజనముండదు. కావున నొక కొన్ని విషయములను మాత్రము సంగ్రహముగా విమర్శించి మీవాదము లోని సారమును లోకమునకు సూచించి యంతతో విరమింతును.

## 1 రామదాసుగారి తిట్లు

"రామదాసుగారు, విభవాషాఢ (1928 జూన్) భారతిలో నన్ను తిట్టిరి; నేను (1928 అగస్టు) త్రిలింగలో బదులుచెప్పితిని; కావున వారితిట్లే ముందు" అని తెలియఁజెప్పితినే యింకా మీవాదమేమిటయ్యా?

'జూన్' కు 'అగస్టు'-వెనుక కాదు. ముందే నంటారా! అని మీ మాటను నెగ్గించుకొంటారా! అది మీ కీజన్మమున కానిపనిగదా! అట్టి విష యము లోకూడా.- 'తప్పులేక ముప్పందుము' అన్న సామెతకు జతగా ఒక 3 పుటలసోది చదివితిరి. అది మొండితనము గాని పండితపద్ధతి కాదు.

## 2 స్వస్థత

"పండితోపదేశపరమౌషధసేవనమున, రామదాసుగారు స్వస్థు లగుదురుగాక" అన్నవాక్యమునకు-"కౌలముచేసినవారుగదా స్వస్థు లగుదురు" అని మీరు వ్యాఖ్యచేయుట తప్పు.

లోకమున నెక్కడనైనను విషప్రయోగమున కౌలముచేయుట కలదుగాని, పరమౌషధసేవనమున కౌలముచేయుట అశ్రుతపూర్వము. పరమౌషధసేవనమున గలుగు 'స్వస్థత'ను కౌలముచేయుటగా అర్థముచేయుట అజ్ఞానముననైనను కావలయు, కాకున్న కుత్సితబుద్ధిచేతనైనను కావలయు.

చరకుఁడు-స్వస్థ లక్షణముల నిట్లు చెప్పినాఁడు.

శ్లో. సమదోష స్సమాగ్నిశ్చ
సమ ధాతు మలక్రియః
ప్రసన్నాత్మేంద్రియామనాః
'స్వస్థ' ఇత్యభిధీయతే.

సుబ్బాశాస్త్రిగారూ. శ్లోకమునఁ జెప్పఁబడినవి కౌలముచేసినవాని లక్షణములేనా! ఆయుర్వేదమున 'స్వస్థవృత్త' మన్నపేరుతో-ఆరోగ్యమార్గము తెలుపు నట్టిది కొంతగ్రంథమే కలదు-ఆ 'స్వస్థవృత్త' మునకును మీరు చావులక్షణ మనే అర్థము చెప్పుదురా! బలేపండితుఁడవయ్యా!

కౌలముచేసినవారు-'స్వస్థులు' కాఁ వలెను. 'స్వస్థు' లైనచాలదు. ఏకసకారముతోనే మే మాయర్థమునుసాధించుకొందు మందురా మీయిష్టము.-

నావాక్యమునుబట్టి ఆ రామదాసుగా రేమియుఁ గానక్కఱలేదు. చిరజీవియై-సుఖియై-పండితమండలికి తలలోని నాలుకయై- బుధావర్తనమున శాస్త్రికీర్తిధ్వజంబై-మనుదురుగాక. వ్యక్తిదూషణములేని విమర్శలను, భాషాసంప్రదాయమును జెలుపనివ్యాఖ్యానములను వ్రాసి, 'అపర శాస్త్రి' అనుపేరుపడసి వర్ధిల్లుదురుగాక.

## 3 శాస్త్రినింద

శాస్త్రిగారిని నేను నిందించితినా? ఆ నిందావాక్యము లెవ్వి?

1 ఎట్లుపొసఁగును?

2 సహజమగునా?

3 శ్రీ శాస్త్రులవారికి వినయపూర్వకముగా విన్నవించుచున్నాను.

4 సందేహమునకే మఱింత నోటొసఁగిరి.

5 ఈ శ్లోకమునకు ఒక పెద్దగౌరవమును ప్రాముఖ్యమును నొసంగిరి.

అనునవేనా? ఔరా! ఎంతనింద! ఎక్కడినింద! దుస్సహము! దుస్సహము!!

సరేకాని యివి నిందావాక్యము లని మీ కెవరు చెప్పినారు? మీరే తెలిసికొంటిరా? అమ్మో! మీరు సామాన్యులుగారే! ఈగొప్పవిషయమును తెలిసికొనుటకు తమకు నిండా పదిసంవత్సరములు పట్టినదిగా?

అవి నిజముగా నిందావాక్యములేనా? అయితే-'ఉల్లసపువాక్యము' లన వలసినది. మఱితాము, 'ఉల్లసవాక్యము' (హర్షవాక్యము) లన్నారేమి?

మీ యర్థమున-అది సంకరసమాసము అగుచున్నది. శబ్దరత్నాకరమును చూచుకోండి సార్. ఈపాటియు నెఱుఁగనితాము-అపశబ్దము లెత్తితిరి. అందఱిని అల్పవిద్వాంసులంటిరి. సిగ్గు! సిగ్గు!

అదిసరేకాని, "అందఱికీ శకునాలు చెప్పి బల్లిపోయిబావిలోబడ్డ" దన్నట్లు సంకరసమాసము చేయరాదని-ఏ. వి. పంతులవారితో అన్నాళ్లు 'రాయబారము' నడిపి, నడిపి, తుదకు తామే-ఆ తప్పు చేసిరేమయ్యా!

నవ్వుల చేటు!

## 4 ప్రమాదములు

ప్రమాదము మానవసహజమనియు, కావుననే కాళిదాసాదులకును

అక్లే వేంకటరాయశాస్త్రిగారికిని ప్రమాదములుకలవనియు నేననఁగా తామేమో అందుకొప్పక 'కొప్పరించితిరి.' మీ 'కొప్పరింపున కర్థమేమి! అయ్యగారు మానవుఁడు కాఁడనియా? ఆయనకు ప్రమాదములులేవనియా? ఇంకను లోకమునకన్నులకు గంతలుకట్టవలెననేనా యత్నము? ఇఁకనది యీ జన్మమునకగుపనియేనా! సౌజన్యపరమావధీ! తప్పుల నొప్పుకోవయ్యా, అదిధీర లక్షణము.

ఉ. ఊడిన దేమి మాగురున కొప్పుటచేఁ దమతప్పు తప్పగా?
కూడినదేమి మీగురునకుం దమ రాఘును తప్పులొప్పు క
ల్గాడుటచేత? నింతకు బళా! తమ దంభమొకండె తెల్లమై
వేడుకఁగూర్చె, సత్యము గవేషణసల్పెడు సాధుకోటికిన్.

## యతితప్పు

సుబ్బాశాస్త్రిగారూ,

తమ 'దీమసము' లోని, "వీఁగిపోకుండ నీ వ్యాఖ్యలేక' అను సీసపాదమున యతి తప్పే! ఏమిచెప్పెదరు! ప్రమాదమంటారా! అయ్యో!! తమకు గూడా ప్రమాదమా! అచ్చుతప్పు కాదుగదా?

'వీఁగిపోకుండనీ వివృతిలేక' అని తొలుత మీరు వ్రాసికొన్నదానినే మరల వ్రాయుటలో ప్రమాదపడ్డ తామే- ఇతరుల రచనలలోని ప్రమాదముల నెన్ని హేళనచేయుట యెంతహాస్యాస్పదమయిన పనో ఆలోచించుకోండి.

## 4 మిట్టాడు

"మేఘంబుఁ దెలిఁగించి మిట్టాడునెవ్వాఁడు"

అన్న మాటలు 'నన్నుగూర్చినవే' యని నేను స్వయంనిర్ణయము చేసికొన్నట్టు మీరు వ్రాసినారు అది పొరపాటు.

'మేఘుంబు.........లేక' అన్నమాటలు పిచ్చయ్యశాస్త్రిగారిని గుఱించి అన్నవే' అని నారాయణరావునాయుడుగారు 31—10—36 సుబోధినిలోఁ జేసిన సిద్ధాంతమునకు తాము సమ్యక్సమాధానమీయకుంట చేతను, మీరు నన్ను మీకు విరోధిఁగా మీ 'తత్త్వబోధ'లోఁ బ్రకటించి యుండుటచేతను అట్లనుకొంటిని గాని, కారణములేక అనుకొనలేదు. ఆమాట నన్నుగూర్చి అన్నదికాదని మీరు తెలుపుకొన్నారుగావున దానిని గూర్చినచర్చ నాకిఁకఁ బనిలేదు. కాని "ఆవాక్యము శాస్త్రిమిత్రుల మేఘ వ్యాఖ్యాప్రశస్తి మాత్రఖ్యాపక' మన్న మీ సమర్థనమును గూర్చి యొక్క మాట.—

మీ శాస్త్రిగారిప్రశస్తిని ప్రఖ్యాపించుటకు మఱియొకపండిత కవిని 'మిట్టాడనేర్చునే' యని తెగడవలసినదేనా? అంతకంటెను మంచిమార్గము లేదా? 'మిట్టాడనేర్చునే' యన్న నుడి పొగడికయేకాని తెగడికకాదని కూడ వాదింతురా? అట్లయినచో మల్లినాథ పాండితీ ప్రశస్తిమాత్ర ప్రఖ్యాపకముగా– "మల్లినాథవివృతిలేనిచో వే. వే. శాస్త్రి మేఘమున కర్థము వ్రాసి మిట్టాడనేర్చునే" అని ఎవరేని పొగడినచో తాము సంతసింతురా? ఎందుకయ్యా! అతుకని వ్రాఁతలు.?

'మిట్టాడనేర్చునే' యన్న గొప్పపొగడ్త మీశాస్త్రిగారికే చెల్లింపుఁడు. లేదా, మేఘానువాదకులలో 'ఉచితజ్ఞు' లైన గు. సుబ్బరామయ్య గారికో, భీ. సత్యనారాయణగారికో, వేఱొకనికో, మఱొకరికో, యింకొకరికో, మీ కొనియాడుటకు తగినవారి కెవరికేనిఁ జెందనిండు. నాకు పని లేమలెండు. ఇంతయేల? ఆ 'మిట్టాడుట' మీ సొంతమునకే యుంచుకొనుఁడు.

## 5 విసివించితినా?

నేను–'కల' పద్యములను వేడ్కమై (మోహన రాగములో) పాడి పాడి తోడియొజ్జలను విసివించితి"నా? ఈమాట వ్రాయుటకు మీకెక్కడ

సిబ్బతి లేకపోయెనయ్యా? సుబ్బయ్యగారూ?

మీరు మీ ఆనందమునకై, కోరి నాచేత మీ'శాస్త్రి విజయధ్వజము' పద్యములను-మన తోడియొజ్జలతోఁగూడి చదివించుకొంటిరా? లేదా? అట్లే వారును వారి యానందమునకై 'కల' పద్యములను చదువు మని నన్న డుగఁగూడదా? నేను చదువఁగూడదా? మీ పద్యములను ఏ మోహనరాగముతో, ఎంత వేడుకతో, పాడి పాడి మిమ్ము వినిపించితినో, 'కల'పద్యములను గూడ, ఆ మోహనరాగముతోనే అంతవేడుకతోనే పాడిపాడి వారిని వినిపించియుందును. అందు నాదోషమేమి? మీ యాక్షేపమేమి? మీపద్యములను చదువుట యొప్పును, 'కల'పద్యములు చదువుట తప్పునా? ఏదోరీతిగా నేరము మోపవలె నన్న కుత్సితబుద్ధియేగాని వెనుక మీకు దిగు మేకును తెలిసికొనుపాటి యూహ లేదుగదా? పెక్కుమాటలేల? నాదృష్టిలో మీ 'శాస్త్రి విజయధ్వజ' పద్యము లెట్టివో, 'కల'పద్యములు నట్టివే. అందు తరతమతలు లేవు.

## 6 అల్ప విద్వాంసుఁడు

మీరు మీ విమర్శనముఖముననే,

"అల్పవిద్వాంసుండు
ఆక్షేపణకుఁ బెద్ద"

ధరణికోట వేంకటసుబ్బయ్య బి. ఏ. బి. ఇడి.—

అనివ్రాసితిరి. మీబుజువాడిత కొనియాడఁదగినది.

అల్పవిద్వాంసుఁడును, ఆక్షేపణకుఁబెద్దయు--ధ. వెం. సుబ్బయ్య.— అను అన్వయముతో ఆవాక్యము మీమెడకే చుట్టుకొను నని మీరెఱిఁగిరేమో వ్రాసికొన్నారుగదా?

ఒక్కమాట:—తమ వ్రాఁతప్రకారము అల్పవిద్వాంసుండు గదా

ఆక్షేపణకుఁ బెద్ద? మఱితాము- ఆక్షేపణకుఁ బెద్దలా? పిన్నలా?— పెద్దలే; పెద్దలుకాకున్న 'విమర్శాదర్శము' లెత్తుదురా? 'నీమేఘదూతను విమర్శింతు' నని నన్ను బెదరింతురా?

మఱియొకమాట,—మన ఆంధ్రదేశమున ఆక్షేపణకు పెద్దలు, ఒక చిన్నగ్రంథమున 2563 ఆక్షేపములు చేసిన ప్రసన్నరాఘవవిమర్శకర్తలను మించినవారు లేరుగదా! మీసిద్ధాంతమున వారు అల్పవిద్వాంసులేనా?

“అల్పవిద్వాంసుఁడు + ఆక్షేపణకుఁ బెద్ద” అని సీసపాదము సగమే వ్రాసికొన్నారేల? తక్కినసగమును తమకురాదా యేమి? నేను పెద్దలవలన వినియున్నాను. ఇదిగో!

“అల (Apology) అపాలజికిని నతఁడె పెద్ద”

ఇఁకపైనను మీ ప్రతి పుస్తకము ముఖమునను ఈసీసపాదమును పూర్తిగా ముద్రించుకొనుఁడు. కొఱఁతపడనేల!

## హెచ్చరిక

మిత్రమా!

‘అల్ప......బెద్ద’ అనురీతి పద్యములు నాకు కొన్ని వందలు వచ్చును. వినియోగించుటకును చేతనగును. అయినను మనము వేఁగిలేచినది మొదలు ఒక్కచోట నుండువారమగుటచేతను, ఇంతకుపూర్వ మెట్టివిరోధమూ లేనివారమగుటచేతను, ద్వేషమును పెంచు తలఁపు నాకు లేకపోవుటచేతను, ‘ఫాక్ట్స్’వ్యాసమున నట్టి పద్యములను వినియోగింపనైతిని. మిమ్మడుగఁదగిన అంశములను మంచిమాటలతోనే అడిగితిని. మీరా మంచితనమును గమనింపక—‘దీమసము’న అల్ప......బెద్ద” అంటిరి. అంతేకాక “ప్రల్లదము,’ ‘వావాడితనము,’ ‘మున్నత్తపంచాగము,’ ‘దుర్వాదము,’ ‘దురుసుమాటలు’ ‘దుడుకుమాటలు’ “మున్నగు పదములనెన్నిటినో నన్ను

గూర్చి వాడితిరి. ఇట్టి మీరేకదా 'కలహపరాయణు'డని నన్నన్నవారు!'
కలహ పరాయణు లెవరో లోకమిప్పటికైనను తెలిసికొనకుండునా?

## 7 పొల్లులా?

సీతారామశాస్త్రిగారు చూపిన దోషములు పొల్లులటయ్యా? అయితే సుప్రసిద్ధ పండితులు శతావధానులు బ్ర. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అలాఅన్నారేమి?

—26 సెప్టెంబరు 1936 కృష్ణాపత్రిక.

"ఆయనవ్రాత బహు యుక్తియుక్తముగావుంది. అది ఖండించడానికి బ్రహ్మకుకూడా తరంగాదు."

ఏమంటారు మఱి? తమకు అసలు, ఆ తప్పులతత్త్వమే అంతుపట్ట లేదనుకొంటా. తెలిసీ తెలియని వ్రాతలెందుకు వ్రాస్తావయ్యా? స్వామీ! పండితలోకాన్ని పరితారించఁగలరా?

## 10 వాగ్బంధనమా?

వెలమకన్నివారి ఆక్షేపములకు సమాధానములు చెప్పకయే— తమ తత్త్వబోధలో—"వెలమకన్ని పరిటపక్షి వాగ్బంధన మయ్యెను" అని వ్రాసినారే! అది ధార్ష్ట్యమా? లోకవంచనా చుంచుత్వమా!

ఉ. కాంచనపల్లివంశ్య కనకాంబ పొనర్చిన తెల్గుసేఁత చూ
పించి, భవద్గురూత్తము కవిత్వమునంగల దోషముల్ నిరూ
పించె నతండు, నీవు పెదవిం గదలింపఁగ లేకపోయి త్రీ
వంచన వ్రాఁతలేమిటికి? 'వాక్కు'ని 'బంధన'మంచు! బాపురే!

క. తికమకలనుబడి యేవో
కకవికవ్రాఁతలను వ్రాసి కసరిన నగునా

ప్రకట వివాదంబుల సు
బ్బకవీ! ప్రతిపక్షులకును వాగ్ఖండనముల్?

సమాధానములు సమగ్రముగా వచ్చునంతవఱకును మీ వాక్యమునకు;—

వెలమకన్ని = వెలమకన్ని యొక్క—; ప్రతిపక్షి = విరోధియైన, సంగుభొట్లకు, వాగ్ఖండనమయ్యెను అని యర్థము చెప్పుట సముచితము. ఏమంటారు!

## 11 అస్తవ్యస్తపు వ్రాత

'శాస్త్రిగారి మేఘసువ్యాఖ్యానమును గూర్చి చేసిన చర్చ విద్యావిషయము కావున అందుకై (పిచ్చయ్యశాస్త్రిగారిని) నేను ద్వేషింపలేదు. 'జితకాశి' ఆ ద్వేషమున వ్రాసినది కాదు'— అని యొకమాఱును— 'పిచ్చయ్య శాస్త్రిగారు, మాశాస్త్రిగారి మేఘు.........గూర్చి కొన్ని యాక్షేపణలు చేసిరి. కావున మాకువిరోధులు. కలహప్రారంభకులు' అని యొకమాఱును వ్రాసితిరిగదా. ఇంతకంటెను అస్తవ్యస్తపువ్రాత యింకొకటియుండునా? మీ వ్రాతయంతా యింతేకదా!

మీ వివాదముతో నాకేమిసంబంధము? మీ కలహమునకు నే నెట్లు కారణమైతిని?— అని నేనడిగితే— "మేఘుహంసలకు మైత్రిని చెప్పవచ్చును, ఇంద్రియనుస్సు ఉత్తరమున నున్నట్లుకూడా చెప్పవచ్చును, అనెదరేమిటికి? "ఏన్గూను బాప్రహ్మడా అంటే యేట్లోరొమ్ములలోతు—" అన్నట్లున్నది మీసమాధానశక్తి.

మీ వ్రాతయంతయు నిట్టిదే. మచ్చున కించుక విమర్శించిచూపితిని. ఇట్లే విమర్శించునో, మీ 'దీనుసము'న నిలువఁగల పలుకులేదు. మీది సబబులేని కలహము. సరకులేని వాదము. సారములేనివ్రాత. మీవ్రాత యంతయు విమర్శించి, గ్రంథమును విస్తరించి, చదువరులను విసివింప నాకిష్టము లేదు. కావున— శాస్త్రిగారి ప్రమాదములనుగూర్చిన మీ అధిక్షేపమునకు

మాత్రము సంగ్రహముగా సమాధానమువ్రాసి విరమింతును.

## శాస్త్రిగారి తప్పులు.

తప్పులులేనివారు లోకమున లేరనియు- నేఁటి పండితులలో గొప్ప ప్రతిభాశాలియని పేరువడిన శ్రీశాస్త్రిగారి రచనలలోనే- తప్పులున్నవనఁగా నింక నితరులమాట చెప్పనేలా? అనియు నేననఁగా- అందుకు తాము కోపముచేసికొని- 'వెలమకన్ని పొల్లు ఆక్షేపాలపై నాధారపడియా నీ వీ మాట అంటివి' అని నన్ను అధిక్షేపించితిరి.

స్వామీ, నేను వారివీరి వాక్కులపై నాధారపడియనలేదు. తమకు 'జితకాశి' వలెనే నాకును కొన్ని దోషములు, శాస్త్రిగారి కృతులలో నగపడుటచేతనే- అంతటిమాట అనఁగలిగితిని. వట్టిమాట నప్పుగుకావున, నా చూచిన పెక్కుదోషములలో; నెల్ల రెఱుంగఁ గల వానినే- కొన్నిటిని చూపించుచున్నాను. చిత్తగించండి.

I. యతిదోషములు:—

(1) క. "తన బోనములో సగమై
నను నర్థికిఁబెట్టునట్టి యాతని కేరీ
తిన"

—హితోపదేశచంపువు.

'ఐనను' లోని న కారములో- అ కారము పుట్టుకావున- అ- న కారమునకు- య కారముతో మైత్రినెనయించుట తప్పు.

(2) అగ్రంథముననే—

"బుద్ధి యెపుడు మతికి వికృతిఁదెచ్చు"

కేవల- బుకారమునకు 'వి' కారముతో యతిమైత్రి చెల్లదు. తప్పు.

(3) దశకుమారచరితము.—

క. లలనరొ నిను నాజన్మాం
జలిగ్రా యీవరము దాసజనుఁడితఁడడుగన్
వలచౌని కలన నాతో
నలయిక నిద్రింపు మొంటి గావలవదిటుల్.

నాలుగవపాదమున–అకార గకారములకు యతికూర్పఁబడినది. పనికి రాదు.

(4) రత్నావళి:—

"నరపశులెల్లనుం గలసినారు భవత్సభ సంజ పొద్దునన్"
"పుత్రెంచినాఁడు అను సమాసమున సంధివశమున వకారలోపముచే 'అఁడు' మిగిలిపుత్తెంచినాఁడు, అయినది. కావున నిట–'ఇ' కారమునకే యతినిడవల యును."

అని శాస్త్రిగారు, నైషధములో చేసినసిద్ధాంతము ప్రకారము, ఈ పద్యమున–యతి తప్పినది.

(5) వచ్చినాఁడు, వండినాఁడు, మొదలగు పదములలోని 'నా'లో 'ఆ' విఱుగదని గుప్తార్థప్రకాశికాకర్తలు సూత్రమునువివరించియు–

గీ. అంత శౌర్యాశ్రయంబైన యట్టి మేటి
వీడు నా కామవస్ఫూర్తిహార్స్థితధామ
కాంతిఁ జూచి పోయెద నని కదలివచ్చి
నాఁడ నెఱినూపు మదనుగుణక్రమమున.

అను, రాఘవపాండవీయపద్యము నుదాహరించియు, సుబోధముగాఁ జెప్పియున్నను–దానినైనను చూడక, శ్రీ శాస్త్రిలవారు:—

'నముచిదమనునొడు పుత్తెంచినాఁడు:నీకు'

అన్న శ్రీనాథునిరచనమున యతివిచారణీయమనుటకంటెను,

'నముదిరమనుండు పుత్తెంచె నాతినీవు'

అని తా ముదిద్దుట -కంటెను పెద్దప్రమాద మేమికావలెను? శాస్త్రి గారు, తమ 'నారు' లోలేచి 'ఆ' కారము, శ్రీనాథుని 'నాఁడు' లో నెట్లు పుట్టుననుకొన్నారోగదా!

## II అనువాద దోషములు:—

(6) శాకుంతలములోని.— "య న్మిథస్సమయా దిమాం మదీయాం దుహితరం, భవా నుపాయంస్త."— అన్న సంస్కృతమును, "ఏకాంత మున నొడఁబఱిచి నీ వీ మాకొమరితెను వివాహ మైతివి"—అని తెనిఁగించి నారు; శాస్త్రిగారు.

'మిథోన్యోన్యం రహస్యపి' అని అమరము. మిథశ్శబ్దమునకు, పరస్ప రము, ఏకాంతము అని రెండర్థము లున్నను, ఇక్కడ ఏకాంత మన్న యర్థ మునకైకొనరాదు. ఏలన? ఏకాంతమనఁగా- ఇద్దఱికంటె నెక్కువ జనము లేనిచోటు (శ. ర) అని యర్థము. కావున, దుష్యంతుఁడు, అథము శుభము నెఱుఁగని పసిదానిని శకుంతలను, ఎక్కడికో * ఏకాంతభూములకు తీసికొ నిపోయి, బులుబుచ్చుకపు మాటలుచెప్పి ఎట్లో యొప్పించి వలపు చూఱుకొ నినట్లు అర్థమునిచ్చును. దుష్యంతుఁ డట్లేచేసియున్నచో కణ్వుఁడు,

"త న్మయా ప్రీతిమతా యువయో రనుజ్ఞాతమ్"—

('దానిని నేను బ్రీతుఁడనై మీ యిరువురియెడల నంగీకరించితిని' అనునా? శపించియుండును గాని.

* "ఉష వలచి తనకై ఇల్లువదలి ఏకాంతభూములకు వచ్చునట్లుగా చేసికొని"

—శాస్త్రి గారి ఉష.

శకుంతలా దుష్యంతులు పరస్పరము చేసికొన్న సంకేతము ప్రకార మయిన గాంధర్వవివాహము కావుననే, ఆమహర్షి యంగీకరించినాడు.

సంస్కృత వ్యాఖ్యాతలు- 'మిథస్సమయాత్'= పరస్పర కృతసంకేతాత్"—అన్నారు. వస్తుతత్త్వము నెఱిఁగిన కం. వీరేశలింగము పంతులుగారు, "అన్యోన్యసంకేతముచేత..." అని యే తెనిఁగించినారు.

అట్లే వ. సు. రాయకవిశేఖరులును, "పరస్పరసంకేతము నే" తమ యనువాదమున వాడినారు.

రాయదుర్గం నరసయ్యాశాస్త్రిగారును "మిథస్సంకేతముచేత"— అనియే తెనిఁగించినారు.

అట్టి 'మిథ' శబ్దమును 'పరస్పరము'- 'అన్యోన్యము' అనక, ఏకాంతమని యనువదించుట గుఱికి ఎంతదూరము?

(7) "అవివాహసమయాత్ గృహే వసే"-(ఉ. రా. చ.)

శాస్త్రిగారి తెనుఁగు—

"పెండ్లిసమయంబునుండియు వీటఁ గాట"

తెనుఁగున-'వీడు' అను పదానికి 'గృహము' అను నర్థము లేదు. కావున శాస్త్రిగారి తెనిఁగింపు తప్పు. అఱవమున ఇంటికి-'వీడు' అందురు. శ్రీవారు అఱవలు కావున, అలవాటున ఆ పదము వారికి తెలియకుండానే అట్లు పడెనేమో!

'కాటి' సంగతి తెలిసినదేకదా!

(8) హితోపదేశములోని—

"దత్తస్య నిర్ఘర్షణకేన రాజ్ఞా
కర్ణస్య కణ్డూయనకేన వాపి

తృణేన కార్యం భవతీశ్వరాణాం
కిమంగ! వాక్పాణిమతా నరేణ"

అను శ్లోకమును శాస్త్రిగారు.—

క. పలుదోమనేని, కర్ణం
బుల గులగుల దీర్పనేని, పూరిపుడుకచేఁ
గలదు పని యీశులకుఁ; గయి,
పలు, కంగంబులు, గలానిఁబలుకవలయునే?

అని తెనిఁగించినారు. అన్వయము కుదురుటలేదు. కయి, పలుకు, అంగములు అన్నారు. 'కయి' అంగమే కావున, మరల అంగములు చెప్పుటతగదు. పలుకు, అంగముకాదు కావున, కయి, పలుకు మొదలగు అంగము లని చెప్పుటకునువీలులేదు. ఈ చిక్కు ఎందువలనవచ్చినదనఁగా;—

వాకు, కిం, అంగవాక్పాణిమతా, అని యాన్వయము చేసికొన్నటు న్నది. అమార్గము సరియైనదికాదు. 'అంగ'–అవ్యయము. అది. 'కిం' తో చేరినపుడు–'కిముత' వలె, ఇఁక చెప్పవలెనా! (...తృణమే పనికివచ్చునుండఁగా ఇఁక......మానవునిమాట చెప్పవలెనా?) అన్న యర్థమునిచ్చును. ఆప్టేఁడు, ఈ విషయమును విస్పష్టముగావ్రాసి, ఉదాహరణమున కీశ్లోకమునుగూడ నిచ్చియేయున్నాఁడు. చూడండి.

"అంగ:-Used with 'కిం' inthe sense of how much less' or 'how much more'—

శక్తిరస్తి కస్యచిద్విదేహరాజస్య ఛాయామప్యవస్కందితుం కిమంగ జామాతరం. మహావీరచరిత్ర–.

తృణేన కార్యం భవతీశ్వరాణాం
కిమంగ వాగ్ హస్తవతా నరేణ." పం.—

తెనుఁగున— పలుదోమ- అనుటకంటెను, పల్లుతోముకొనుట కనుట యుచిత తరము.

పలుదోముట- ప్రతిదినము కావలసిన కార్యము; ముఖ్యము. ఇట చెప్పనది అంతకన్న లఘుతరమైనపని యైనచో మేలు.—కాదు, అవసరము. చిలకమర్తివారి తెలుఁగుపలుకుబడి చూడండి:—

"అచేతనము లైన గడ్డిపుల్లలు మొదలైనవి సహితము చెవిదురద పోఁగొట్టుకొనుట పల్లు కుట్టుకొనుట మొదలయినవానికిఁ బనికివచ్చుచుండఁగా నోరు చేతులు మొదలయిన యవయవములుగల మానవుఁడు పనికి రాక పోవునా?

—ఐదవ ఫారము పుస్తకము.

ఇంకొక తెలుఁగుకవి యీ శ్లోకార్థమునే:—

"ఈనయు నోదవఁగా నెవ్వరికైన
మానవుఁ డోపవఁడే మఱి బుద్ధికలిగి?"

అని సూక్ష్మములో మోక్షమన్నట్లు ఎంతసులువుగా, సుఖముగాఁ జెప్పినాఁడో చూడండి.

శాస్త్రిలవారి 'దోమ' నవతలికిఁ దోలి- అచ్చట 'గుట్ట' పెట్టిన నర్థము మెఱుఁగెక్కును.

'క్రిమిగ'కు- వాగ్భటాలంకార గ్రంథమునుండి మఱియొండు ప్రయోగము నిచ్చుచున్నాను.

శ్లో. ఆలోకనంచ వచనంచ నిగూహనంచ
యాసాం స్మర న్నమృతవ త్సరసం కృశ స్త్వమ్,
తాసాం కిమంగ! పిశితాస్ర పురీషమాత్రం
గాత్రం విచింత్య సుదృశాం న విరాగమేషి.

అయ్యా, సుబ్బాశాస్త్రిగారూ

అంతటి గొప్ప సంస్కృతపండితులే అల్పవిషయ మయిన 'కిమంగ'ను గమనింపలేక ప్రమాదపడినప్పుడు ఇఁక అస్మాదృశులమాట 'కిమంగ?' తాము 'నీ మేఘమాలలో తప్పులుచూపుదు' నంటిరి. ఏమిటికయ్యా? తప్పులు లేనివారెవరు!

## III వ్యాకరణ దోషములు:—

**(9)** సంధి.—

ఉ. నీకును నీజనంబులకు నించుతనింద్రుఁడు భూరివర్గ్షముల్.

— శాకుంతలము

నించుతన్ + ఇంద్రుఁడు= నించుతమింద్రుఁడు కావలయును—
'ఎడు, త లదుగ్రితమున కచ్చుపరంబగునపుడు మకారంబగు'

—బాలవ్యాకరణము.

1896 సంవత్సరము నాఁటి తొలి ముద్రణమునను, ఆవల 27 సంవత్సరములకు అనఁగా 1923 సం॥ లో యథామతి సంస్కరించి శాస్త్రిలవారే ప్రకటించిన రెండవ ముద్రణములోను, పాఠమిట్లేయున్నది:—

**(10)** ... ... మోవిబింబముక్
రేల నిజఁబుకై ... ... ...

—శాకుంతలము.

దుగ్రితమునకు అచ్చుపరమైనపుడు యాడాగమములేదు. ఇట్టి దోషములనుగూర్చి ఆక్షేపించుచు శ్రీ శాస్త్రిలవారు, శ్రీ కాళహస్తి మాహాత్మ్య ముద్రణవిమర్శములో—

"పాఠశాలలో శ్రద్ధతోఁ జదువు బాలురకు ఈ...సంధి దోషములు నాలవఫారములోనే చక్కఁగాఁ దెలియును" అని వ్రాసియున్నారు.

**(11)** "సర్పిఃపాయసాహారము" (శృం. నై. 8 ఆ 198 పద్యము) అని ముద్రించినారు. శ్రీ శాస్త్రిగారు.

సమాసమున సంధి నిత్యము కావున—"సర్పిష్పాయసాహారము" అనియే యుండవలయును. విఖుపుష్టము- శ్రీ శర్మగారు 'త్రిజగత్ శ్రీమాత'; 'చాతకత్ బుష్ఫ' అని విసంధిగా వ్రాసినందుకు, మామిత్రులు బ్రి. ఓరుగంటి వేంకటేశ్వరశర్మగారు:—

"ఆంధ్రీకర్తలిట్టి ప్రయోగముఁ జేసి యొక్క మాటతో వ్యాకరణ నియమముల నుల్లంఘించిరి. సమాసమున సంధి పాటింపకుండుట తగదు. వీరు సమాసమధ్యంబునను సంధి వివక్షాధీన మనుకొనిరి కాఁబోలు. వ్యాకరణమును చదివినఁగదా! ప్రయోగముల నొజ్జలవలన నేర్వవలదా! ఇదియా ప్రయోగ విజ్ఞానము!"—

అని ఆక్షేపించి యున్నారు. 'దిక్ జలజనయన' అని వ్రాయరాదని - మహావైయాకరణ శిరోమణి, మా స. నా. కౌచారి, నాకు హెచ్చరిక చేసి నాఁడు. నామాట యటుండనిండు. శ్రీ శర్మగారు గాని, శ్రీ శాస్త్రిగారు గాని- ఆపాటి వ్యాకరణజ్ఞానము లేనివారు కారు. అట్టివారిని వారియాశయమును గమనింపక అంతగా తూలనాఁడుట పాడిగాదని మామిత్రులకు సౌహార్ద్రముతో మనవి చేయుచున్నాను.

**(12)** బలెన్.—

"శ్యామాత్న్నము వొంచె శోచ్యతను బ్రేమః ప్రేక్షణీయాత్మతన్
గామాస్త్రీక్షతిఁ బర్ణశోషణ ముహుశ్చార్క్రింతన్ బలెన్ మాధవిన్

— శాకుంతలము

శ్యామారత్నము... మరుత్కాంతన్ బలెన్ మాధవిన్ శోచ్యతను పొందెను.—అనివాక్యము. ఈవాక్యము సర్వథా చెడిపోయినది.—

"పోలె బలెలు పరంబులగుచో నామ తచ్ఛబ్దార్థములకుఁ బ్రిసమ యగు"నని ప్రౌఢవ్యాకరణము. కావున, 'మరుత్కాంతన్ బలెన్"అని ద్వితీయమీఁద 'బలె'నుజెప్పుట మొదటితప్పు.

(13) ఉపమేయ మేవిభక్తిలోనుండునో, ఉపమానమును అదే విభక్తిలో నుండవలయునన్న విధికి విరుద్ధముగా, ఉపమేయమయిన శ్యామారత్నమును ప్రథమలోను, ఉపమానమయిన మాధవిని ద్వితీయలోను చెప్పుట రెండవతప్పు.

(14) "శ్యామారత్నము........బలెన్ మాధవిన్......పొందెను." అని, ఉపమావాచకమయిన 'బలె'ను — ఉపమానమైన— మాధవికి ముందే చెప్పుట మూఁడవతప్పు "వాఁడు మన్మథునివలె అందగాఁడు;" అనుటను—'వాఁడు వలె మన్మథునిఅందగాఁడు'—అనుటయు, 'ఆమె, రతిదేవి కరణి అందగత్తె"—అనుటను, 'ఆమె, కరణి రతిదేవి అందగత్తె-' అనుటయు తగదు—.

(15) మరుత్కాంతన్ బలెన్ మాధవిన్.—

అని విశేషణ విశేష్యములకు నడుమ- ఇవార్థకమైన 'బలె'ను చొప్పించుట నాలుగవ తప్పు.

వ్యాకరణ మేయేటఁ గలసినను.—

'అతఁడు, సొంగున్ బలెన్ మన్మథున్ సొగసుకాఁడు'. 'ఆమె మేను, నూతనను, చాడ్పున చంచలను సొగసైనది.' అను— వాక్యములను, ఏ తెనుఁగువాఁడైనా, వ్యాకరణపు వాసన యెఱుఁగనివాఁడైనా వ్రాస్తాఁడా!—

"ఏని పరిభృతి శబ్దములు కొన్ని నియమసాపేక్షములయియుండు"

— బాలవ్యాకరణము.

కొ్రొత్తవ్యాకరణమువ్రాసి, తెలుఁగునకు సమగ్రమయిన వ్యాకరణము లేదన్న కొఱఁతను దీర్పనెంచిన శ్రీశాస్త్రులవారిట్టి వాక్యమును వ్రాసియుంటచాలచిత్రము!!

(16) వచనదోషము;—

"మీవశమిందు వృక్షములనీడలు నీళ్లు: దపోర్హభోజనం
బేవొఫలంబొ, వేరొ, యవి యెల్లను."

ఉ. రా. చ.

భోజనమూ, భోజనమైన ఫలంబూ, వేరూ, ఏకవచనమునే యున్నందున—'భోజనం బేవొ'—అనవలెను.' తపోయోగ్యమైన అశనమేదో—పండో- వేరో అనికూడా మీ స్వాధీనము'- అనిమూలమున స్పష్టముగా నున్నది.

మూలము.—......"యదపి తపసాం యోగ్యమశనం
ఫలంవా మూలంవా తదపి నపరాధీన మిహ వః"

కాఁబట్టి 'భోజనం బేవొ' 'అవియెల్లను' అని బహువచనముగా చెప్పుట, వ్యాకరణానికీ- మూలానికికూడా విరుద్ధమే.— 'ఏవో' 'అవి యెల్లను' అనిదిద్దబోతే ప్రాసను తప్పుతుంది.

(17) అగుపడు.—

ఉం. ప్ర. రా. విమర్శ (279 పుట)లో.— "కవితాతత్త్వ మగుపడుచున్నదా!" అన్నారు శాస్త్రిగారు.

'అగుపడు' అను క్రియ గ్రాంథికభాషలో —అగపడను. అది 'అగపడు' అనుధాతువు యొక్క- అపభ్రంశరూపము శాస్త్రిగారు వాడదఁగినది కాదు! కానేకాదు!!

(18) సమాసము —

ప్రాచీనులు, 'తీపపాత్రలు;' 'కోర్కులతలు' అని తెనుగుతో సంస్కృతమును చేర్చి మిశ్రసమాసములను చేసిరిగదా యని శ్రీశాస్త్రిలవారు 'మంత్రికొంగ'లు అని సంస్కృతముతో, తెనుగుం గూర్చి యొక మిశ్రసమాసమును చేసినారు.

ఆమంత్రికొంగల బలముననేయేమో, తాము శాస్త్రినర్మాలయములో 'కవిగూబ'ను ప్రవేశపెట్టిరి (తత్త్వబోధ). మీధోరణిని బట్టిచూడఁగా,—

కవిబాకినోటి మెకము (కవిసింహము.)
కవియేనుఁగు (కవికుంజరుఁడు)
కవి పెద్దపులి (కవిశార్దూలుఁడు)
కవియెద్దు (కవిపుంగవుఁడు)
కవిబొట్టు (కవితిలకము)

అనుసమాసముల కల్పించుటను తాము వెనుదీయరని తోఁచుచున్నది. మీరచనకేమేని శాస్త్రాధారముకలదా?

శాస్త్రముమాట దేవుఁడెఱుఁగునుగాని, కవిపుంగవుఁడు- అను, నర్థమున- 'కవియెద్దు' శాస్త్రసమ్మతమైనా, అట్టి బిరుదు ధరింప తాము సమ్మతింతురా?

## IV గ్రామ్యము:—

(19) ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శములో— పీఁకు, మిటికికాళ్ళు (విషయ సంగ్రహాదికము —పుట 21) గ్రామ్యము లన్నారు శాస్త్రిగారు.

తమఆంధ్రదశకుమార చరితములో— "ఒడలంతయు 'ము సీ[illegible]' ముద్దయై వెండ్రుకలను......పీఁకించుకొను..." అనియు, '[illegible] —

'వేకాళ్ళ, వలసకు వెరవు' అనియు. ఆ గ్రామ్యపదములనే ప్రయోగిం చారు. అంతకంటెను మఱి గొప్పప్రమాదమేమికావలెను?

(20) వాక్యదోషము:—

'దాని సౌభాగ్య లావణ్యలక్ష్మీ సమాకృష్టచేతస్కుఁడై'

—శృంగారనైషధము. పు. 174

'సమాసగర్భగతపదముతో వ్యస్తపద మన్వయించుట' అను దోష మున కీ వాక్యము గుఱి యగుచున్నది. ఇట్టిరచన తప్పని శ్రీశాస్త్రిలవారు' ఆం. ప్ర. రా. విమర్శలో- వి. సం. పుట 4 లో వ్రాసియున్నారు.

V పాఠనిర్ణయప్రమాదములు.

(21) శ్రీవారు శృంగారనైషధమున సాహసించి పెక్కుతావుల దిద్దినారు. ఆదిద్దుపాటులలో పెద్దపెద్దపొరపాటులు చాలదొరలినవి. ఒకటి రెం డుదాహరింతును.

గీ. కొన్నిజీవులు చిదిపి తాల్గొఱికి బ్రతుకు;
కొన్ని నునుసోగ వెన్నెలల్ గ్రోలిపాదలు
భిన్నరుచులైనవానికిఁ బ్రీతిసరియ;
తగవుగా దింమలోన నేకతరగర్హ.

—3. ఆ. 140

పద్యమున నాల్గవ పాదము చివర, పూర్వపాఠము—'ఏకతవిగర్హ' యని యుండఁగా, శ్రీవారు- 'ఏకతరగర్హ' అనిదిద్దినారు. కాని యప్రభ్రంశము వారిమతికెక్కినది కాదు. పూర్వపాఠమునను వారిపాఠమునను కూడ యతితప్పె

(22) ఎట్టఁదనముకాదు. ఒట్టఁదనము.—

"మిసిమిగల పుల్లపెరుఁగుతో మిళితమైన
యావపచ్చళ్లు చవిచూచి యాదరమునఁ

బొబ్బ మరి మార్గములు తాఁకి యెఱ్ఱఁదనముఁ
బొగలు వెడలింప నాసికాపుటములందు''

—నైష-6 ఆ. 130.

శాస్త్రిగారి అర్థము:—

"నూతన కొంతిగల పుల్లపెరుఁగుతో కూడుకొన్నవి, ఆవపచ్చళ్లను, చుఱ్ఱు మని, తలల కెక్కి, ముక్కు దొప్పలయందు, ఎఱ్ఱఁదనమును, పొగలును, వెలికివచ్చునట్లు చేయుచుండఁగా (కర్తపచ్చళ్లు) రుచిచూచిరి. 'పొగలు వెడలింప' అశక్యమగు వఱకును సేవించి రనిభా.''

'ఎఱ్ఱఁదన'మనఁగా- ఎఱుపురంగు. ఆవపచ్చళ్లకు ఎఱుపురంగేమి? ఆరంగు ముక్కులనుండి వెడలించుటయేమి? —శాస్త్రిగారు, ఆవ (మామిడి) కాయపచ్చళ్లనుకొనిరేమో! ఇవి అవికావు. ఇవి ఆవాలపచ్చళ్లు.

ఇంతియును అది, యెఱ్ఱఁదనము కాదు. ఒఱ్ఱఁదనము. ఒఱ్ఱనయన్నను 'ఒఱ్ఱఁదన' మన్నను కారము-అని యర్థము ఔత్తరాహుల కీ 'యొఱ్ఱఁదనము' సుపరిచితము. శ. ర. కర్తకును పరిచితమే. శాస్త్రిగారాయనగారితో ఆలోచించి అర్థము వ్రాయలేదు.

ఆవపచ్చళ్ల కారము (గాటు, కాదు 'ఘాటు') నెత్తికెక్కి ముక్కులనుండి వెడలుచుండఁగా, పెండ్లివారు భుజించిరి, అని యర్థము. శాస్త్రిగారి పాఠమున అర్థములేదు.

## VI కల్పనాదోషములు:—

(23) క. చల్లని వెలుఁగని యీ జా
బిల్లిని డాసితిని గంధు పేరటి పొదరే
యిల్లయి రేలఁగ మంటలు
నల్లెను [illegible] —(హంస)

“నల్లనివెలుఁగని యీ చంద్రునిఁ గూర్చి వచ్చితిని. ఇది చంద్రుఁడు గాఁడు.? మఱేమనఁగా, మచ్చయనెడు పొదలో నివసించి మంటలు మండెడు కొఱవిదయ్యము.”—(వారిదే వివరణము)

శాస్త్రిగారి యీ కొఱవిదయ్యము—“గగన మను రుద్రభూమి నేకతమ తిరుగు నవరు లుమిసెడు కొఱవిదయ్యంబు వీఁడె.— అను నైషధపద్యమునుండి యెరవు తెచ్చుకొన్నదిగాని, సొంతము కాదు. కాకపోయి నంతమాత్రాన—‘శాస్త్రికవనం పూర్వకవుల ‘ఉమ్మిపడగం ‘తమ్మపడగం’ అని ‘స. నా. కొచార్య’ వలె నవివేకముగా నే నాక్షేపింపను.

‘నాస్త్యచౌరః కవిజనః’

రుద్రభూమిలో, అవరు లుమియుచు భయంకరముగా ఒంటరిగాఁ దిరుగు కొఱవిదయ్యము, శాస్త్రిగారి కవిత్వమున పొదరింటిలో దూరుట మాత్రము చిత్రముగా నున్నది! కొఱవిదయ్యాలు పొదలలో కాఁపురముండునా! ఎప్పుడూ మంటలుమండే కొఱివిని పొదరింట్లో పెట్టితే పొదరిల్లు బొగ్గైపోదటయ్యా, నీకవిత్వం బంగారుగాను! ఏమో లెండి, అది దయ్యంగదా?

అయ్యో,

ఆపొదరిల్లయినా—ఆదయ్యముండుటకు చాలినంతది కాదే. చంద్రుఁడు దయ్యమఁట; (ఆతనిలోని) మచ్చపొదరిల్లఁట!-ఆదయ్యము—తనలోని మచ్చలో తాను కాఁపురమున్నదఁట.. ఇదేమికల్పనమయ్యా! విపరీతకల్పనము! వారెంతటి సర్వతంత్ర స్వతంత్రులైతే మాత్రము మచ్చలో చంద్రుఁడున్నాఁడంటే లోకము మెచ్చుతుందా!—

ఈలాంటి వర్ణన మేకవియైనా చేశాడటయ్యా!

(24) శా॥ వ్యామవ్యాస్త్రము దక్షిణానిలము, భావ్యత్పల్లవ వ్రాత మా
గ్నేయాస్త్రంబుఁ, బ్రఫుల్లకాంచన సుమానీకంబు బ్రహ్మాస్త్రముల్

స్ఫాయత్కోకిల కాహళార్భటి యిదే నారాయణాస్త్రం బయో
కాయోత్పన్నుఁడు నాలుగస్త్రములతోఁ గాఱించెడిన్ సెచ్చెలిన్!

—ఉష.

పద్యమున, మలయవాయువు, చిగుళ్ళు, సంపెఁగలు, కోకిల స్వనము— 4- బాణములుగాఁ జెప్పఁబడినవి. స్వయం పంచబాణుఁడైనవానికి నాలుగు బాణములనే చెప్పుట మందము.—మృదువులయిన (అతని) అరవిందాది బాణములకైదింటికిని బదులుగా అతి క్రూరములయిన, ఆగ్నేయాస్త్రాదులనైదింటిని చెప్పి అతని పంచబాణతను నిలుపుట గుణము.

(25) వాయువును వాయవ్యాస్త్రముగను, చిగుళ్లు ఎఱుపుగావున ఆగ్నేయాస్త్రముగను, సంపెఁగ బంగారువన్నె కలదిగావున బ్రహ్మాస్త్రముగను చెప్పుట యొప్పేగాని, కోకిలశబ్దమును నారాయణాస్త్రమనుట సరికాదు. ఎందువలన ననఁగా- (అస్త్రముగాఁ జెప్పఁబడినది, కోకిలరుతముకాని కోకిల కాదు) ఆరుతమునకు నారాయణలక్షణమగు నలుపులేదు. కోకిల నలుపుగావున దాని కూఁతయు నలుపనుట- నల్లావుపాలు నల్లఁగా నుండు ననుటయే.

(26) శాస్త్రిగారు, 'కాఱించెడిన్' అని శకటరేఫముగా వాడినారు. అదితప్పంటాడు శ. ర. కర్త. మఱి తామేమంటారో!

(27) కాహళి యనఁగా 'సన్నాయి' అని వ్రాసినారు శాస్త్రిగారు. పొరపాటు. అది 'తుతారా'—అను నొకవాద్యవిశేషము. దానినే—'బాకా'— అనియునందురు. ప్రయోజనమునను నిర్మాణమునను గూడ- కాహళకును సన్నాయికిని కావలసినంత భేదమున్నది.

'సన్నాయి' గొప్పవాద్యము; రాగాలాపము చేసి, కృతులు, వర్ణములు, జావళీలు హాయిగా వాయింపననువైనది. ఆ వాద్యగానికి నూర్లు-నూర్లు బహుమానమిత్తురు.

కాహళి-అట్టి జంత్రము కాదు. ఉత్సవములలో వినోదార్థము-'సకృత్తు'గా తు-తు-తు-తూ అను శబ్దము చేయుటమాత్రమే వినియోగించునది. దానినూదువానికి-పావలా, అర్ధా, యిత్తురు.

'సన్నాయి' ఒకటే గొట్టము. 'కాహళి' అనేకములయిన చిన్నచిన్న గొట్టపు ముక్కల నతుకుటచేత నేర్పడునది. ఈవిషయమును తిక్కన్న చక్కఁగా తెలిపియున్నాఁడు-

క. లలిత పదస్వాద్యపద్యం
బులన కథాంగంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలు 'గా
హళ' సంధించిన విధంబు నమరఁగవలయున్.

—నిర్వచనోత్తర రామాయణము.

'మొల్ల' ను 'మల్లె' అన్నందుకే- 'కేడీ' లనీ 'అసలుకేడీ' లనీ, 'దొంగ' లనీ 'తోడుదొంగ' లనీ పండితులను కోపము చేసిన మా స. నా. కయ్యా అయితేనా, 'తుతారా' ను 'సన్నాయి' అన్నందుకు, శ్రీ సర్వతంత్ర స్వతంత్రుల నెంతగా కోపించునో గదా?

సుబ్బాశాస్త్రిగారూ,

మీ యధిక్షేపము తప్పని చెప్పుటకు శాస్త్రిగారి యీ తప్పులు చాలవా? ఈ తప్పులన్నియును 'జితకాశి' తో సమముగా మీ 'అదన్నము' న కెక్కవలసినవే.—"తదల్పమపి నోపేక్ష్యమ్."— అన్న శ్లోకము మీకు స్మరణకుఁదేఁజాలినవే. ము. నా. రెడ్డిగారి అచ్చుతప్పు 'దేవాదేవేషు' లకు తగినవే, ఏమంటారు?

ఇట్టివి, యింతకుమించినవి దోసఁగులు శాస్త్రిగారి కృతులలో నేను చూచినవే యనేకములు కలవు. వానినెల్ల వెల్లడింప వలయునన్న తలఁపునా కింతయు నెన్నఁడును లేదు, ఇప్పుడును లేదు. అట్టి తలంపే యుండి.- దానికి

మీకున్న తెంపు, 'ఎవ్వరేమనుకొన్న నాకేమి'-అను గడుసుదనమూ, పిన్న పెద్దల అంతరువును గమనింపని ధార్ష్ట్యమూ తోడైయుంటే- మీవలెనే నేనూ-ఒక పెద్ద 'అదర్శము' నెత్తియే యుండెనా! అందులో శాస్త్రిగారి దోషాలన్నీ యేకరువు పెట్టే యుండెనా?

తప్పులను వెదకుటలో తమవంటి గొప్పపండితుడను కాకపోయినా బొత్తిగా నేరనివాడనుగాను. అయితే అపని నాకు సమ్మతమైనది గాదు.

ఇట్టివాడవు మఱి, నాడు మా శాస్త్రిగారి మేఘసం వ్యాఖ్యానమును గూర్చి ఎందుకుచర్చించితి వందురు గాబోలు తాము? అది ద్వేషప్రేరితము కానట్టి కేవలభాషాచర్చయగుటచేతను, అదియును అధిక్షేపము కాక అభ్యర్థన మగుటచేతను అకాలమున నేటిరీతి పగలూ పార్టీలూ లేకపోవుటచేతను ఆ చర్చ సాగించితిని. కాని, నాటి నాచర్చవలననూ, శ్రీ తాపీధర్మారావు నాయుడుగారి విజయవిలాస వ్యాఖ్యాన చర్చవలననూ, మనస్సునొగిలి, శ్రీ శాస్త్రిగారు తమమనోవ్యథను బ్ర. వేటూరి ప్రభాకర శాస్త్రిగారితో చెప్పికొనిరనియు, బ్ర. దుర్భాసుబ్రహ్మణ్య శర్మగారికి వ్రాసికొనిరనియు, విని చాలపశ్చాత్తాపము నొందితిని.

ఏమైనను, అవిమర్శ, నాడు ప్రకటితమైయుండుటచేత సరిపోయెగాని నేడైనచో "మా శాస్త్రిగారు బ్రతికివుండగా వ్రాసివుంటే, ఈ పిచ్చయ్య సంగతి తెలిసివుండేదే" అను కైతవపు టాక్షేపమొకటి వచ్చివుండేదేగదా అని యిప్పు డనిపించుచున్నది.

నేడైనను-నాకై నేను, బుద్ధిపూర్వకముగా శ్రీ శాస్త్రిగారి రచనలపై దాడివెడలి 'విమర్శాదర్శము' లెత్తినవాడనుకాను.

ఉ. చిత్తమునొంచు వాక్యములచే గసలించియు, 'తత్త్వబోధ' లో
ఉత్తయబద్ధముల్ గిలికియుండ్రు, మఱి 'దీమస' మందు నంతగా
నొత్తిడి చేయుచున్న-నిటు లూరక నేను కళాప్రపూర్ణ వి
ద్వత్త నడంగియున్న పొరపాటుల నేటికి బైటఁ బెట్టుదు నా?

ఇంతకునూ 'శాస్త్రిగారి కృతులలోగూడా తప్పులున్నవని నాఁడు నేనన్నమాట' - నిరాధారమో సాధారమో మీమనసునకు వచ్చినట్లేనా? మీ ఆధిక్షేప మనుచితమని సిద్ధాంతమైనట్లేనా? అంతకే కదా నాయాతురమంతయు.

ఏమయిననూ సుబ్బాశాస్త్రిజీ! మీరు త్రొక్కినది చాలతప్పుత్రోవ. లోకము-లోని పండితులను నిరసించియు, వెక్కిరించియు, తొందరపెట్టియు నిట్లు మీగురువుల తప్పులను బయట పెట్టించుట ద్రోహమగునుగాని, వరివస్య కానేరదు. గురువులకు మంచి పేరు తెచ్చుమార్గమిది కాదు.

శా. లోపాలుండిన చక్కఁబెట్టుచు, సుధీలోకంబుతోఁ జెల్మి పెం
పేపారంగ మెలంగుచున్, గురువు పేరెక్కింత్రు లోకంబునన్
ధపారమ్యముగన్న శిష్యవరు, లంతేగాని, మర్యాద దు
ర్వ్యాపారంబున దించి, ముంచి. 'గలభా' పట్టింతురే దేశికున్?

ఉ. నా కతి విస్మయంబగు సనల్పయశంబు గడించుకొన్న సు
శ్లోకు గురున్ వివాదములలోనికి లాగి యిటుల్ సొనర్చినన్
లోకము నన్వనంచుఁ దమలోఁ దమరైనఁ దలంపరొక్కొ? యి
స్సీ! కడుహేయ మిట్టిపని చేయునె యెట్టి జడాత్ముఁడేనియున్?

పర్యవసానమింతే.—ఏటివాఁడో యెంత గొప్పపండితుని రచనలలో నైనను నెరసులు దొరకకపోవు. లోకమున కేవలము నిర్దుష్టమును కేవలము నిర్గుణమునునగు వస్తువు లేనేలేదు.—

'దృష్టంకిమపి లోకేస్మిన్న నిర్దోషం ననిర్గుణమ్'

అని పెద్దలెన్నఁడో అన్నారు. కావున 'మాగురువు కావ్యములన్నీ నిర్దుష్టములు, ఇతరుల కృతులన్నీ దోషభూయిష్ఠములు,' అనుకొనుట

పొరపాటు. మఱియు 'మా గురువు సర్వజ్ఞుఁడు, మేము సర్వజ్ఞులము, తక్కిన లోకులు, అజ్ఞులు; కాదా? అల్పజ్ఞులు అనుకొనుటయు నట్టిదే. ఇదియే కదా యీకోలాహలమున కంతకూ మూలము.

క. "ఎవఁడయ్యా తప్పనియని
కవివర్యుఁడు? పండితప్రకాండుఁడు నిల? మా
నవసహజంబు ప్రమాదం;
బవునే అజ్ఞానిగఁ జెతు నన నెవ్వరికిన్?"

అని మీకిదివఱకే- చెవినిల్లుగట్టుకొని చెప్పితిని. లాభమేమి? 'చెవిటి కూదినశంఖ'మయ్యెనే గాని, నామాటలు మీచెవికెక్కకనే పోయెఁగదా! నామాట- మీరేకాదు ఎవరైనను సమ్మతింపఁదగినదే. తాము దురభిమానమున శఠించి ఫలములేదు. మీ 'జబర్దస్తీ' తగ్గించుకొనుట మీకు లగ్గు. మూరెఁడు పొంగి- బారెఁడు కుంగుట పరువుకాదు. వాస్తవము నెఱిఁగిన వారిని వంచించుటకు వలనుపడదు. 'మర్మజ్ఞం నైవ కోపయేత్'

మిత్రమా,

కాలేజీ కమిటీవారు కరుణించి యిస్తూవున్న కాసులతో పొట్ట పోసుకొంటూ, చేతనైనంతలో, శక్తివంచన లేకుండా, ఆ పిల్లకాయలకు అవసరమైన ముక్కలు చెప్పుకొంటూ, తోఁచిన పద్యమో గద్యమో గొణుగుతూ హాయిగా, ఆనందముగా కాలము గడపుకొనవలసిన మన కీపోరు గొడవ యెందుకు? దీనివలన, పరువా? ప్రతిష్ఠయా? భుక్తియా? ముక్తియా?

నిజమాడిన నిష్ఠురము గాని నేఁటి యీనిరర్థక కలహమునకు మూలము మీ 'ఆదర్శపు' టార్భాటమే' గాక మఱి యొకటియేమి?. నిజానికి మనము, 'ఆదర్శము' లెత్తఁదగిన పండితులమా? లోకములోని యెల్లకావ్యములను దిద్దఁజాలిన పెద్దపరిశోధకులమా? మనకు సంస్కృతమా రాదాయె, తెలుఁగా

తెలియకపాయె మనప్రగల్భాలు మన బడి పిల్లకాయల యెద్దనేకాని, పండితుల యెద్ద పనికిరావాయె. మఱి, మనకేమిటికయ్యా, తలకుమీఱినపనులు? మన మెంత! మనజ్ఞాన మెంత! అనుకొనక మీ రెల్లవారిమీఁదను నెగఁబడి విమర్శలు వ్రాయఁదొడఁగితిరి. ఆవిమర్శల లోనైనను సరుకా? సారమా? యుక్తియా? రక్తియా? పోనీ, ఒక్కవాదమునైనను మీరు మీమాటను నెగ్గించుకొనఁ గలిగితిరా? యేదీ?

(ధ. వెం. సుబ్బయ్యగారి సంపాదనము)

1. ఏ. వి. నరసింహం పంతులుగారితో సంతగించితిరి. చచ్చిచెడి చాయంగల విన్నపములై, ‘అపాలజీ’ తో బైటపడితిరి.

2. ‘శ్రీకృష్ణ రాయబారము’ తప్పంటిరి. ‘శుద్ధయుత్తెము’ లు చూపఁగనే ముడుచుకొంటిరి.

3. నారాయణరావుగారితో ఢీకొంటిరి. కళామాత్ర ప్రకృతిక జ్ఞానముకూడా లేదని సిద్ధాంతము చేయించుకొంటిరి.

4. ‘ద్రాఘిష్ఠ’ తర్కమునకు దిగితిరి. దానితో మీ సంస్కృత వ్యాకరణానభిజ్ఞతను వెల్లడించుకొంటిరి.

5. గజకచ్ఛప యుద్ధమున ‘నారాయణు’ ని నిలుపఁబోతిరి కుదురు కుదరక కూలద్రోసితిరి.

6. బారుబూరున ‘శాస్త్రి విజయధ్వజ’ మెత్తితిరి; అదిపట్టి తప్పులు తడికె,– నిందా ప్రధానము; కలహకారణము, అని ‘ప్రతిభ’ చే ననిపించుకొంటిరి.

7. ‘తత్త్వబోధ’ లకు దిగితిరి. పద్యరచనలో, గురులఘువుల స్వరూపముఁగూడ నెఱుఁగని ‘ధీశాలురు’ అని ప్రసిద్ధి పడసితిరి,

ఇంతటి యనుభవము మీఁదనైనను, తమ పాండిత్యపు పొరను తమకు మనసుకు రాలేదుగదా!

ఇప్పటికినీ, 'నీగ్రంథమును విమర్శింతును— నీగ్రంథమును విమర్శింతును'' అని మముబోంట్లను బెదరించుతూనే యున్నారుగదా? ఎవరిగ్రంథాన్నిగానీ విమర్శించడానికి తామెవరు? తామెవరిలో తప్పులుపట్టినా అందుకు బదులుదెబ్బ మీ శాస్త్రిగారికే తగులుతుందని– అనుభవముమీఁద తమకు తెలిసేయున్నదిగదా? తప్పులులేనివాఁడు ప్రపంచంలో లేఁడని చెప్తూతూవున్నా. మీకా భ్రాంతిపోదేమయ్యా!

ఈపాటి తప్పులతో మాశాస్త్రిగారికీ ర్తికి యేమి క్షీణించెటావా? అట్లయితే, ఎవరుచూపిన యే తప్పులతో యెవరికీ ర్తికి మాత్రమేమి క్షతి? మితిమీటిన మీ 'ఆర్భాటము'ల వలన గురుపాదుల పేరు నీరసిల్లినదేగాని, మఱేయేమి తారసిల్లినది? మీరింతటితోనైనను, పరాక్షేపణరూప పాపకార్యము నుండి విరమించి పండిత సమ్మతమైన వర్తనము నలవఱచుకొని నను వంటివారిపై కయ్యాలకు కాలుఁ దువ్వుట మానుకొనుఁడు. మీ రేమో మహాపండితులైనట్టు, నాగ్రంథమును విమర్శించటం– నేనేమో మహావిద్వాంసుఁడనైనట్లు, మిమ్మ పూర్వపక్షము చేయటం చూచి నిజమైన పండితులు 'వాం దూ–దొందే' అని నవ్వుతారు. నామాట వినండీ. నవ్వుతూ, పేలుతూ, సరస సల్లాపాలతో, తొడియొజ్జలలో, ఇంత మర్యాదగా కాలము గడుపుకొందాము. మనకు పగలెందుకు? పార్టీలెందుకు? మీరొకరు విరమించితిరా, నెల్లూరు పండితులందఱునూ, నిశ్చింతముగా సుఖిస్తారు. నామనసులోని మాట చెప్పినాను. వింటిరా? పదివేలు. వినకుంటిరా? నూటపదివేలు.

# దీమసమే !



దీమసంబుగాక దీనత యేలయ్య
ఉలుకులేక నిజము పలుకునాకు?
కల్లి బొల్లి జల్లు లల్లి, చెల్లకపోవ
డిల్లపడిన తమకుఁ జెల్లుఁగాక!

దీమసంబుగాక దీనత యేలయ్య
సాహసరణి చర్చ సలుపునాకు?
తప్పువాఱిఁత వాఱిసి తప్పించుకొనలేక
తత్తరిల్లు తమకె తగునుగాక!

దీమసంబుగాక దీనత యేలయ్య
కొలఁదియెఱిఁగి తలఁగి మెలఁగునాకు?
అలవిగాని పెద్ద 'ఆదర్శము'ల నెత్తఁ
బోయి చెడిన తమకుఁ బోలుఁగాక!

దీమసంబుగాక దీనత యేలయ్య
తారతమ్యమెఱిఁగి తనరునాకు?
తలకుమీఱుపనులు తలపెట్టి తుదముట్ట
కగుపడిన తమకె యగునుగాక!

దీమసంబె కాక దీనత యేలయ్య
గురు యశంబు నిల్పుకొన్న నాకు?
పరులఁ జెనకి ఆత్మగురువు కీర్తి రోఁత
చేసినట్టి తమకుఁ జెల్లుఁగాక!——

సుబ్బాశాస్త్రిగారూ,

మీధార్ష్ట్యమును మీరు కాదనకపోతిరి. నాదీమసమును నే నొప్పుకొనుచుంటిని. ఇఁక మనకు వాద మేమున్నది? ఏమియును లేదు; కాఁబట్టి.

మనము మనము. కలిసి మంచిమాటలతోడ
మనము మనము కలిసి మనుద మింక!
గురులు కూర్చుకొన్న గురుకీర్తి కాక పెద్ద
ముచ్చుకూర్చనేల మచ్చరమున?

ఓం. స్వస్తి.



ములుమూడి నారాయణరెడ్డి

# కాలగతి తలపోతలగతి



## 5 అచ్చుతప్పుల ప్రహసనము.

'కాలగతి తలపోతల'గతి తుదిఫారము ముద్రణములోనుండఁగా * భీమరాజు సత్యనారాయణ బి. ఏ. అనువారు, 'నూత్నగ్రంథాభినందన' మంటూ, ఒకగ్రంథకమును బైటపెట్టినారు. మామిత్రులు ధ. వెం. సుబ్బయ్యగారు ఆగ్రంథకమును నాకు దయచేసినారు.

చదివి చూతునుగదా!—'కాలగతి తలపోతల'నుగూర్చినదే ఆయభినందనము!! 'దూషణముతోఁ గూడిన యీగ్రంథమగ్రాహ్యము' అని అభినవసరస్వతిచేత (నాతొలిపలుకు పుట 5 చూ) నిరసింపఁబడిన దానిని భీమరాజుగారు బట్టురాజువలె పొగడి— 'అహో! రూప మహో! స్వరః'—అన్నశ్లోకమును తలఁపించినారు. బ్రి. చెళ్లపిళ్ల విద్వత్కవిని ఒకటియని వేదం పండితుని పదియనిపించి, ము. నా. రెడ్డిఁ వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడి స. నా. కయ్యా; అక్రమవాదమునఁబడి, అవతలి యొడ్డు చిక్కక 'దీమస' కర్తలు అగడ్తలోఁబడ్డ పిల్లులవలె అగచాట్లుపడు

---

* భీమరాజుగారు మాకు క్రొత్తవారుకారు. వెనుక పదేండ్లకిందట— మేఘసందేశ విమర్శలో నక్రమముగ నసుగుపెట్టి పండిత ఆకిలి శ్రీరామశర్మగారిచేత, అనువైనదెబ్బతిని అంతులేకుండా పోయినఘనులే! శ్రీశర్మగారిపేరు రాజుగారిగుండెలలో ఇప్పటికీ మెదలుచున్నది. కాబట్టే—ఈవాదమున నెట్టిసంబంధము లేకపోయినను శర్మగారిపేరును ఎట్లో ఒక్కమాఱు సంస్మరించుకొన్నారు.

చున్న యీ సమయమున— వారిముగ్గురిని ఒక్కతాటిఁగట్టి—రెడ్డిగారి ఆస్థానపు బూతు, బళా! భళీ!! బళా! బళీ!! అని కైవారము చేయుట హేళన (Rediculе) యగునో హాస్యమగునో రసికలోకమే నిర్ణయించుఁ గాక.

బి. వెఙ్క్యా. భీమయ్యగారు, అభినందనమన్న వ్యాజమున,— స. నా. కుని దుర్బలాక్షేపముల కేమో గతిగల్పించు ప్రబలప్రయత్నముతో ఆ గ్రంథఃమును ప్రారంభించినారు. వ్రాఁత అయోమయముగానున్నది. స. నా. కయ్యావ్రాఁతకు సమీపబంధువుగానున్నది. ఆయన తడవిన యెల్లవిషయములు నాగ్రంథమున గతార్థములేకావున వాని కిట ప్రత్యేకప్రత్యుత్తరములు పని లేదు. అయినను.— 'అపండితుఁడు'ను, 'అకవి'యునుగాని ఆ రాజుగారి సమర్థనచాతుర్యము లోకమునకుఁ దెలియుటక్కై ఒక్క విషయమును మాత్ర మిక్కడ చర్చింతును.

శ్రీశాస్త్రిగారు, కుందానికి మల్లెను పర్యాయముగా పలుతావుల వ్రాసియున్న సంగతి యెఱుఁగక — స. నా. కాచార్యుఁడు — తెలివితక్కువగాఁజేసిన ఆధిక్షేపమును చక్కపెట్టుటకుగా రాజుగారు గొప్పయుక్తి సన్నినారు. ఏమిటయ్యా ఆయుక్తి అంటే:—

"శాస్త్రిగారి మేఘమున 107 వ పుటలో, 'మల్లె' అని; ఆశ్లేష 232 పుటలోను, బిల్హణీయము 60 వ పుటలోను, 'ఉషలో' 10 పుటలోను (6 పుట?) 'మల్లె' పడియుండుట అచ్చుపొరపాటుగాని వేఱు గాదు"— అనేదే.

ఆరాజు 'అపండితుఁడూ' 'అకవి' కాని ప్రభావసిద్ధికాఁబట్టి తోఁచి యుండునుగాని, లేకున్న నిట్టి అనితరసాధారణమైన యుక్తి తోఁచి యుండునా! బాగానేవున్నదిగాని, అవి అచ్చుతప్పులైతే మఱి ఆయా శుద్ధపత్త్రములలో . ఒకటికి రెండు 'ఎడిషను'లలోఁగూడా—ఒక్కచో

టనైనను చేర్పకపోవుటేల?—అన్నప్రశ్నము పుట్టి గొంతును గట్టిగాపట్టుకొనునని రాజుగారికి తోఁచలేదు. రాజుగారు శాస్త్రిగారిపుస్తకాలయినా చక్కఁగా చదివినవారుకారు. శాస్త్రిగారి కుందపుమల్లెలు అనాలు గే ననుకొన్నారు. పాపము! అపత్సమయముగనుక అబద్ధానికైనా ఒడిగట్టి—అచ్చువారితప్పని చెప్పి, తిన్నఁగా అవతలఁబడదామనుకొన్నారు. అవూ యిక్కట్టు!— కాని అది అంతసులభమయినపనికాదు.

అచ్చుతప్పులని చెప్పితప్పించుకొనఁజూచువారింగూర్చి శ్రీ శాస్త్రి గారే యిట్లువ్రాసియున్నారు.

"నేను చూపఁబోవు దోషములన్నియు నచ్చుఁ దప్పులనివాదించు శోధకులకేనియుం, దన్మిత్రులకేనియు మఱియు ద్వేషులకేనియు సంకల్పము పొడమవచ్చును. కాని పామరుని కింటెలియని మణిగాచ భేదము మణికారునికి అసందేహముగాఁ దెలియు రీతిని, అచ్చుఁ దప్పేదో (అసలు) తప్పేదో పండితులకుం దెలియుచునే యుండును. (అసలు) దోషముకు గుర్తులు ప్రాయికముగా విశ్వసింపఁదగినవి యొకకొన్ని యివిగో:-

(1) వచ్చిన తప్పు పలుమాఱువచ్చుచుండుట"........

—కా. మా. ము. వి. పుట 13

శాస్త్రిగారి సూచనంబట్టి 'వారి కుందపుమల్లెలు అచ్చుపాఠ' లన్న వాద మెంతవఱకు నెగ్గునో విచారింతము.

# శాస్త్రిగారి కుందపుమల్లెల పట్టిక.

[కుందం=మల్లె]

| | ముద్రణము. | | సంవత్సరము. | పుట. | | ఎన్నిసార్లు. |
|---|---|---|---|---|---|---|
| భోజచరిత్ర | I | ... | 1890 | 145 | ... | 1 |
| | II | ... | 1909 | 119 | ... | 1 |
| బిల్హణీయము. | I | ... | 1893 | 61 | ... | 1 |
| | II | ... | 1911 | 61 | ... | 1 |
| మేఘసందేశము. | I | ... | 1902 | 107 | ... | 3 |
| | | | | 108 | ... | 1 |
| | | | | 232 | ... | 1 |
| | | | | 233 | ... | 1 |
| | II | ... | 1927 | 108 | ... | 3 |
| | | | | 109 | ... | 1 |
| | | | | 232 | ... | 1 |
| | | | | 233 | ... | 1 |
| విక్రమార్క చరిత్ర. | I | (దొరకలేదు) | | | | |
| | II | ... | 1909 | 105 | ... | 1 |
| అమరుకము. | I | ... | 1909 | 50 | ... | 2 |
| ఉష. | I | ... | 1901 | 5 | ... | 1 |
| | | | | 16 | ... | 1 |
| | II | ... | 1913 | 5 | ... | 1 |
| | | | | 16 | ... | 1 |
| | | | | మొత్తం | | 23 |

1890 మొదలు 1927 వఱకూ, 37 సంవత్సరములలో 6 గ్రంథములలో ఒకటికి రెండుముద్రణములలో శాస్త్రిగారు, కందము= మల్లె అని వ్రాసిన తావులు 23 అని యిప్పటికి లెక్క తేలినది. పరిశోధించిన మఱి యెన్ని బయటఁబడునో!

ఈ 23 న్నూ అచ్చుపొరలే అగునేమో!!! అహో! ముద్రాపకులద్రోహము! కంపాజిటరు 'రామస్వామి' తెంపరితనము! పగఁబట్టి శాస్త్రులవారి టీకలనన్నింటిఁ బాడుచేసినాఁడు ఈముప్పదియేండ్లుగా!! ఇప్పటికి నేనుదాహరించిన కందపుమల్లెలు, శాస్త్రిగారివి:—23; ఇతర పండితకవుల వివిధ గ్రంథములలోనివి:- II. శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, యం. ఏ.— శ్రీ విజయనగరం మహారాజావారి కళాశాలాపండితులు విద్వాన్ పేరి సత్యనారాయణశాస్త్రిగారు.- చిట్టిగూడూరు సంస్కృత కళాశాలా పండితులు, ఉభయభాషా, సాహిత్య విద్యాప్రవీణులు పి. వి. నరసింహాచార్యుల వారును, ప్రచురించిన యీసంవత్సరపు ఇంటర్ మీడియేటు నోట్సు మూఁడింటిలోను (నేను ఇటీవల చూచినని) కనఁబడినమల్లెలు 3,

మొత్తము 37

ఇట్లు వెదకుచుంబోయిన పదులుకావు. మల్లెలు నూఱు లగపడును. ఈ 37 న్నూ, కంపాజిటర్ తప్పులేనని అనువాఁడు గాని. అమాటనమ్మువాఁడు గాని వివేకు లలోనుండునా?

ప-మ లయతి సందర్భమున శ్రీ శాస్త్రిగారును, ప్రసుప్తగణ ప్రేష్ఠ పద్య కవిత్వమున 'అక్రొత్తూరి' ఘనుఁడును. 'దేవాదేవేషు' విషయమున నిన్న గాక మొన్న ము. నా. రెడ్డిగారును, (చూడు పుట. 21) అచ్చుతప్పనిచెప్పి తప్పించుకొనబోయి అగడుపడి యుండుట యెఱిఁగి యుండియు భీమరాజు గారు నేఁడు మరల అపాడు వాదమునే ప్రబలసాధనముగాఁగొని వచ్చుట కంటె అస్తావిస్తము మఱియుండునా? "ఎవడైన ఇది మల్లెయేకాని మొల్ల

కాదు అని అనుప్రాసయత్యాది స్వరనిర్ణయనిబంధనచే సాత్వకతో చిక్కన మల్లెనకుండమని వ్యవహరించినాడా?" అని భీమయ్యగారి దోకసవాల్. నా గ్రంథము - 34 పుటలోని 9 వ యుదాహరణమును. 97 పుటలోని వద వభాగమును చూచుకొనవలసిన దని నా జవాబు.

"ఇట్లు 23 తావుల 'మల్లె' లనివ్రాసినను వారు మఱి 10 తావుల 'మొల్ల' అనియే వ్రాసియున్నారు కావున తత్పృథక్త్వ విషయమున వారు అజ్ఞానులు కారు" అని రాజుది మఱియొక సిద్ధాంతము.

అట్టి సిద్ధాంతమును శ్రీ శాస్త్రిగారే యెట్లు ఖండించియున్నారో చూడండి.

"కొందఱు సందేహముగలవారై ఒకచోట నొకరూపము, మఱియొకచోట నింకొకరూపము ముద్రింపింతురు... ఆక్షేపించినప్పుడు, 'అదియచ్చు పొరబాటు మఱియొక పుటలో కనుడు' అని వాదింతురు."

—శా. నా. ము. వి. పు. 13.

రాజు సిద్ధాంతము రాళ్లపాలయినది. ఆరాజుగారి ధర్మాన శాస్త్రి గారికి-'మల్లీ కుందంభేద అజ్ఞానమే' సిద్ధాంతముయినది. నేనో-అందఱు పండితులతో పాటు శ్రీ శాస్త్రిగారుకూడా మల్లీకుందముల భేదము నెఱుగరనియు, ఎఱిగియే కవిలోక పరిపాటి ననుసరించి, అభేదముగా వ్రాసిరనియు సిద్ధాంతముచేసి యున్నాను.

'అపండితు' లు గాని భీమరాజువారు నా సిద్ధాంతము నొప్పక ఖండించిన ఖండింతురుగాక!

అయినా యిందులో నాకు తోచేవింత యేమిటంటే, నాగ్రంథము ముద్రణలో నుండగానే, అందులో నేమున్నదో తెలిసికోకుండానే, భీమన్న

గారికింత తత్తరపాటెందుకో! తన 'తోడుదొంగతనాల' వ్రాత రోతగానున్నదనీ అదినిలిచేమార్గం లేదనీ కర్ణాకర్ణిగావిని, దాని, కెట్లైనా ప్రాజ్యత్వం కల్పించటానికి, స. నా. కాచార్యుడే యిది వ్రాసినాడని కొందరు అంటూఉన్నారు. అదిఅబద్ధమో, సుబద్ధమో; ఏమైనా మహాకవి వాక్ప్రయోగశతఘ్నులకు వెఱచి, స. నా. కారుడు, ఆ అందదుకుల తడికెచాటున తల దాచుకోవటం మాత్రం శోచనీయము.

ఇంతటనైనా, ఆచార్యులవారు, వ్యంగ్యం, రసం, ఔచిత్యం, ఆభాసం, విప్రలంభం—అని పెద్దపెద్ద మాటలతో పామరలోకాన్ని ప్రతారించే పద్ధతి మానుకొంటే మంచిదని హెచ్చరించుచున్నాను.

---

# మలిపలుకు

నాకు విరోధము వింతకాదు. పగ తెచ్చుకోవడము నాప్రకృతికాదు. అట్లని, యెవరెన్నితిట్టినా, నన్నుకాదనుకొంటూ పడియుండడానికి నేనేమి శమదమాదు లభ్యాసము చేస్తూవున్న వేదాంతిని గనుకనా? అకారణముగా ఒకరిచేత మాటపడటముకు నామనసొప్పదు. ధ. వె. సుబ్బయ్యగారు ఉత్తపుణ్యానికి నన్ను 'కలహప్రారంభకు'నిగా 'శాస్త్రిద్వేషి'నిగా వ్రాయటముచేతనూ, ము. నా. రెడ్డిగారు మాగురువులను దిట్టడమే కాకుండా, జగడాల చీలిగైన ధ. వెం. సు. గారి వ్రాతనే నమ్ముకొని- 'స. నా. కాచార్య'చేత నన్ను దిట్టించడముచేతను, విద్యావిషయం కావడముచేతను, నేను ఆయీ ప్రత్యుత్తరములు వ్రాయడం సముచితమనే వ్రాశాను. కాని పస్తాయించిచూస్తే- కొలగటితలపోతలన్నీ ద్వేషోద్రిక్తపు వ్రాతలేగాని, కేవల విద్యావిమర్శలు కావని తేలినది. ఆవ్రాతలకు సమాధానములు

వ్రాయడముకూడా పొరపాటేనని యెరిపించుచున్నది.

స. నా. కొచార్యుల వ్రాతల పాలికెమున్నూ, అట్టివిట్టివ్రాతలను నివారింప వలసిన పెద్దలు వహించియున్న ఔదాసీన్యమున్నూ బట్టి ఆలోచించితే— ఇది శాస్త్రీయవ్యవహారముగాని పండిత వివాదముకాదనీ ఈవ్యవహారము, ముందుముందెట్టి విపరీతపరిణామముల పొందునో అనీ జంకుకూడా కలుగుతున్నది.

సర్వథా నామేలుగోరు మిత్రులొకరు—'నీవీ వివాదంలో యేలాగున ప్రవేశించావయ్యా'—అని నన్ను చాలదినముల క్రిందటనే మందలించినారు. నాటిమందలింపులోని భావము నేటికి నామనసున వచ్చింది. తొలుత తెలియక దిగినందుకు పశ్చాత్తాపపడుతూ— దూషణభాషణముల కెక్కు—సేయుని, బదులు వ్రాయని, శర్మ ధర్మారాయ ప్రభృతులే ధన్యులుగదా అనుకొంటూ నేనీవివాదములోనుండి తొలఁగుచున్నాను.

స. నా. కొచార్య ఇంక నూఱు మాఱులు స్వేచ్ఛతో ఇమ్మాఱులు తిట్టుగాక! బదులుపలుకను.

ధ. వెం. సుబ్బయ్యగారు 'నీ మేషుమాతను విమర్శిస్తా' నని బెదరించనే బెదరించిరిగదా! వారి బెదరింపున్నూ, వారి విమర్శనముకూడా ఇదే ఒక నమస్కారము.






సింహపుర పౌరప్రముఖుల కొఱకు విన్నపము

చ. కవి చతురాననుం గని, యఖండకలాకలనాత్త సద్యశ
స్థ్రవిరతఁగన్న సింహపురి, సాధువిగర్హిత దుర్వ్యవస్థకున్
బ్రవణత కగ్గమై, పరిసరస్థల పండితహాస్య పాత్రమై
చవి చెడుచుండఁ బెద్దలిది సభ్యముకాదన రేమి-చోద్యమో!

గీ. కవిత నెఱుఁగని-పాండితీకలన లేని
నాగరక నామధారి యీనాఁటి కకటు!
సింహపురిని విమర్శక శ్రేష్ఠుఁడయ్యె
పెద్దపెద్దల పేరులు పెన్నఁగలుపఁ!

ఉ. ... ల జాడలన్ దెలిసి, సాధువిమర్శల తీరెఱింగి, త
ప్పిది ... యని యొప్పటించు వచియింపఁగ నేర్చిన ధీరులార, కో
విద వరులార, సింహపుర విశ్రుత కీర్తిరమా విలాస సం
పద చెడకుండ, పండితవివాద మహానలమార్పఁ జెల్లదే.

ఆ. వె. తగవు చెప్పువేళ మొగమోట పడరాదు,
పక్షపాతవృత్తి పనికిరాదు;
పలుకరయ్య కుండ పగులఁగొట్టిన యట్టు
లొప్పెవరిదో, యిందు తప్పెవరిదో.